# పురోహిత దర్శని

అను

# జాతకాలంకారము



: పర్యవేక్షణ :

"వాస్తు విశారద" గోరస వీరబ్రహ్మచారి

తెలుగు విశ్వవిద్యాలయం "హైదరాబాదు" వారిచే ఆర్థిక సహాయం పొందబడినది.

: రచయిత :

దైవజ్ఞ గోరస వీరభద్రాచార్యులు

లెక్చరర్ ఇన్ జ్యోతిష

తెలుగు విశ్వవిద్యాలయం.

హైదరాబాదు.

ప్రథమ ముద్రణము 1991

ప్రతులు : 1000

వెల : రు. 53-00

ప్రకాశకులు :
శ్రీ గాయత్రీ జ్యోతిషాలయం
శ్రీమతి జి. జోగిలక్ష్మి

SRI GAYATRI JYOTISHALAYAM
Plot No.20, Mythripuram,
Karmanghat,
P.O: L. B. Nagar,
HYDERABAD - 500 963.

ముద్రణ :
రాధాకృష్ణా ప్రింటర్సు
తుని,
తా॥ గో॥ జిల్లా.

# ★ కృతి సమర్పణ ★

అనంతకోటి బ్రహ్మాండముల యందు అణువణువునా అంతర్యామియై
విలసిల్లు విశ్వకర్మ పరమేశ్వరుని ప్రేరణచే ప్రచోదితులై సమస్త
కార్యములను నిమిత్త మాత్రముగా భావించుచూ తానొక నిష్కామ
కర్మ యోగియై తారక రాజయోగా వలంబియై అనవరతము
లోక కళ్యాణమే పరమావధిగా సకల కళాగుణ గ్రహణ
పారీణత నలవరచుకొని నిత్యకళా పరిపోషకులై వర్ధి
ల్లుటయే గాక. దేశ సేవయే దైవారాధనగా, ప్రజా
సేవయే పరమాదర్శముగా భావించి, ప్రజా పరి
పాలనా దీక్షా దురంధరులై, నటశేఖరులై,
భారతీయ సంస్కృతీ వికాసముల యందు
అమితాదర మనస్కులైన,
మన

గౌ॥ శ్రీ నందమూరి తారక రామారావు గార్కి

భక్తిపూర్వకముగా సమర్పించు కృతి ప్రసూనము

— రచయిత

# ❋ కృతజ్ఞతలు ❋


ఈగ్రంథ రచనకు, ముద్రించడానికి అనుమతించి ఆదరముతో ప్రోత్సహించిన
తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత

**ఆచార్య శ్రీ డా॥ సి. నారాయణరెడ్డి గార్కి**

మరియు **ఆచార్య శ్రీ శివరామమూర్తి గార్కి**

గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయాన్ని అందించిన తెలుగు
విశ్వ విద్యాలయాధికారులకు

పుస్తక స్వరూప స్వభావాలను పరీక్షించి ప్రోత్సహించిన

**ఆచార్య శ్రీ తూమాటి దోణప్ప గారికి**

(మాజీ తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు)

**ఆచార్య శ్రీ రత్నాకరం శంకర నారాయణరాజు గారికి**

(భూతపూర్వ జ్యోతిష శాఖాధిపతి)

ఈ గ్రంథ రచనలో నాకు అనేక విధాల సహాయ సహకారాలు అందించిన
ప్రస్తుత జ్యోతిష శాఖాధిపతులు అయిన

**ఆచార్య శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు గారికి**

**మిత్రులు డా॥ చిఱ్ఱావూరి సుబ్రహ్మణ్యం గారికి**

అంతేగాక ఈ గ్రంథ రచనలో అనేక విధములుగా నాకు సహకరించిన
మిత్రులకు, శ్రేయోభిలాషులకు మరియు

ఈ పుస్తకాన్ని ఎంతో శ్రమకోర్చి అందంగా, ఆకర్షణీయంగా ముద్రించి
యిచ్చిన మిత్రులు రాధాకృష్ణా ప్రింటర్సు యజమానులైన

**శ్రీ బాలేపల్లి గంగరాజు గార్కి వారి సిబ్బందికి**

నా హృదయ పూర్వకమైన కృతజ్ఞతాంజలి.



....రచయిత

# ఉభయ తారకం

మిత్రులు శ్రీ నోరస వీరభద్రాచార్యులు పండితవంశంలో పుట్టి సంప్రదాయబద్ధంగా జ్యోతిష వాస్తుశాస్త్రాలు అభ్యసించినవారు. విశేష పరిశ్రమచేసి ఆయా శాస్త్రాల రహస్యాలను ఆకళింపు చేసుకున్నారు. నిరంతరాధ్యయన పఠనపాఠనముల మూలంగా ఆ శాస్త్రములకు సంబంధించిన గ్రంధములనేకం రచించి పండితుల ప్రశంసలకు పాత్రులైనారు. ప్రస్తుతం ఈ 'పురోహితదర్శిని' వెలువరించి విధినిషేధాలు తెలియగోరే ఆధునిక సమాజంలోని సాధారణ పాఠకులకు మహోపకారం చేసినారు.

మన ప్రాచీనాచారాలు విధినిషేధాల పట్టింపులు సడలిపోతున్న కొలది, ప్రాచీన విద్యలకు ఆదరం సన్నగిల్లి మరుగువ పడిపోతున్నవి. పిండికొలది రొట్టె అన్నట్లు ఆదరణ లేకపోవటంచేత ప్రజలకు విధినిషేధాలు తెలుపుతూ అందరికి హితంకోరే- అందరికి హితంచేసే- వృత్తిగాగల పురోహితవర్గం వేరు వృత్తులను ఆశ్రయిస్తున్నది. మిగిలిన కొలది మంది స్వహితంలో సతమతమైపోతున్నారు. ఇట్టివారిలో చాలామందికి రామశబ్దం ధకారాంతము, విధినిషేధాలు వికల్పములు. ఇట్టివారినాశ్రయించిన సంప్రదాయాభిమానులు రెంటికి చెడిన రేవడులైపోతున్న తరుణంలో శ్రీ వీరభద్రాచార్యులుగారు రచించిన ఈ పురోహితదర్శిని అటు పురోహితులకు, ఇటు అభిమానులకు మహోపకారి, కొలది పరిశ్రమలో గ్రంథస్థ విషయాలను తమకుతామై తెలుసుకోవచ్చు. అవసరపూర్తి పౌరోహిత్యం నేర్చుకున్నవారికి గ్రంథం ముంగొంగు బంగారం. ఉభయతారకమైన ఈ గ్రంథం రచించినందుకు మిత్రులను అభినందిస్తూ వారి పరిశ్రమను ఆశీస్తున్నాను. ఇందులోని అచ్చుతప్పులు సవరించుకోకపోతే ఉభయభ్రష్టులయ్యే ప్రమాదమున్నది. తప్పొప్పుల పట్టిక అనుబంధంగా ఉంటుందని ఆశిస్తున్నాను.

సాధారణ పాఠకులకు ప్రాచీన శాస్త్ర రహస్యాలు ఈ విధంగా అందించే పరిశ్రమ ఇతోధికంగా సాగించే అవకాశం శ్రీ వీరభద్రాచార్యులు గారికి పరాత్పరుడు ప్రసాదించవలెనని కోరుతున్నాను.

—బి. రామరాజు

బ్రహ్మశ్రీ గోరస వీరభద్రాచార్యులు గారు గురుకుల క్లిష్టులై సంప్రదాయ పద్ధతిలో జ్యోతిష శాస్త్రాన్ని తత్సాపేక్ష సహకారులైన వాస్తు శాస్త్రాదులను అధ్యయనం చేసారు. వీరు సంప్రదాయాభిమానులు. వీరికి వివిధ శాస్త్రాదులు వంశపారంపర్యంగా సంక్రమించిన పైతృక సంపత్తి, తెలుగు సంస్కృతాది భాషలలో ప్రవీణులు. తెలుగులో ఎం. ఏ పట్టాన్ని ప్రథమ శ్రేణిలో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి సంపాదించారు, ప్రస్తుతం తెలుగు విశ్వవిద్యాలయంలో జ్యోతిష శాఖలో లెక్చరర్‌గా ఉండి, పి హెచ్.డి పట్టం కోసం పరిశోధన చేస్తున్న విద్యాపిపాసులు వీరు.

జ్యోతిష శాస్త్రాభిమానులకు, సంప్రదాయ విదులకు పనికివచ్చే అనేక గ్రంథాలు ఇదివరలోనే వీరు రచించి ముద్రించారు. వాటికున్న ప్రచారమే వీరి పాండిత్యాదికానికి తార్కాణం. ఇప్పుడు "పురోహితదర్శిని" అనే నిత్యోపయోగియైన గ్రంథాన్ని రచించి ముద్రించారు. పౌరోహిత్యం చేస్తూ ఉన్నా ఆధునిక పరిస్థితులవల్ల తదితర కారణాలవల్ల అనేక సంశయాలు మిగిలిపోయిన వారికి ఈ గ్రంథం మార్గదర్శకంగా ఉంటుందనడంలో సంశయం లేదు. దీనిలో ముహూర్తాది విషయాలేగాక, ఫలితజ్యోతిషానికి, వాస్తుశాస్త్రానికి సంబంధించిన అనేక విషయాలు విపులంగా వివరించబడినాయి. సర్వులకు సులభంగా అర్థమయ్యే భాషలో రచన సాగినది.

అందరికీ ఉపయోగించే ఈ గ్రంథాన్ని రచించిన ఆచార్యులు గారిని నేనభినందిస్తున్నాను. పురోహితులకందరికి ఇది హస్తభూషణం కాగలదని ఆశిస్తున్నాను.

— కొత్తపల్లి వీరభద్రరావు
సికింద్రాబాద్-25

# ఆరంభము

అనంత పరబ్రహ్మ స్వరూపమగు ఈశ్వరుడు కాలస్వరూపుడు కాలము యొక్క అనగా ఈశ్వరునియొక్క స్వరూపము తెలిసికొనువాడే దైవజ్ఞుడు అనబడుచున్నాడు. భూత భవిష్యత్ వర్తమానములు తెలియువారిని కాలజ్ఞులని దైవజ్ఞులనియును అనుట నిత్యవ్యవహారమునందుకలదు అట్టి కాలజ్ఞానము కలిగిన సత్పురుషులు, మహానుభావులు మనయందు అనేకులు కలరు.

ప్రకృతియందు కనిపించునట్టియు, కనిపించక సూక్ష్మములగు నట్టియు అనేకములగు కిరణసముదాయములు ప్రసరించుచుండును. అట్టి కాంతి ప్రసరణము ఒకనియమముతో ప్రసారితమగుచుండును. అతీంద్రియ సంపన్నులగు మహాపురుషులు ఆకాంతి (జ్యోతులు) పుంజముల ప్రసరణలపై అనేక సంవత్సరములు శ్రమించి వాటి ఫలితములను కనుగొనియున్నారు. వారి ఆలోచనలను సూత్ర బద్ధముచేసి తరువాత తరములవారికి అందించియున్నారు. వారు శ్రమించిన సూత్రముల సారమే ఈ జ్యోతిష శాస్త్రము.

ఎవరు ఏ శాస్త్రమును నిర్మించినను కొన్ని నియమములకులోబడి చేయుచుందురు. శాస్త్రనిర్మాణమునందు దేశ-కాల-పాత్రలు ప్రాముఖ్యత తప్పక వహించుచుండును. ప్రతి శాస్త్రమునందును కాలక్రమాను గతములగు మార్పులు చేర్పులును జరుగుచునే యుండును. ఏ శాస్త్రమునందయినను ఇది జరుగుట నిశ్చయము. మనము ఒక విషయముపై మాట్లాడు అధికారము కావలయుననినచో ఆ విషయముపై మనకు సంపూర్ణ అవగాహన యుండవలయును.

పురాణమిత్యేవనసాధు సర్వం
నచాపికావ్యం నవమిత్యవద్యమ్
సంతః పరీక్షాన్యతరన్ భజంతి
మూఢః పరప్రత్యయనేయబుద్ధిః
అనికాళిదాసు అనియున్నారు.

ప్రస్తుత కాలమునందలి విజ్ఞాన శాస్త్రములలో వైద్య శాస్త్రమును గమనింపుడు. అనేకములగు ఔషదములు లభించుచున్నవి. ఒకే రోగమునకు అనేక ఔషధములు ఎందుకు ఒకే రోగము ఇరువురకు ఉన్నది అనినచో ఒకరికి ఒకమందు పనిచేయును వేరొకరికి ఇంకొక మందు పనిచేయు చున్నది. ఒకే ఔషదము ఒకే రోగమునకు ఇరువురి వ్యక్తులయందు సరిపడుట లేదుకదా! ఎందుచేత ఇది శాస్త్రలోపమనవలెనా!

ఒకేవైద్యుడు ఇరువురికి ఒకే రోగవిషయమునందు శస్త్రచికిత్స చేసియున్నాడు అనుకొనినచో ఒకరోగి చాలా ఆరోగ్యవంతుడగును. మరియొక్క రోగికి ఆరోగ్యము సరికాదు దీనికి కారణమేమి? ఇదికూడ శాస్త్రలోపము అనవలయునా?

ప్రపంచమంతయు ఆకాశయానమునకు సంబంధించిన క్షిపణులు తయారు చేయుచున్నారు. అందుకొన్నిటి ప్రయోగము విజయవంతమగు చున్నది. మరికొన్నింటికి అపజయము కలుగుచున్నది. దీనికి కారణము కూడ శాస్త్రమునందు లోపమేనా

డార్విన్ జీవపరిణామ సిద్ధాంతము, న్యూటన్ ఆకర్షణ సిద్ధాంతములు బహుళ ప్రచారము పొందియున్నవి. వాటియందుకూడ కొన్ని లోపములున్నవనియు ప్రస్తుత శాస్త్రజ్ఞులనబడువారు అనుచున్నారు. వారిని శాస్త్ర కర్తలు అనరాదా?

ఈ విధముగ చూపదలచినచో ఎన్ని ఉదాహరణలైనను ఇవ్వవచ్చును అందుచేతనే ప్రతిశాస్త్రమునకును కొన్ని అవధులు ఉండును. కాలక్రమేణ అందుమార్పులు వచ్చుచుండును. ఆయాకాలములయందున్నవారు ఆయా మార్పుల గమనించి శాస్త్రము సవరించి ప్రజోపయోగముగా చేయు చున్నారు.

భూమికి అయస్కాంత శక్తి (వచ్చి) యున్నది. ఈశక్తి ఏ విధముగా ప్రాప్తించినది. కారణము ఏమి అని ప్రశ్నించుకొనినచో సమాధానము చాల చిన్నది.

ప్రకృతియందు వెలుతురునుండి విద్యుత్తు విద్యుత్తునుండి వెలుతురు కలిగించుట ప్రస్తుత కాలమందు ప్రతివారికిని తెలిసిన విషయము అనంతమగు ఆకాశమున ఎన్నియో (చుక్కలు) తారలు కాంతిని వెదజల్లుచునే యున్నవి ప్రకృతియందు కనిపించు ప్రతిగోళమునకును కదలిక కూడ యున్నది. కాంతియందు అయస్కాంతశక్తి కలదు. అయస్కాంతశక్తి కలిగిన పదార్థముతో ఆశక్తి గ్రహించగలిగిన వేరొక పదార్థమును తాకించినపుడు ఆ శక్తి శక్తిలేని రెండవ వస్తువు గ్రహించుచున్నది.

ఆకాశమంతయు అయస్కాంత శక్తితోనున్న వస్తువు అనుకొనినచో భూమి ఆశక్తిని గ్రహించగల వస్తువు అందు అనగా భూమిపై జన్మించి భూగుణముగల సకల చరాచర జగత్తుకూడ ఆకాశ తత్వమునందున్న శక్తిని గ్రహించును అందుచే భూమికి భూమిపైనున్న మానవులకు కాంతి ప్రభావమునుండి వేరుపడి యుండుట జరగని పనియగుచున్నది

పై సూత్రముల ఆధారముగా పరిశీలించినచో ప్రకృతియందున్న కాంతి మానవులపై ప్రభావము చూపుననుట నిస్సందేహము. కావున అన్ని శాస్త్రములవలె జ్యోతిష శాస్త్రము అతిపటిష్టమయినది. అగుచున్నది. అనగా భూమి ఒక డైనమో పనిచేయు విధముగా యున్నదని యర్థము. అయస్కాంత క్షేత్రముగల ఆకాశమునందు అయస్కాంత తత్వములేని భూమి తనచుట్టూ తాను తిరుగుటవలన మనకు దృగ్గోచరముకాని అనంతమగు శక్తిని సముపార్జించుకొని భూమిపైనున్న మనకు ప్రసాదించుచున్నది.
ఇపుడు మనకు ఒక సందేహము కలుగుట అంత్యంత సహజము

ఆకాశమునందు కోటాను కోట్ల నక్షత్రములు ఎన్నియో గ్రహములు కనుపించుచుండగా మన ప్రాచీనశాస్త్రజ్ఞులు కొన్నిటినే ఎందుకు గ్రహించిరి? మనము ఆకర్షింపబడుదుమని అనుకొనియున్నాము. కదా! ఒకఅయస్కాంత క్షేత్రము దగ్గరనుండు వస్తువునే ఆ అయస్కాంత క్షేత్రము ఆకర్షించును. కాని దూరపు వస్తువులను ఆకర్షించలేదు ఆ విధముగనే మనకు (భూమికి) దగ్గరనున్న కాంతి సమూహము (అయస్కాంతము) మనకు తన శక్తిని

ప్రసాదించుచున్నది. భూమికి ఒక నియమిత మార్గము ఆకాశమున కలదు. ఈ భూమి పయనించు ఏమార్గమైనయున్నదో ఆమార్గమున ఉన్న లేదా కలసిన ఏ వస్తువు (అయస్కాంత గుణము) యొక్క గుణము ఆకర్షించునో ఆవస్తు గుణము తనయందు భూమి నిక్షిప్తము చేసుకొనుచున్నది. ఈ మూలసూత్రముతో పరిశోధించి మనవారు కొన్ని నక్షత్రములను, కొన్ని గ్రహములను సూచించిరి అవియే మనకు ఎక్కువ శక్తినిచ్చి మన మనుగడకు తోడ్పడు చున్నవి.

అవి ఇవి

## నక్షత్రములు

1) అశ్వని 2) భరణి 3) కృత్తిక 4) రోహిణి 5) మృగశిర 6) ఆరుద్ర 7) పునర్వసు 8) పుష్యమి 9) ఆశ్లేష 10) మఘ 11) పుబ్బ (పూర్వఫల్గుని) 12) ఉత్తర 13) హస్త 14) చిత్త 15) స్వాతి 16) విశాఖ 17) అనూరాధ 18) జ్యేష్ఠ 19) మూల 20) పూర్వాషాడ 21) ఉత్తరాషాడ 22) శ్రవణము 23) ధనిష్ఠ 24) శతభిషము 25) పూర్వాభాద్ర 26) ఉత్తరాభాద్ర 27) రేవతి

ఇవి ఆకాశమునందు స్థిరముగా కన్పించు తారా సముదాయములు. ఈ నక్షత్రములు ఉన్న స్థలమును వృత్తాకారముగ గుర్తించిరి. ఎందువలననగా భూమి వృత్తాకారముగా తిరుగుచున్నది. కావుననే నిజమునకు అవి వృత్తాకారముగా లేవు ఆవృత్తమును క్రాంతివృత్తము అనిపిలచియుండిరి.

# అమ్మతో ఆకాశ పరిశీలన ప్రారంభం

అమ్మ చిన్నతనములో ఆకాశమును చూపించి చందమామను చూపుతూ మనకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. అంటే చిన్నతనమునుండే మానవుడు ఆకాశమునుచూస్తూ ఆనందాన్ని అనుభవిస్తున్నాడన్నమాట. మనం రాత్రివేళ ఆకాశములోనికిచూస్తూఉంటే నక్షత్రాలు కనుల పండువుగా భగవన్నిర్మితమయిన భూమండలపు చాందినీలా మనకు కనిపిస్తుంది. అయితే

ఆకాశంలో అంతటా ఈ నక్షత్రములు ఒకేవిధంగా లేవు. కొన్ని ప్రదేశము లందు దట్టముగా కొన్ని ప్రదేశములందు పలుచగాను ఇవి ఉనళవి. ఇలా గుంపులు గుంపులుగా ఉన్న నక్షత్రములను కొన్ని మండలములుగా భూ మండలముపై నివసించు మన ప్రజలు పలుప్రాంతములనుండి కూడ ఒక గుంపును. ఒకే ఆకారముగా గుర్తించిరి మన ప్రాచీనఋషులు ఆకాశమును చూచి ఆనందముతో పలికిన ఈ మాటలు చూడండి.

1. ఇదం స్వరిద మిదానవామ మయం ప్రకాశా ఉర్వాంతరిక్షం
ఋగ్వే X 124—6

2. అభిశ్యావం నకృశానోభిరశ్వం నక్షత్రేభిః పితరోద్యామ పింశవ్
రాత్ర్యంతమో అదధుర్జ్యోతి రహసి
ఋగ్వే X 68—11 అయాస్య ఋషి

1. నీలపు గుబ్బ గొడుగు వలె భూమండలము నావరించి అపారముగా వ్యాపించియున్న అకాశమండలమునందు సూర్యుడస్తమించిన తరువాత నక్షత్రములొక్కొక్కటి బయల్పడుట విచిత్రముగదా !

2. పితరులు పగటివేళ సూర్యకాంతిని రాత్రి చీకటిని వ్యాపింప జేసిరి. నల్ల గుర్రమునకు ముత్యాల జాలరులు వేసి అలంకరించినట్లు రాత్రి చీకటిలో నభోరంగమును చుక్కలకోవలతో నలంకరించిరి.

ఇక సంవత్సరాత్మకమయిన కాలచక్రమును గూర్చి దీర్ఘతముడను ప్రాచీన వైజ్ఞాని కోత్తముడు వర్ణించిన విధము.

ద్వాదశ ప్రధయః చక్రమేకం త్రీణి నభ్యానిక ఉతిచ్చికేత
తస్మిన్సాకం త్రిశతాన శంకవోర్పితాః షష్టిర్నచలా చలాసః

దీని భావమునే భారత ఆదిపర్వ ఉదంకోపాఖ్యానమున వ్యాసుడు తెని గించియున్నారు. అవి 3- 22, 23, 28

22 త్రీణ్యర్పి తాన్యత్ర శతాని — పరివర్తయంతి
23 తంత్రం వేదం విశ్వరేపే — భువనానిచైవ
28 ఎతాస్త్రియోధాతావిధాతాచ — సంవత్సరశ్చక్రం

పై విధమయిన కాలమానమును చెప్పుచున్నపుడు ఈ కాలమును వివిధముగ చెప్పబడినదను సంశయము కలుగక మానదు. కాలమానమునకు

ఆకాశమునందలి చుక్కలగుంపులు ప్రమాణములగుచున్నవి. అనాది కాలము నుండి మానవుడు ఆకాశము చూచుచు కాలగణన సాగించుచున్నాడు అనుటకు చరిత్రాధారములు అనేకములు కనిపించుచున్నవి. ఈ కృత్రిమ వాతావరణముదాటి ఏపల్లెటూరి యందయిన శుక్లపక్ష వేసవి రాత్రులు గడపిన ఆకాశముయొక్క చంద్రునియొక్క చల్లదనము అనుభవైకవేద్యము కాగలదు. ఖగోళమున ప్రత్యక్షముగా కనిపించునది చంద్రగమనము ప్రాచీనులు మొదట ప్రస్ఫుటముగా కనుపించు ఈ చంద్రగతి ఆధారముగా కాలమును నిర్ణయించిరి ఇచట ఒక్క విషయము గ్రహించవలయును నెలవంక, మూన్-మంత్ ఇవి పరిశీలించిన నెలకు అర్థము తెలియును చంద్రుడు చిన్నవాడుగా కనిపించిన నాటినుండియు మరల కనిపించు వరకు కలిగిన పరిణామాన్ని నెలగా గుర్తించారు.

ఈ చంద్రుడు ఎల్లపుడు ఒకే ఒక చుక్కల గుంపుల ప్రక్కగా పయనించుటను గమనించిరి. మనము ప్రయాణము చేయుచున్నపుడు ఏ విధముగా మార్గమున కిరువైపుల దూరముగా గ్రామములున్నను అవి ఆ గ్రామముగా పరిగణించెదము. అటులనే చంద్రుడు పయనించు మార్గమును కూడ గుర్తించిరి చంద్రుడే కాక మరికొన్ని నక్షత్రముల కంటె భిన్నమయిన వానిని కూడ చంద్రుని బాటయందే పయనించుట కూడ గుర్తించిరి. ఐయితే ఈ చుక్కల గుంపులను గూర్చిన పట్టికలు ఋగ్వేద కాలము నాటికి తయారు కాలేదు కాని వాటి ప్రశంసలు మాత్రము కానవచ్చుచున్నవి. కాని కృష్ణ యజుర్వేదము (తైత్తరీయ సంహిత) కాఠక సంహితలయందు, అథర్వవేదము శతపథ బ్రాహ్మణము నందును కానవగుచున్నది. అవి ఇవి.

1. కృత్తిక, 2. రోహిణి, 3. మృగశిర, 4. ఆరుద్ర 5. పునర్వసు 6 తిష్యమి, 7. ఆశ్లేష, 8. మఖ, 9. పూర్వ ఫల్గుని, 10. ఉత్తర ఫల్గుని, 11. హస్త, 12. చిత్త, 13. స్వాతి 14 విశాఖ, 15. అనూరాధ 16. జ్యేష్ఠ, 17. విచృతీ, 18. పూర్వాషాడ 19. ఉత్తరాషాడ 20. శ్రోణి 21. శ్రవిష్ఠ, 22. శతభిషక్, 23. పూర్వప్రోష్ఠపద 24 ఉత్తర ప్రోష్ఠపద, 25 రేవతి, 26. అశ్వయుజౌ, 27. భరణి

అతి ప్రాచీన కాలము నుండియు ఇవియే చుక్కలు గుంపులకు ఈ పేరు వచ్చుటకు కారణము సూర్య చంద్రాది సమస్త గ్రహములు ఈ ఇరువద్దేడు

చుక్కల మీదుగనో వీని సమీపము నందునో సంచరించునట్లు మనకు కనిపించును. ఈ మార్గమునకే క్రాంతి చక్రము (Eclipties) అందురు.

ఈ క్రాంతి చక్రము నందున్న ఇరువది ఏడు నక్షత్రములకును 12 రాశుల విభాగమును ఏర్పరచి యుండిరి. అనగా $27 \times 4 = 108 \div 12 = 9$.

నాభి నుండి గోళము యొక్క పరిధి 360 డిగ్రీలు కాగలదు. దీనిని 12 భాగములు చేసినచో $360 \times 60 \div 12 \div 9 \times 4$ అయిన నక్షత్రమునకు 800 కలలు కాగలవు.



# నక్షత్రములు - భచక్రము

"అభిశ్యావం నకృశనోభిరశ్వం నక్షత్రేభిః పితరోద్యామ
పింశన్। రాత్ర్యం తమో అదధుర్జ్యోతి రహసి"

ఋగ్వేదము X 68.11. ఆయాస్యఋషి

పితరులు పగటివేళ సూర్యకాంతిని రాత్రి చీకటిని వ్యాపింపజేసిరి. నల్ల గుర్రమునకు ముత్యాల జాలరులు వేసి అలంకరించినట్లు రాత్రి చీకటిలో నభోరంగమును చుక్కల కోవలతో నలంకరించిరి.

సంవత్సరాత్మకమయిన కాలచక్రమునుగూర్చి దీర్ఘతముడు (ప్రాచీన వైజ్ఞానికోత్తముడు) ఈ విధముగా వివరించి యున్నాడు.

ద్వాదశ ప్రదయః చక్రమేకం త్రీణి నభ్యానిక ఉతిచ్చికేత
తస్మిన్త్సాకంత్రిశతానశంక వోర్పితాః షష్టిరఽచలా చలసః

ఋ 1-24-48

దీని భావమునే భారతమున వ్యాసుడు. ఆది 3–22, 23, 28

22 త్రేణ్యర్పితాన్యత్ర శతాని — పరివర్తయంతి

23 తంత్రం చేదం విశ్వరేపే — భువనానిచైవ
28 ఏతేస్త్రియోధాతా విధాతాచ — సంవత్సరశ్చక్రం

పై విధమగు కాలమానమును చెప్పుచున్నపుడు ఈ కాలమానము ఏ విధముగ చెప్పబడినదను సంశయము కలుగక మానదు కాలమానమునకు ఆకాశమునందలి చుక్కల గుంపులు ప్రమాణములగుచున్నవి. అనాది కాలము నుండి మానవుడు ఆకాశము చూచుచు కాల గణన సాగించు చున్నాడనుటకు చరిత్రాధారములు అనేకములు కనిపించుచున్నవి. పూర్వకాలమున చంద్రుని చూచి ఆనంద మనుభవించేవారు. ప్రస్తుతము మనమయినను ఏదయిన కరెంటులేని అరణ్య ప్రాంతమునకువెళ్ళి శుక్లపక్ష దినములు గడపిన చంద్రుని చల్లదనము కాలము విలువలును తెలియగలవు ఖగోళములో ప్రత్యక్షముగా కనిపించు చంద్రుని గమనమును కొలుచుట కుపక్రమించినారు అతి ప్రాచీన మానవులు. నెల, మాసం అనే పేరులు కూడా అక్కడ నుండియే వచ్చినవి. నెలకు ముప్పది రోజులు నియమం కూడా చంద్రుని ఆధారముగా చేసికొనియే ఏర్పడినది. దీనిని భాషా చరిత్ర దృష్ట్యా వింగడింప వచ్చును.

చంద్రుడు పయనించు మార్గము నందున్న చుక్కల గుంపులనుగూర్చి మనము కూడ ముందుగ తెలిసికొందము. ఈ చుక్కల గుంపులను గూర్చి పట్టికలు ఋగ్వేద కాలము నాటికి తయారుకాలేదు. కాని కృష్ణయుజుర్వేదము (తైత్తిరీయ సంహిత) కాఠక సంహితల యందు, అధర్వవేదము, శతపద బ్రాహ్మణము నందు కొనసాగుచున్నవి. అవి ఇవి.

1 కృత్తిక, 2 రోహిణి, 3 మృగశిర, 4 అర్ద్ర 5 పునర్వసు 6 తిష్యమి, 7 ఆశ్రేష, 8 మఖ, 9 పూర్వఫల్గుని, 10 ఉత్తరఫల్గుని 11 హస్త, 12 చిత్త, 13 స్వాతి, 14 విశాఖ, 15 అనూరాధ, 16 జ్యేష్ఠ 17 విచృతీ, 18 పూర్వాషాఢ, 19 ఉత్తరాషాఢ, 20 శ్రోణి 21 శ్రవిష్ఠ 22 శతభిషక్, 23 పూర్వ ప్రోష్ఠపద, 24 ఉత్తర ప్రోష్ఠపద, 25 రేవతి 26 అశ్వయుజౌ, 27 భరణి.

అతి ప్రాచీన కాలము నుండియు ఇవియే గుంపులకు ఈ పేరు వచ్చుటకు కారణము. సూర్య చంద్రాది సమస్త గ్రహములు ఈ ఇరువదియేడు చుక్కల మీదుగనో వీని సమీపమునందునో సంచరించునట్లు మనకనుపించు ఈ మార్గమునకే క్రాంతి చక్రము (Ecliptics) అందురు.

ఈ క్రాంతి చక్రము నందున్న ఇరువది ఏడు నక్షత్రాలను పన్నెండు రాశులగ విభజించిరి. అనగా 27 ÷ 12 = 2.1/4 అనగా ఒక్కొక్క రాశికి రెండుపావు నక్షత్రము లగుచున్నవి.

## ద్వాదశ రాశులు

సంవత్సరాత్మక మయిన కాలచక్రపు ప్రధ (నేమి) యను దాని ననుసరించి క్రాంతి వృత్తము ఏర్పడియున్నది. అది పంౘ్రెండు భాగములు గల దను మాట వేదముల నుండి గ్రహించియుంటిమి. 1-164-48. ఈ క్రాంతి చక్రము మార్పులేక యుండుననియు ఆ వృత్తము త్రినాభియుతమై Ellipse అనియు ద్వాదశార మంత్రము ఋ 1-164-11 వలనను సప్తఋయంతి మంత్రము ఋ 1-164-2 వలన తెలిసికొంటిమి.

## 1 మేషము

అశ్వని + భరణి + కృత్తిక ఒక పాదము మేషరాశి యగుచున్నది.

అగ్నిదేవుడు ధూమధ్వజుడు మేషవాహనుడు అగ్ని దైవతమైన కృత్తిక దిగువన యుండుటచే అగ్ని మేషవాహనుడయ్యెను. మేష ప్రశంస ఋగ్వేదములో పెక్కుచోట్ల గలదు. ఋ 1-51-1 1-52-2.

అగ్ని జ్వాలలు "కాళీ-కరాళీచ-మనోజవాచ-సులోహితాయాచ-సుధూమ్రవర్ణా - స్ఫులింగిని- విశ్వరూపీచ దేవీ - లేలాయమానా ఇతి సప్తజిహ్వా ముండకోపనిషత్ 1-2-4

## 2. వృషభము

కృత్తిక 3 పాదములు + రోహిణి + మృగశిర రెండు పాదములు

భగోళమున గల ద్వాదశ రాశులలో వృషభము మూడు విధములుగా బంధింపబడినట్లు తెలియచున్నది. 1. అశ్వనీదేవతలు తమ రధమునకు శింశుమారమును జల జంతువులతో వృషభమును పూన్చుకొని వెళ్ళిరని ఋగ్వేదము తెలుపుచున్నది, 1-116-16 యువాం రధం వృషభశ్చ శింశుమారశ్చయు క్తా

2. ఈ వృషభమే ముద్గలుని రథమునకు పూన్చబడినదని ఆ రథమునకు రెండవ ప్రక్క గద వంటి కర్ర (ద్రుమణము) కట్టిరని ఈ రథమును అతని భార్య (పరివృక్త యనబడు వంధ్యి) తోలి దొంగలను వెంటాడెనని ఋగ్వేదము తెలుపుచున్నది.

3. ఈ వృషభమే దాని తరువాతి రాశియగు మిధునమునకు అనగా పార్వతీ పరమేశ్వరులకు వాహనమైనది.

1) ఋ॥ చత్వారి శృంగా త్రియో అస్య పాదా ద్వేశీర్షే
ఋ 10,58.3 వృషభో రోరవతీ

2) నస్మై తృణం నోదక మాభర న్త్యు త్తరోదురోవహతి
ప్రదేవిశత్ × 102–10

త్రిదాబద్ధమగు ఈ అగ్ని 1) ఆహవనీయ 2) గార్హపత్యము 3) దక్షిణాగ్నిగా ప్రతిష్టింపబడినది.

## 3. మిధునము

మృగశిర రెండు పాదములు + ఆర్ద్ర + పునర్వసు 3 పాదములు

పునర్వసు ధనురాకారము గల చుక్కల గుంపు పునర్వసు ఉత్తరపు కొనమ రెండు చుక్కల జంట కలదు ఈ రెండు చుక్కలనే మిధునమని మనవారు చెప్పుచున్నారు. జ్యోతిశ్శాస్త్ర రీత్యా ఆర్ద్రా నక్షత్రము రుద్ర దైవత్వము ఈశ్వరుడే ఈ ఆర్ద్రపై నున్న మృగశిర చంద్రాదుడు కావున జాబిల్లి ఈశ్వరుని శిగ పూవైనది. వైశాఖ శుద్ధ సప్తమినాడు గంగావతరణము జరుగును. ఈ గంగయే ఆకాశగంగ పాలవెల్లి సమస్త సృష్టికి నిలయము అయినది అని ఎరుగవలయును.

## 4. కర్కాటకము

పునర్వసు చివరి పాదము + పుష్యమి + ఆశ్రేష

ఈ రాశి నామదేయము ఋగ్వేదమున కానవచ్చుట లేదు. శంబరుడు కలితరుని పుత్రుడుగా ఋగ్వేదము IV-30-14 ఉతదాసం కౌలితరం

బృహతః పర్వతాదధి అవాహన్నింద్ర శంబరి అని ఇంద్ర శత్రువగు శంబరుని గూర్చి యున్నది. ఈ కులితర శబ్దమే భాషా పరిణామముల వలన కళీరము గా మారినది. సూర్యకిరణములు(ఆశ్లేషా) సర్పసహజ వక్రగతితో బోవునని వైజ్ఞానిక పరిశీలనవలన తెలినది. యేదో రోచనేదివో. యేవాసూర్యవ్యరశ్మిషు యేషామస్సుషదః కృతం తేభ్యస్సర్పే భ్యోనమః(సర్పసూక్తము) సప్తాశ్వో అర్కో అరుణ రుచివపుః సప్తరజ్జు (సౌర సూక్తము) కావున పూర్వపు మన ఋషులు అతీంద్రియ శక్తిచే సమస్తము గ్రహించిరని తెల్లమగుచున్నది.

ఈ విధముగ కులితరముగా కుళీరమగు కర్కాటకము వేదమున గమ నార్హము.

# 5. సింహము

మఖ + పుబ్బ + ఉత్తర 1వ పాదము

మఖ నక్షత్రాలను పుబ్బ నక్షత్రాలను ఉత్తరలో కాంతిగ ఉన్న నక్ష త్రాల్ని చేర్చి చూస్తే సింహం ఆకారములో మనము వఖోరంగమున చూడ వచ్చును. కన్య అనగా దేవి సింహారూఢగా మనము ఊహించవచ్చును. మన పురాణేతిహాసము లన్నియు సింహమును దేవికి వాహనముగాను దేవీ కేతనముగాను వర్ణించియున్నారు. భారతమున కూడా దుర్గాదేవి స్తుతిలో సింహ వాహన ప్రసక్తి యున్నది.

# 6. కన్య

ఉత్తర 3 పాదములు + హస్త × చిత్త 2 పాదములు

ఋగ్వేద సంహిత యందు

అనోమహీ మరమతిం నజోషాగ్నాం దేవీం నమసారాత హవ్యాం

మధోర్మ ధాయ బృహతీమ్మృతజ్ఞా మాగ్నే వహ పథిభిర్దేవయానైః

ఋ V - 43 - 6

ఓ అగ్నిదేవుడా మమ్ము కటాక్షించి మా యందనుకూలుడవై మా విన తులతోను, మేము సమర్పించు కానుకలతోను, విభ్రాజితమూర్తి అరమతీ

మహాదేవిని మిమ్మనుగ్రహింప దేవయా నీ మార్గమున కొనితెమ్ము.

స్వాతీ నక్షత్ర ప్రాంతమున మరుత్తులేడ్గురు కలరు. కర్య రోదసివారి ప్రక్కన కలదు. కావుననే మరుత్తులేడుగురకు ఈ రోదసీ సామాన్య భార్య అని ఋగ్వే 1-167-4 "వరా శుభ్రా అయాసోయ వ్యాసాధారణ్యేవ మరుతీ మిమిక్షుః

ఋ VI 56 4-5 మిమ్యక్షయేషు రోదసీను దేవ

66 6 అ ధస్మైషు రోదసీ స్వశోచిరామవత్సుత్వతసైనరోక
61 4 వరావరాప ఏత నమర్యా సోభద్ర జానయః
అగ్నిత సోయదా సధ
ఋ VI 66 6 అధస్మైషు రోదసీ స్వశోచి రామవ త్సుతసై నరోకః

దివ్యమైన తేజస్సు వ్యతస్పిద్ధమైన మహోజ్వల ప్రభలతో మెరయు చున్నట్లే ఆవరణ బాధితముగాక సముజ్వల సంపూర్ణ కాంతులతో వెలుగుచున్నట్లే మరుత్తుల మధ్య నైసర్గిక రుచులతో తేజరిల్లుచున్నదీ రోదసీ కన్య.

ఋ VI 61 4 వరావరాప ఏతన మర్యాసోభద్ర జానయః అగ్ని
తపోయధా సధ

మనోహారిణియైన మీ భార్యతో కూడ దూరముగా దిరిగి యగ్ని వేదిక కడ చలి బాపుకొనుడు చక్కని పెండ్లి కొడుకులారా మరుత్తులారా వీరులారా పొండు.

కన్యా రాశియందు పాండవ పత్ని ధర్మములు కూడ కలవు. కన్యారాశి మీన రాశి వరస్పర విరోధములు కన్య ఉదయించిన తోడనే మీనము అస్తమించుట ప్రసిద్ధము కదా! ద్రౌపదీ స్వయంవరము పౌషమాసంబు నందష్టమి నాడు రోహిణియున్నచో జరిగినది. అయిన ద్రౌపదీ స్వయంవరం పుష్య మాసమున జరిగినదా! పుష్యమాసము నందష్టమినాడు రోహిణి రాదు కదా. ఇది సౌరమాసము మీన రాశిలో ముఖ్య తారయగు రేవతి కది దేవత, పూషుడు, పూషదేవత సూర్యునితో నున్న మాసము పూష సంబంధియగు పౌషమాసము కాని చాంద్ర మాసమున అందునను పుష్య మాసమున ద్రౌపదీ స్వయంవరం జరిగి యుండదను నిర్వివాదాంశము.

# 7. తుల

చిత్త రెండు పాదములు + స్వాతీ + విశాఖ మూడు పాదములు

తులా మాసమున దివా రాత్రములు సరి సమానముగా నుండు విషవత్ పుణ్యకాలము సంప్రాప్తమగును. ఉత్తర భాగమున వ్యాపించిన క్రాంతి చక్రము దిశమార్చి దక్షిణమునకు మరలును ఉత్తరశాఖను వదలి వేరొకశాఖ నాశ్రయించి దక్షిణ దిగ్భాగము ననుసరించి పోవును. బెంట్లీ దొరగారు విశాఖకు వి + శాఖ అని విభజన చేసి ఇక్కడ నుండి క్రాంతి వృత్తము శాఖాంతరము నవలంబించి దక్షిణా పథము ద్రొక్కునని వ్యుత్పత్తి తెలిపినారు. విశాఖ ప్రాంతమందే క్రాంతి చక్రము దళీకృతమై రెండు భాగములుగా విభజింపబడుచున్నది. ఈ మాసమున అహః ప్రమాణమును, శీతోష్ణస్థితులును. వర్ష వ్యాప్తి విధానములును, ఖగోళపుటుత్తర దక్షిణ దిశలును క్రాంతిచక్ర వ్యాప్తియును సమానముగా నుండును. పక్షపాతము లేని సమానత్వమును సర్వ సమత్వ భావమును సూచించును.

ఋగ్వేదమున

భరతా మపయద్రపో ద్యౌః పృథివి క్షమారపో మోషుతే కించ నామమత్ X -59-10.

ఏ అకార్య కారణ దోషములకు పాపకర్ములు సిగ్గుపడి తలలు వంచుకొందురో అసమశీలములైన యే పక్షపాత దోషములు ప్రాణుల హింసించుచున్నవో అట్టి పాప సంచయము నశింపజేసి ద్యావాపృథివీ మిధునము తుడిచి వేయును గాక! లోకమునందు ఏ ప్రాణియు పాప పీడితమై దుఃఖింపకుండును గాక.

విశాఖ — ఇంద్రాగ్ని దైవత్వము శిబి కథ
విశాఖ — భాగవతములో రాధ (రాధా మాసము)

పూర్వము గ్రీకులకి తులా రాశి జ్ఞానము లేదు. దీనిని తరువాత వృశ్చిక రాశిలో జేర్చిరి. ఒరయన్ మహాయోధుని బాధించినది ఈ మహా వృశ్చికమునిరి,

## 8. వృశ్చికము

విశాఖ నాల్గవ పాదము + అనూరాధ + జ్యేష్ఠా నక్షత్రములు

ఈ వృశ్చికమును గూర్చి ఋగ్వేదము VII – 50 లో తెలుపబడినది. జ్యేష్ఠ వృశ్చికములోని యోగ తార

కృష్ణ యజుర్వేదము నందు జ్యేష్ఠను "రోహిణి" యని చెప్పబడెను. మైత్రావరుణీయ, కాఠక, సంహితలయందు, బ్రాహ్మణముల యందు ఈ నక్షత్రమును జ్యేష్ఠయనియే తెలుపబడినది.

అనూరాధకు మిత్ర దేవుడధిపతి.

శంనో మిత్రః శంవరుణః శంనో భవత్వర్యమా
శంన ఇంద్రో బృహస్పతిః శంనో విష్ణురురుక్రమః
ఋగ్వే I-90-9

ఈ మిత్రునకు ఆర్యులు పూజలు జరిపినట్లనే కాధారములు కలవు. ఒర యన్‌యోధుడు (వృషభ సమీపము) తెలుకుట్టగా చనిపోయెనని ప్రాశ్చాత్య గాథల వలన తెలియుచున్నది.

## 9. ధనుస్సు

మూల + పూర్వాషాఢ + ఉత్తరాషాఢ ఒకటవ పాదము

ఋగ్వేదములో ధనుర్ధారికి "కృశానుడు" అను పేరు కలదు.

ఋ I-155-2 యా మర్త్యాయ ప్రతిధీయమానమిత్ కృశానో
రస్తు రసనా మురుష్యథ

ధనుర్ధారి కృశానుడు గురిచూచి మానవులపై ప్రయోగించు బాణములు

ఋ IV – 27 – 3 నృ జద్యధస్మ అవహక్షి పజ్యాం కృశాను (మన్మదాగ్ని)
రస్తా మనసా బురణ్యన్

మనస్సున రేగు ముద్రేకముతో ధన్వి కృశానుడు నారి దిగిచి గురిచూచి వాని పడగొట్టువాడై బాణము విడిచెను.

ఆ బ్రహ్మ కీటాంత మిదం నిబద్ధమ్ త్రిషం ప్రయోగేన జగత్సమస్తమ్ అనునది ఈ ధనుర్మానమున ప్రతిపాదితము. కృష్ణయజుర్వేదమున పూర్వాషాఢకు ఆపోదేవతయు ఉత్తరాషాఢకు విశ్వ దేవతలు అధి దేవతలని కలదు.

మంత్ర పాదములందు నీ యాషాఢ నక్షత్రమునకు కామునితో సంబంధములు కనుపించుచున్నవి.

"అపోహ ఆ కామయత సముద్రంకామ-సముద్రాయస్వాహా కామాయస్వాహా

విరాట్పురుషుని తేజోరూపమును వర్ణించు వ్యాసులవారు

మేషః శిరోధ వదనమ్ — ధన్వీచ — ఊరు యుగమ్

అని విరాట్పురుషుని ఊరు ప్రదేశము మన్మధుడని నిర్ధారించినారు.

పుష్యమాసమున సూర్యునితో ధనూరాశి అస్తమించును కావున సంభోగ సంబంధమయిన కార్యముల యందుత్సుకత చూపదు. ఆ కాలమునందు మానవ శరీరమున కొన్ని మార్పులను వాతావరణ రీత్యా కనుగొనవచ్చును. అందుచే ఇది నిషిద్ధమయినది.

## 10. మకరము

ఉత్తరాషాఢ మూడు పాదములు + శ్రవణము + ధనిష్ట రెండు పాదములు

ఇందు శ్రవణము యోగతార కృష్ణ యజుర్వేదమున తైత్తరీయ బ్రాహ్మణ మైత్రావరుణీయ సంహితలందు కూడ ఈ నక్షత్రము శ్రోణానక్షత్ర మని పేర్కొనబడినది. కాఠక సంహితయందు మాత్రము దీనిని "అశ్వత్థ" మని పేర్కొనినది.

ఋగ్వేదము నందు "సఘపర్ణో గరుత్మాన్ అని దివ్యముగా వర్ణించిరి మంత్ర పాఠములందు" శృణ్వంతి శ్రోణా మమృతస్య గోపామ్ పుణ్యమస్యా ఉపశృణోమివాచమ్" అని యున్నది.

ఈ మకరరాశిని గూర్చి ఋగ్వేదము నందెచ్చటను లేదు. దీనిని అజ మని వ్యవహరించిరి. ఈ అజమును పూషుడను దేవత రధమునకు పూన్చబడి యాతని రధాశ్వమయ్యెనని వర్ణింపబడినది. పూషుడు రేవతి కధి దేవతయని కన్యా రాశియందు గ్రహించి యుంటిమి.

ఋగ్వేదము

| | |
|---|---|
| అజాశ్వస్త్ర వస్యుతామ జాశ్వమే | I-138-4 |
| రమోధారా స్యాయస్నుణోవ సోరాశిర జాశ్వ | VI—55-3 |
| పూషణాన్వ జాశ్వముపస్తోషా మవాజిన | VI—55-4 |
| అవితానో అజాశ్వ పూయాషామ నియామని | IX—67-10 |

అతే రథస్య పూషన్న జధురం వ వృత్యుః X—26–8

కొంతకాలము తరువాత నీయ జరాశి మకరరాశిగా మారి మన్మధుని ధ్వజమయినది మరల (కుంభము) వరుణ దేవునికి వాహనము.

## 11. కుంభ రాశి

ధనిష్ఠ రెండు పాదములు - శతభిషము + పూర్వాభాద్ర మూడు పాదములు

ఋగ్వేదమునందు "నీచీన బారం వరుణః కవంధః ప్రస సర్జరోదసీ అంతరిక్షం । తేన విశ్వస్య భువనస్య రాజాయవం నవృష్టి ర్ఘ్యనత్తి భూమ ॥ ఋ V–85–3.

ఇందు శతభిషము యోగతార అధిపతి వరుణుడు ఆ వరుణుడు వరపువే తపించుచున్న సస్యములకు నరులకు జలమును ఇచ్చుటకు నీళ్ళకడవ త్రిమ్మరించుచున్నాడని పై వేద మంత్రాభిప్రాయము. ప్రస్తుతము వర్షయోగములందుకూడా ధనిష్ఠా పంచకము ప్రాప్తించినపుడు వర్షాంశము వ్రాయుట కద్దు. కావున కుంభము రిక్త కుంభమను వరాహమిహిర వాక్యము పరాలోచింప దగినది.

## 12 మీన రాశి

పూర్వాభాద్ర చివరి పాదము + ఉత్తరాభాద్ర + రేవతి

ఈ రాశిలో రెండు చేపలున్నవి వీని తోకలను కలుపుచు ఒక పాశము వున్నది. ఈ పాశమునే వరుణపాశమని చెప్పవచ్చును. ఋగ్వేదము I-24-15; I-25-2; VI-74-4; X-85-24 అందు ప్రశంసింపబడినది. అధర్వణ వేదము నందు ఏతేపాశా వరుణ సప్త సప్త త్రేధాతిష్ఠన్తి IV-16-6.

ఇది అర్జునుడు పడవేసిన మీనముగా చెప్పవచ్చును. పూర్వ ఫల్గునీ నక్షత్ర ఉదయమునకు మీనరాశి అస్తమయమగును.



# పంచాంగ పరిచయము

పంచాంగమునందు మనము అయిదు అంగములు భావించుచున్నాము. అవి—

1. తిథి
2 వారము
3. నక్షత్రము
4 యోగము
5 కరణము



# పంచాంగము

పంచాంగము మనిషికి ఎందుకు అవసరమయింది అనే దానిని గూర్చి తెలుసుకుందాము.

ప్రకృతి పరిశీనాభిలాషియగు మానవుడు అత్యంత జాగరూకతతో భూ ఖగోళపరిస్థితుల రెండిటిని పరిశీలించ నారంభించియున్నాడు. తను ఎప్పుడూ చూచే విధానంలో ఎన్నో మార్పులు వస్తూ వచ్చాయి. అలాగే ఆ వచ్చిన మార్పులు ఒక నియమిత కాలంలో మరలా మరలా రావడం జరుగుతూవుంది. ఎండలు, వానలు, చలి-వసంతము మరలా మరలా రావడం ఇదే క్రమంగా సాగుతోంది

ఈ విధమయిన కాలక్రమంలో మానవుని జీవితం ముడిపడింది. ఆకాశంలోని నక్షత్రాలకు జన జీవనాన్ని కలిపి ఆ నక్షత్రాలు ఎపుడు వస్తాయి అని చూచే రోజునకు మానవుడు చేరుకొన్నాడు.

ఆదికాలము నుండి మానవునకు సూర్యోదయం ముందు లేవడం అలవాటయి ఉంటుంది. లేవగనే బయటకు వచ్చి ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదిం

చేవాడు. ఈ ఆస్వాదనలో భాగంగా ఆకాశంలో సూర్యోదయాత్పూర్వపు నక్షత్రాలను పరిశీలించడం జరిగేది; ఆ విధంగా సూర్యాస్తమయం తరువాత తీరుబడిగా చల్లదనం కోసం విశాల ప్రదేశంలో పడుకున్నట్లయితే ఆకాశంలోని నక్షత్రాలు ఆహ్వానాన్ని పలికేవి. ఆ ఆహ్వానాన్ని మన్నించి పరిశీలించే వాడు ఆకాశాన్ని మానవుడు. ఈ విధంగా పరిశీలిస్తూ ఉంటే ప్రతిరోజు ఒకే నక్షత్రాలు కనిపించక మారుతూ ఉండేవి.

ఆ మార్పులను గమనిస్తూ ఆ కాలములో జరిగే భౌగోళిక పరిస్థితులను అంచనా వేసేవాడు ఆకాశములో సూర్యోదయాత్పూర్వము రోహిణి కనిపిస్తే ఎండలు బాగా కాసేవి. వర్షాకాలములో అయితే చిత్తా నక్షత్రము సూర్యునికి ముందు కనిపిస్తే వర్షాలు బాగాపడేవి. కాల చక్రములో ఈ విధానాన్ని బాగా పరిశీలించి ఒక నిర్ణయానికి వచ్చాడు.

మనిషి మనుగడకు ముఖ్యమయినది ఆహారము. ఆ ఆహారాన్ని ఎలా సంపాదించాలి ఎప్పుడు సంపాదించాలి అన్నది ముఖ్యం. ఏ కాలములో విత్తనాలు చల్లితే బాగా పండుతుంది ఏ కాలములో చేపలు బాగా దొరుకుతాయి. ఏ సమయములో అడవిలో పంభారాలు దొరుకుతాయి, ఏకాలం ఆహార సంపాదనకు ప్రయాణానికి అనుకూలంగా ఉంటుంది మొదలయిన విషయాలు బాగా పరిశీలించాడు.

దేశ కాల పరిస్థితులను బట్టి కొన్ని కొన్ని స్థితులు మారుతూ ఉంటాయి ఆ విధంగా ఆయా దేశ కాల పాత్రతల ననుసరించి ఆయా ప్రదేశాలవారు వారి వారి అనుభవాలతో కొంత సమాచారాన్ని, కాలాన్ని అంటే నక్షత్రాలు ఏయే ప్రాంతాలలో ఎలా ఎలా ఉదయిస్తాయో వాటి పరిశీలనను చేసి సూత్రబద్ధం చేసారు.

ఆ విధమయిన తొలిదశలో మానవ ఖగోళ భౌగోళిక పరిస్థితులను సమన్వయించే రూపంలో ఆయా నక్షత్రాలను ఆరాధించడము మొదలు అయింది, ఫలాన నక్షత్రం వస్తే ఫలాన వస్తువు భూమిమీద దొరుకుతుంది అని ఆ నక్షత్రానికి ఆ మహాత్మ్యాన్ని ఆపాదించాడు ఆ నక్షత్రము తనకు తూర్పున తొలిసారిగా కన్పించిన రోజున ఆ నక్షత్రానికి పూజ చేయడం మొదలుపెట్టాడు. ఆ పూజ చేయడానికి పండుగ అని అన్నాడు. ఆ పండుగలో ఆ నక్షత్రానికి ప్రీతి

కలిగే పనులు అని తాను ఏవి అనుకున్నాడో అవి చేసేవాడు.

ఈ విధమయిన పండుగలను నిర్ణయించడం కోసం కాలప్రమాణాని ఖచ్చితంగా తెలుసుకోవడం కోసం మొదటలో పంచాంగాలు ఏర్పడివుంటాయి



## తిధులు

ఆకాశవీధిలో మానవుని ఆకర్షించిన గ్రహం సూర్యునితరువాత రెండోది చంద్రుడు. సూర్యుడు తాపాన్ని శక్తినీ ఇస్తే. చంద్రుడు చల్లదనాన్ని ఉత్సాహాన్ని రాత్రులందు ఇవ్వడము గమనించాము.

సూర్యుడు పశ్చిమ దిశలో అస్తమించగనే తూర్పు దిశన చంద్రుడు ఆహ్లాదాన్ని కలిగించే రీతిలో ప్రత్యక్షమవుతాడు. ప్రస్తుతం కూడా ఈ ఆహ్లాదాన్ని పల్లెలలో చూడవచ్చు. అయితే యీ చంద్రబింబము ఎపుడూ ఒకేలా ఉండక రోజు రోజుకూ మారుతూ ఉంటుంది. అమవాస్య వెళ్ళిన మరునాడు సన్నని రేఖామాత్రంగా పడమర కనిపించి మరలా పూర్ణిమ (15) రోజులకు సాయంకాలమునకు క్రమంగా తూర్పున కనిపిస్తాడు. పూర్ణిమవెళ్ళిన తరువాత క్రమంగా ఏ విధంగా పెరిగాడో ఆ విధంగా మరోవైపు నుండి తరుగుతూ మరలా అమావాస్య నాటికి కనిపించడము మానేస్తాడు. పూర్ణిమ నుండి పూర్ణిమకు గాని అమావాస్య నుండి అమావాస్యకు గాని వ్యవధి ఇంచుమించు 30 రోజులు ఉంటుంది.

సూర్యుని కాంతి చంద్రునిమీద పడి ఒక చంద్రునిలో సగ భాగాన్ని వెలుతురుతో నింపుతుంది రెండవ అర్ధ భాగం చీకటిగా ఉండి కనిపించదు. చంద్రుడు భూమి చుట్టూ తిరగడం వలన చంద్రునిపై కాంతి పడిన ప్రదేశం భూమిమీద ఉన్న మనకు కనిపించినపుడు పూర్ణిమ అవుతుంది. కనిపించని రోజులలో అమావాస్య అవుతుంది.

అన్ని గ్రహాల వలెనే చంద్రుడు, భూమి కొన్ని నియమాలకు లోబడి సూర్యుని చుట్టు తిరుగుట వలన క్షీణ వృద్ధులు కలిగిన తిధులు ఏర్పడుతున్నాయి.

చంద్రుడు ఒక నక్షత్రం దగ్గర నుండి మరలా అదే నక్షత్రము దగ్గరకు రావడానికి 27 రోజులు పడుతుంది. అంటే 360°లు తిరగడానికి లేదా ఒక భూ ప్రదక్షణకి 27 రోజులు పడుతుంది. కాని అమావాస్యనుండి అమావాస్య కున్న వ్యవధి 29 1/2 రోజులు అవుతుంది. ఈ మార్పు భూమి కూడా సూర్యునిచుట్టు తిరగడం వల్ల ఏర్పడింది.

సూర్యుని చుట్టూ భూమి ఒక (360°) పెద్ద వలయాన్ని 365 రోజులలో పూర్తిచేస్తుంటే చంద్రుడు 27 రోజులలో భూప్రదక్షణ (360°) తిరుగుతున్నాడు ఒక అమావాస్యనాడు భూమి చంద్రుడు ఒకే స్థానంలో ఉన్నారని అనుకొన్న చో 27 రోజులు అయ్యేవరికి చంద్రుడు భూప్రదక్షణ చేస్తున్నాడు కాని భూమి కూడా కొంత దూరం ప్రయాణము చేస్తుంది. అందుచేత ఆకాశంలో భూమి ఉన్న ప్రదేశానికి చంద్రుని స్థానం కూడా కలియడానికి మరో రెండున్నర రోజులు పడుతుంది. అందుచే చంద్రుడు తన పరిభ్రమణాన్ని + భూమి తిరిగే కాలాన్ని కూడా అదిగమించి అమావాస్య చేస్తున్నాడు. అంటే ఒక అమావాస్య నుండి మరొక అమావాస్యకు చంద్రుడు తిరిగే 360° లు + భూమి తిరిగే 30 డిగ్రీలు వెరసి 390 డిగ్రీలు తిరుగుతాడు, కొంచెం హెచ్చు తగ్గులలో అంటే సుమారుగా 1 రోజుకు సరాసరి 15 డిగ్రీలు తిరుగుతాడు.

ఇపుడు భూమిపై నుండి మనం చూస్తే సూర్యుడు తిరుగుతున్నట్లు కన్పిస్తాడు కదా! అందుచే సూర్యుని నుండి చంద్రుడు ఎంత దూరం ప్రయాణం చేశాడు అని లెక్కవేస్తే తిథి వస్తుంది. ఈ విషయాలను మనవారు చాలా ప్రాచీనకాలం నుండి తయారు చేశారు. ఇపుడు తిథి అంటే

చంద్రుని ప్రయాణములో నుండి సూర్య ప్రయాణాన్ని (భూమి ప్రయాణం) తీసివేస్తే తిథివస్తుంది. 390—360 = 30 తిథులు ఏర్పడినవి, అంటే 30 తిథులను చంద్రుని ప్రయాణం 360° డిగ్రీలు అంటే ఒక్కొక్క తిథిని 360 ÷ 30 = 12 డిగ్రీలు అవుతుంది.

ఒక తిథికు సూర్యచంద్రుల మధ్య దూరము 12 డిగ్రీలుగా ఇంచుమించుగా గుర్తించారు. పాడ్యమి ప్రారంభం నుండి అమావాస్య వరకు 29రోజుల 12 గంటల 44 ని॥ల 2.7 సెకనులు అగును,



## నక్షత్రము

మనం పంచాంగములో తిధి తరువాత చూచేది ఆరోజు ఏ నక్షత్రము అని

నక్షత్రమంటే నాశనము లేనిది అని అర్థము.

మనము సూర్యాస్తమయ (సాయంకాల) మయిన తరువాత ఒకటి రెండు గంటలకు ఆకాశమున చంద్రునితో పాటు ఒక్కొక్క తార ఒక్కొక్క తార రంగప్రవేశము చేయును. ఆ విధముగా ఆకాశమంతయు నక్షత్రసమూహములతో నిండిపోవును. ఇచట మనకొక సందేహము కలుగక మానదు.

ఆకాశము నందు ఇన్నిన్ని నక్షత్రములు మనము లెక్కించలేనన్ని ఉండగా మనవారు 27 నక్షత్రములనే ఎందుకు చెప్పినారు. అని మనము ముందు అనుకొనినట్లుగా గ్రహములన్నియు ఒక నియమమునకు లోబడి నడచుచు ఆకాశమున కూడ ఒక నియమిత మార్గమునందు నడచుచున్నది. ఇది ఆకాశ మధ్యమున యున్నది. ఈ గ్రహాదులు సంచరించు మార్గముననే క్రాంతి వృత్త మనియు జ్యోతిశ్చక్రమనియు వ్యవహరించుచున్నాము. ఈ ప్రధాన గ్రహ గమన మార్గమేది కలదో ఆ మార్గముననే తారా సముదాయ

ములు కలలో వాటిలో ప్రధానమయిన వాటిగా మనకు ఫలితము నిచ్చుటలో కూడ ప్రధానమైన వాటిగా మనవారు గుర్తించి అవియే మనము అనుకొను అశ్విన్యాది నక్షత్రములు ప్రతి నక్షత్రమునకును కొన్ని ప్రత్యేక ఆకారములు కూడ కనిపించుచున్నవి.

భూమిపై నుండి చూచుచున్న మనకు గ్రహములన్నియు ఆయా నక్షత్రాదులయందు సంచరించునట్లు కనిపించును. మనము జాగ్రత్తగా పరిశీలించినచో చంద్రుడు 15 రోజులలో 180° డిగ్రీలు అంటే అర్థవృత్తమును తిరుగుచున్నాడు. ఈ కాలమునందు అనగా అమావాస్య మరుసటి దినము నుండి మనము పరిశీలించిన ఆకాశమున గ్రహ గమనము ఏ విధముగా నున్నది. మనకు తెలియును. చంద్రుడు ఏ దినమున ఏ నక్షత్ర ప్రాంతమునందుండునో ఆ దినము నందు ఆ నక్షత్రముగా మనము పంచాంగములందు దిన నక్షత్రముగా వాడుకొనుచున్నాము. చంద్రుడు ఒక నక్షత్ర ప్రారంభము నుండి మరల అదే నక్షత్ర ప్రాంతమునకు వచ్చుటకు అనగా ఒక భచక్రభ్రమణమునకు 27 రో. 7 గం. 43 ని॥ల 11.5 సెకనులు పట్టును మనకు ఉన్న గ్రహములన్నియు ఈ నక్షత్ర మార్గముననే తిరుగుచుండగా చంద్రుడున్న నక్షత్రమే దిన నక్షత్రముగా భావించుట ఎందుకను ప్రశ్న ఉదయించకమానదు

మానవుడు కాలగణనమునకు ఉపయోగించు పద్ధతులను సూక్ష్మముగా గ్రహించినాడు. అమావాస్యవెళ్ళిన తరువాత చంద్రుడు ఏ నక్షత్రము నందున్నాడు పూర్ణిమ రోజున ఏనక్షత్ర ప్రాంతమున క్రాంతిచక్రము నందున్నాడు అని పరిశీలించినాడు. ఈ పరిశీలనలో ఒక్కొక్క రోజునకు చంద్రుడు ఒక్కొక్క నక్షత్రమునకు మారుచున్నట్లు కనుగొని జ్యోతిశ్చక్రము గణనకు చంద్రునితో సంబంధముండుట వలన చంద్రుని కాల ప్రమాణమునకు సాధనముగా గ్రహించినాడు.

ఇదియే గాక ఒక పూర్ణిమ రోజున చంద్రుడు ఏ నక్షత్ర ప్రాంతమునందున్నాడో మరల పదమూడవ పూర్ణిమ రోజునకూడ చంద్రుడు అదే నక్షత్ర ప్రాంతమున ఉండుట గమనించినాడు. ఆ పరిశీలనా సారాంశముగా చిత్తా నక్షత్రము రోజున పూర్ణిమ సంభవించినచో 'అంటే పూర్ణిమ రోజున చంద్రుడు చిత్తా నక్షత్ర ప్రాంతములో ఉంటే చైత్రమాసం అన్నాడు.

పూర్ణిమ రోజున చంద్రుడు విశాఖా నక్షత్రములో ఉంటే వైశాఖంగాను

పూర్ణిమరోజున జ్యేష్ఠా నక్షత్రంలో చంద్రుడు ఉంటే జ్యేష్ఠమాసం గాను వ్యవహరించడం జరిగింది.

ఈ విధంగా మాస గణనంలోను తిథి గణనంలోను చంద్రునికి ప్రాము ఖ్యాన్ని గుర్తించి మరియు ప్రతిరోజును కొలవడానికి కూడ చంద్రునికి ఎక్కువ ప్రాముఖ్యము ఉంది కాబట్టి దిననక్షత్రము చంద్రుడున్న నక్షత్రంగాభావించి దానిని అమలుపరచారు.

అంతేకాక మిగిలిన గ్రహాల నక్షత్ర సంచారకాలము చాలా ఎక్కువగాను స్థిరముగాను లేక ఋజు వక్రములు కలిగి ఉండడము కూడా ఒక కారణమగును

అందుచే చంద్రునికి వక్రగతిలేని కారణము వలన సూర్యుని నుండి నక్షత్రమును గుర్తించలేని కారణమున చంద్రుడున్నదే దిన నక్షత్రముగా గ్రహించిరి

## వారము

ప్రస్తుత కాలములో ప్రపంచమంతటా వాడుకలోఉన్న వారముల పేర్లు మనకు ప్రత్యక్షముగా కనిపించే గ్రహముల పేరులే

వారమంటే పర్యాయమని అర్థము.

నక్షత్రమునకు నాలుగు పాదములుగా మనవారు విభజించారు. ఒక నెలలో 30 రోజులు ఉంటాయి అందులో 15రోజులు ఒక పక్షము చంద్రకళలతో సంబంధము కలిగి ఉంటుంది.

కాని ప్రత్యేకముగా చంద్రుని గమనమునే తీసికొనిన రోజులలో ఈ వారము ఏర్పడి ఉండవచ్చును. చంద్రుడు 27 లేదా 28 రోజులలో ఒక భచక్ర గమనమును పూర్తి చేస్తాడు. అంటే 360° లు తిరగడానికి 27 లేక 28 రోజులు పడుతుంది. ఈ కాలాన్ని నాలుగు సమభాగాలుగా చేయడానికి అంటే వృత్త ములో నాల్గవ భాగం చంద్రుడు గడవడానికి నిర్ణయించిన కాలమానముగా దీనిని లెక్కించవచ్చును. అందుచేతనే వారములకు గ్రహాల పేర్లు ఏర్పడినవి.

సూర్య సిద్ధాంతములో గ్రహముల కక్ష్యలు ఆధారముగా ఈ వార నియ మము చెప్పబడియున్నవి.

కాల గణనములో 1 రోజును రెండు భాగాలు చేశారు అది పగలు రాత్రి అని ఈ పగలు నాలుగు ఝాములు రాత్రి నాలుగు ఝాములు చేశారు.

అదే విధంగా ఒక నెలకు నాలుగు వారాలు అనే మాట కూడా మనకు వాడుకలో ఉంది.

## యోగము

రవి చంద్రుల నిరయన గతిని కలిపినచో యోగములు అగును. ఇవి కూడ ఇరువది ఏడు కలవు విష్కంభాది క్రమమున. ఇవి ఆ ముహూర్తాదుల కగు బలవత్తర యోగసంభవ విషయములను నిర్దేశించుచున్నవి. ప్రస్తుతము మన పురోహితులు దీనిని వదలివేయుచున్నారు. కాని తప్పక వీనిని గ్రహించి ముహూర్త నిర్ణయము చేసినచో మంచి ఫలితములు పొందగలరు.

## కరణము

తిధిని రెండు భాగములు చేసి కరణమును నిర్ణయించి యున్నారు. కరణము అనగా చేయునది అని అర్థము తిధిని సూక్ష్మపరిశీలన చేసి దీనిని నిర్ణయించిరి. కరణము తిధి కంటె ప్రాముఖ్యము కలదిగా గ్రహించాలి.

పై పంచాంగములను జాగ్రత్తగా పరిశీలన చేసినచో మనము జాతక ముహూర్తాదుల యందు మంచి ఫలితములను పొందగలము.



# రాజాది నవ నాయక నిర్ణయము

శ్లో॥ చైత్రాది, మేష, హరి, కర్కట. చాప, యుగ్మ, రౌద్రర్ష
తౌళి, మకరేషుచ. వాస రేశా :
రాజచ, మంత్రీ, భటనాయక, సస్యనాథ, ధాన్యార్ఘ
మేష. రస, నీరసపా॥ క్రమేణ

| | | |
|---|---|---|
| 1 | వత్సరాది వారాధిపతి | రాజు |
| 2 | మేష సంక్రమణ వారాధిపతి | మంత్రి |
| 3 | సింహ సంక్రమణ వారాధిపతి | సేనాథిపతి |
| 4 | కర్కాటక సంక్రమణ వారాధిపతి | సస్యాధిపతి |
| 5 | ధనుస్సంక్రమణ వారాదిపతి | ధాన్యాధిపతి |
| 6 | మిధున సంక్రమణ వారాధిపతి | అర్ఘ్యాధిపతి |
| 7 | ఆరుద్ర ప్రవేశ వారాధిపతి | మేఘాధిపతి |
| 8 | తులా సంక్రమణ వారాదిపతి | రసాధిపతి |
| 9 | మకర సంక్రమణ వారాధిపతి | నీరసాదిపతి |

సేనధాన్యార్ఘ్యమే ఘనీరసాధిపతులు ఐదుగురికి ప్రవేశ దినంబున రాత్రి యిందు నిశి ప్రమాణమును 3 భాగములు చేయగా ప్రవేశ సమయము రెండు భాగములు పూర్వదిన వారాధిపతిని గాను, మూడవ భాగమైతే పరదిన వారాధిపతిగాను చూడవలెను. రవి సంక్రమణము అర్థరాత్రి నంతరము వచ్చి నపుడు ముందు వారాధిపతిని మంత్రి, సస్యాధిపతులుగాను తెలియవలయును

## : పశు పాలకాది నిర్ణయము :

పశుపాలకుడు = చైత్ర శు ౧మీనాటి వారాధిపతి (వర్షాధిపతి)
గోష్ఠప్రాపకుడు = ఆరుద్రా ప్రవేశ వారాధిపతి (మేఘాధిపతి)

గోష్ఠ బహిష్కర్త = మిధున సంక్రమణ వారాధిపతి (అర్ఘాధిపతి)

పై మూడు ఆధిపత్యములకు ఈ క్రింది విధముగా వేయవలెను.

| | | | |
|---|---|---|---|
| పశుపాలకుడు :- | రవి, కుజుడు | = | యముడు |
| | బుధుడు, శని | = | బలభద్రుడు |
| | గురు, శుక్ర చంద్రుడు | = | గోపాలుడు |
| గ్రోష్ఠ ప్రాపకుడు :- | రవి, కుజుడు | = | యముడు |
| | బుధుడు, శని | = | బలభద్రుడు |
| | గురు, శుక్ర చంద్రులు | = | శ్రీ కృష్ణుడు |
| గోష్ఠ బహిష్కర్త :- | రవి, కుజుడు | = | యముడు |
| | బుధుడు, శని | = | బలభద్రుడు |
| | గురు, శుక్ర చంద్రులు | = | గోపాలుడు |

సంవత్సర పంట నిర్ణయము ఎన్ని వీసములు ?

ఏ సంవత్సరమునకైనను ఆ సంవత్సరము నందలి నవ నాయకులను పశు నాయకుని మొత్తము 10 మంది యందు శుభులెందరు గలరో అందరకు శుభ గ్రహము 1కి 1 3/4 చొ॥న మొత్తము గ్రహములకు లభించిన పంటను వేయవలయును.

## : ఆఢక నిర్ణయము :

రాజును బట్టి ఆఢక నిర్ణయమును చేయవలయును.

| | | |
|---|---|---|
| రవి కుజులు రాజగుచో | = | 2 కుంచములు |
| బుధ, చంద్రులు రాజగుచో | = | 3 కుంచములు |
| గురు, శుక్రులు రాజగుచో | = | 4 కుంచములు |
| శని రాజగుచో | = | 1 కుంచము |

## : ఆఢక హస్త స్థితి నిర్ణయము :

శని.........................................................శని చారమును బట్టి

1) చర రాసులగు, మేష, కర్కాటక, తులా, మకరములందు సంచరించు చున్నప్పుడు గణికా హస్తమున

2) స్థిరాసులగు వృషభ, సింహ, వృశ్చిక. కుంభముల యందు సంచరించు చున్నప్పుడు గోప హస్తమున

3) ద్విస్వభావ రాశులగు, మిధున, కన్యా. ధను, మీనముల యందు సంచరించునప్పుడు బ్రాహ్మణ హస్తమున అఢక స్ధితిని చేయవలెను.

## : గోపాదులకు వయో నిర్ణయము :

శని రాశి సంచారము :

మొదటి పది భాగములు బాల్యము

రెండవ పది భాగములు యౌవనము

మూడవ పది భాగములు వృద్ధత్వము

## : అఢక ప్రమాణములు :

1) రవి కుజులకు :-

షష్టి యోజన విస్తీర్ణం శతయోజనమున్నతం దశ భాగాన్సముద్రేషు పర్వతేషు చసప్తచ ద్వౌభాగౌ భువిపర్జన్య స్త్వేవంవర్షతి చత్రిదా ॥

2) గురునకు, శుక్రునకు :-

షష్టి యోజన విస్తీర్ణ శతయోజన మున్నతం అష్ట భాగాన్సముద్రేషు పర్వతేషు తధానవత్రి భాగాభువిపర్జన్య శ్చైవం వర్షతి

3) చంద్ర బుధులకు :-

సప్త భాగాన్సముద్రేషు పర్వతేషు తధాదశ చతుర్భాగా ధరాణ్యాస్యు రేవం వర్షతి చత్రిధా ।

4) శనికి :-

నవ భాగాన్సముద్రేషు పర్వతేషుచ పంచశి:

సప్త భాగాభు వి పర్జన్య శ్చైవం వర్షతి చత్రిదా ।

# సంక్రాంతి పురుష విషయములు

## సంక్రాంతి పురుషుని నామము

సూర్యుడు మకర రాశియందు ప్రవేశించినను వారాధిపతిని అనుసరించి

సంక్రాంతి పురుష నామము నిర్ణయింపబడును. మకర సంక్రాంతి సమయమునకు గల "కరణ"మును బట్టి సంక్రాంతి పురుష వాహనాది వస్త్ర జాతము నిర్ణయింపబడును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | ఆదివారం | ఘోరనామధేయం | ఊవారిష్టం | అగరు | సువృష్టి |
| 2 | సోమవారం | ధ్వాంక్షనామధేయం | వైశ్యారిష్టం | చందనం | సుభక్షం |
| 3 | మంగళవారం | మహోదవనామధేయం | చోరారిష్టం | బిల్వం | మనదారి |
| 4 | బుధవారం | మందాకినీ నామధేయం | రాజారిష్టం | కుంకుమ | శుభము |
| 5 | గురువారం | మంద నామధేయం | విప్రారిష్టం | వేపాకు | రోగము |
| 6 | శుక్రవారం | మిశ్రా నామధేయం | పశు అరిష్టం | శంఖొ | సుఖము |
| 7 | శనివాశం | రాక్షస నామధేయం | చండారిష్టం | శుద్ధోదం | సువృష్టి |

## మేఘ వర్షోత్పత్తి ఫలములు

శాకాబ్దాన్ వసు బిర్హత్వానవ భిర్భాజితం క్రమాత్
శేషమావర్త సంవర్త, పుష్కర దోణ, కాలకాః
నీలాబ్యో వారుణో, వాయు, స్తమోమేఘనవస్మృతాః

ఫలములు :-

1) ఆవర్తనామ కోమేఘ, మేరోః శిఖరే మేఘస్యోత్పత్తిః
సుమేరోరూర్ధ్వ దిగ్భాగేత్వావర్తాబ్య ప్రకాయుత్తే
సువృష్టిః పూర్వ పశ్చార్ధి సేంద్రచాపాన గర్జితాః ॥

(2) సంవర్త నామకోమేఘః మేరోరుత్తరదిగ్భాగే మేఘోత్పత్తిః
వాయుపూరితతోయం చవర్షణాం సర్వదిక్షుచ
లవణార్ణవ పర్యంతం సంవర్తాభ్రస్య లక్షణమ్ ॥

(3) పుష్కర నామ కోమేఘః మేరోరీశాన్య దిగ్భాగేమేఘోత్పత్తి
మందవృష్టిర్మంద తోయంఃమహావాయుః ప్రవర్తతే
లక్షణం పుష్కరాభ్రస్య సర్వమూలావి శాశయత్

(4) ద్రోణనామకోమేఘః మేరోః ప్రాగ్దిగ్భాగే మేఘోత్పత్తి ।
నిరంతరం మహావర్షం మధ్యదేశత దైవచ
అశుభ సర్వలోకానాం ద్రోణమేఘస్య లక్షణం

# రాజాది నవ నాయక నిర్ణయము

శ్లో॥ చైత్రాది, మేష, హరి, కర్కట; చాప, యుగ్మ, రౌద్రర్ష
తౌళి, మకరేషుచ. వాస రేశా :
రాజచ, మంత్రీ, భటనాయక, సస్యనాధ, ధాన్యార్ఘ
మేష. రస, నీరసపా॥ క్రమేణ

| | | |
|---|---|---|
| 1 | వత్సరాది వారాధిపతి | రాజు |
| 2 | మేష సంక్రమణ వారాధిపతి | మంత్రి |
| 3 | సింహ సంక్రమణ వారాధిపతి | సేనాధిపతి |
| 4 | కర్కాటక సంక్రమణ వారాధిపతి | సస్యాదిపతి |
| 5 | ధనుస్సంక్రమణ వారాదిపతి | ధాన్యాధిపతి |
| 6 | మిధున సంక్రమణ వారాధిపతి | అర్ఘ్యాధిపతి |
| 7 | ఆరుద్ర ప్రవేశ వారాధిపతి | మేఘాధిపతి |
| 8 | తులా సంక్రమణ వారాదివతి | రసాధిపతి |
| 9 | మకర సంక్రమణ వారాధిపతి | నీరసాదిపతి |

సేనధాన్యార్ఘమే ఘనీరసాధిపతులు ఐదుగురికి ప్రవేశ దినంబున రాత్రి యిందు నిశి ప్రమాణమును 3 భాగములు చేయగా ప్రవేశ సమయము రెండు భాగములు పూర్వదిన వారాధిపతిని గాను, మూడవ భాగమైతే పరదిన వారాధిపతిగాను చూడవలెను. రవి సంక్రమణము అర్ధరాత్రి నంతరము వచ్చి నపుడు ముందు వారాధిపతిని మంత్రి, సస్యాధిపతులుగాను తెలియవలయును

## : పశు పాలకాది నిర్ణయము :

పశుపాలకుడు = చైత్ర శు ౹మీనాటి వారాధిపతి (వర్షాధిపతి)
గోష్టప్రాపకుడు = ఆరుద్రా ప్రవేశ వారాధిపతి (మేఘాధిపతి)

గోష్ఠ బహిష్కర్త = మిధున సంక్రమణ వారాధిపతి (అర్ఘ్యాధిపతి)

పై మూడు ఆధిపత్యములకు ఈ క్రింది విధముగా వేయవలెను.

| | | | |
|---|---|---|---|
| పశుపాలకుడు :- | రవి, కుజుడు | = | యముడు |
| | బుధుడు, శని | = | బలభద్రుడు |
| | గురు, శుక్ర చంద్రుడు | = | గోపాలుడు |
| గ్రోష్ఠ ప్రాపకుడు :- | రవి, కుజుడు | = | యముడు |
| | బుధుడు, శని | = | బలభద్రుడు |
| | గురు, శుక్ర చంద్రులు | = | శ్రీ కృష్ణుడు |
| గోష్ఠ బహిష్కర్త :- | రవి, కుజుడు | = | యముడు |
| | బుధుడు, శని | = | బలభద్రుడు |
| | గురు, శుక్ర చంద్రులు | = | గోపాలుడు |

సంవత్సర పంట నిర్ణయము ఎన్ని వీసములు ?

ఏ సంవత్సరమునకైనను ఆ సంవత్సరము నందలి నవ నాయకులను పశు నాయకుని మొత్తము 10 మంది యందు శుభులెందరు గలరో అందరకు శుభ గ్రహము 1కి 1 3/4 చొ॥న మొత్తము గ్రహములకు లభించిన పంటను వేయవలయును.

## : ఆఢక నిర్ణయము :

రాజును బట్టి ఆఢక నిర్ణయమును చేయవలయును.

| | | |
|---|---|---|
| రవి కుజులు రాజగుచో | = | 2 కుంచములు |
| బుధ, చంద్రులు రాజగుచో | = | 3 కుంచములు |
| గురు, శుక్రులు రాజగుచో | = | 4 కుంచములు |
| శని రాజగుచో | = | 1 కుంచము |

## : ఆఢక హస్త స్థితి నిర్ణయము :

శని.......................................................శని చారమును బట్టి

1) చర రాసులగు, మేష, కర్కాటక, తులా, మకరములందు సంచరించు చున్నప్పుడు గణికా హస్తమున

2) స్థిరాసులగు వృషభ, సింహ, వృశ్చిక. కుంభముల యందు పంచ రించు చున్నప్పుడు గోప హస్తమున

3) ద్విస్వభావ రాశులగు, మిధున, కన్యా. ధను, మీనముల యందు పంచరించునప్పుడు బ్రాహ్మణ హస్తమున ఆఢక స్థితిని చేయవలెను.

## : గోపాదులకు వయో నిర్ణయము :

శని రాశి సంచారము :

మొదటి పది భాగములు బాల్యము
రెండవ పది భాగములు యౌవనము
మూడవ పది భాగములు వృద్ధత్వము

## : ఆఢక ప్రమాణములు :

1) రవి కుజులకు :-
షష్టి యోజన విస్తీర్ణం శతయోజనమున్నతం దశ భాగాస్సముద్రేషు పర్వతేషు చసప్తచ ద్వౌభాగౌ భువిపర్జన్య స్త్వేవంవర్షతి చత్రిదా ॥

2) గురునకు, శుక్రునకు :-
షష్టి యోజన విస్తీర్ణ శతయోజన మున్నతం అష్ట భాగాస్సముద్రేషు పర్వతేషు తథానవత్రి భాగాభువిపర్జన్య శ్చైవం వర్షతి

3) చంద్ర బుధులకు :-
సప్త భాగాస్సముద్రేషు పర్వతేషు తథాదశ చతుర్భాగా ధరాణ్యాస్సు రేవం వర్షతి చత్రిధా ।

4) శనికి :-
నవ భాగాస్సముద్రేషు పర్వతేషుచ పంచశి :
సప్త భాగాభు వి పర్జన్య శ్చైవం వర్షతి చత్రిదా ।

# సంక్రాంతి పురుష విషయములు

## సంక్రాంతి పురుషుని నామము

సూర్యుడు మకర రాశియందు ప్రవేశించినను వారాధిపతిని అనుసరించి

సంక్రాంతి పురుష నామము నిర్ణయించబడును. మకర సంక్రాంతి సమయమునకు గల "కరణ"మును బట్టి సంక్రాంతి పురుష వాహనాది వస్తుజాతము నిర్ణయించబడును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | ఆదివారం | ఘోరనామధేయం | శూద్రారిష్టం | అగరు | సువృష్టి |
| 2 | సోమవారం | ధ్వాంక్షనామధేయం | వైశ్యారిష్టం | చందనం | సుభక్షం |
| 3 | మంగళవారం | మహోదరనామధేయం | చోరారిష్టం | బిల్వం | మనదారి |
| 4 | బుధవారం | మందాకినీ నామధేయం | రాజారిష్టం | కుంకుమ | శుభము |
| 5 | గురువారం | మంద నామధేయం | విప్రారిష్టం | వేపాకు | రోగము |
| 6 | శుక్రవారం | మిశ్రా నామధేయం | పశు అరిష్టం | శంభో | సుఖము |
| 7 | శనివారం | రాక్షస నామధేయం | చండారిష్టం | శుద్ధోదం | సువృష్టి |

# మేఘ వర్షోత్పత్తి ఫలములు

శాకాబ్దాన్ వసు భిర్హత్వానవ భిర్భాజితం క్రమాత్
శేషమావర్త సంవర్త, పుష్కర ద్రోణ, కాలకాః
నీలాఖ్యో వారుణో, వాయు, స్తమోమేఘనవస్మృతాః

ఫలములు :-

1) ఆవర్తనామ కోమేఘ, మేరోః శిఖరే మేఘస్యోత్పత్తిః
సుమేరోరూర్ధ్వ దిగ్భాగేత్వావర్తాఖ్య ప్రజాయతే
సువృష్టిః పూర్వ సస్యర్ధి సేంద్రచాపావ గర్జితాః ॥

(2) సంవర్త నామకోమేఘః మేరోరుత్తరదిగ్భాగే మేఘోత్పత్తిః
వాయుపూరితతోయం చవర్షణాం సర్వదిక్షుచ
లవణార్ణవ పర్యంతం సంవర్తాభ్రస్య లక్షణమ్ ॥

(3) పుష్కర నామ కోమేఘః మేరోరీశాన్య దిగ్భాగే మేఘోత్పత్తి
మందవృష్టిర్మంద తోయం మహావాయుః ప్రవర్తతే
లక్షణం పుష్కరాభ్రస్య సర్వమూలాని శాశయత్

(4) ద్రోణనామకోమేఘః మేరోః ప్రాగ్దిగ్భాగే మేఘోత్పత్తి ।
నిరంతరం మహావర్షం మధ్యదేశత దైవచ
అశుభ సర్వలోకానాం ద్రోణమేఘస్య లక్షణం

(5) కాలనామ కోమేఘ : మేరోర్దక్షిణ దిగ్భాగే మేఘోత్పత్తి !
నిరంతరం మహావర్షం మధ్యదేశ మహాజలం
ఫలంతి సర్వధాన్యాని కాలమేఘస్య లక్షణమ్

(6) నీలనామకోమేఘ : మేరోరాగ్నేయ దిగ్భాగేమేఘోల్ప
నీలమేఘం నిరాలంబమల్ప వష్టిరవర్షతా
అశోభనంచ జీవానాం నీలమేఘస్య లక్షణం

(7) వాయు నామకోమేఘ : మేరోర్వాయువ్య దిగ్భాగేమేఘ
మహావాయు : ప్రవర్తంతే మహా ఘోరం మహా జలం
ఫలంతి సర్వధాన్యాని వాయుమేఘస్య లక్షణం

(8) వారుణనామకోమేఘ : మేరోనైఋతి దిగ్భాగే మేఘ :
మహాఘోరం మహాఘాతం వర్షం వాయు సమన్వితం
వారుణోనామ మేఘోకసీ సముద్రాంతం ప్రవర్షతి

(9) తమోనామకోమేఘ: మేరో పశ్చిమ దిగ్భాగేమేఘ:
మహావర్షం మహాఘోరం గర్జితం మేఘ మండలే
ఏకార్ణవంతమో మేఘ : సాగరాంతం ప్రవర్షతి ॥

## రాజ పూజ్యావమాన నిర్ణయము

ఆదిత్య షట్కం, దశపంచ చంద్రే
భౌమాష్ట సంఖ్యా, దశపస్త సౌమ్యే
ఏకోనవింశత్ సరరా జమన్త్రీ
శుక్రేత వింశంచ శనిర్దశంచ ॥ (రాశ్యధిపతి సంఖ్యానియమము)
అబ్దాదిపతి సంఖ్యా నియమము)

రాశిసంవత్సరే చైక్యం త్రిగుణంశర సంయుతం
పంచాదశ హరేద్భాగం శేషమాదయ నిర్ణయం :
తల్లబ్ధంత్రి గుణేకృత్వా బాణ సంఖ్యాయుతం పదం
పంచాదశ హరేద్భాగం శేషం తువ్యయ మాదిశేత్ ॥

(రాశ్యధిపతి అబ్దాధిపతి ధ్రువముల కలిపి "3" చే గుణించి అందు "5" కలిపి 15 చే భాగించిన శేషము ఆదాయము. ఆదాయ లబ్ధమును 3చే గుణించి 5 కలిపి "15" చే భాగించిన శేషం వ్యయము,

## : కందత్రయ ఫల నిర్ణయము :

చైత్రాది తిథి వారేణ కరణాద్యోగ తారకం ।
జన్మనక్షత్ర సంయుక్త తథాత్రి స్థాపితం పదం ॥
పురశైల కులఘ్నంచ వసువహ్ని శరైర్హతం ।
లబ్ధం విమ్నశ్శ్యతచ్ఛేషం కందాయత్రయముచ్యతే ॥

## కందత్రయ ఫల నిర్ణయము

చైత్రశుద్ధ పాడ్యమి నాటి తిథి, వార, కరణ యోగ నక్షత్రములతో జన్మ నక్షత్రము కలిపి మూడు ప్రతులుంచి 3, 7, 7 చే గుణించి 8, 3, 5 చే భాగింపగా కందాయ ఫలములు వచ్చును



## సంవత్సర ఫలము - నక్షత్ర రీత్యా

చైత్రాది తిథి వారేణ కరణాద్యోగ తారకమ్
జన్మ నక్షత్ర సంయుక్తం సప్తభిర్భాగమాహరేత్
1) అర్థ లాభః, 2) మనస్తాపం 3) రాజమాన్యం 5) చయుద్ధతః
5) భూషణం. 6) రోగ 7) మాయుష్యం సంవత్సర ఫలంమా లభేత్॥

## రెండవ పద్ధతి

చైత్రాది, తిథి, వారేణ, కరణాద్యోగ తారకమ్
జన్మనక్షత్ర సంయుక్తం సప్తభిర్భాగ మహరేత్
మనస్తాపం, రాజమాన్యం; యుద్ధం, భూషణం తథా
రోగ, మాయుష్య, మర్థంచ, సంవత్సర ఫల మిరతమ్

| | | |
|---|---|---|
| 1) | మనస్తాపం | సంవత్సరాది నాటి తిథి, వారం |
| 2) | రాజపూజ్యం | నక్షత్రం. యోగం. కరణం |
| 3) | యుద్ధ భయం | జన్మ నక్షత్రం మొత్తం ఆరు |
| 4) | అలంకార ప్రాప్తి | కూడి 7 చేత భాగించి శేషమును |

5) రోగ భయం
6) ఆయుర్వృద్ధి
7) అర్థలాభం

గురించి ఫలము గ్రహించవలెను.



## రాజ పూజ్యావమానాని

వర్షాధిపతులు వర్షాధిపతులు

| సం॥ | రాశి | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | మేషం | ౭ ౨ | ౪ ౭ | ౪ ౩ | ౩ ౧ | ౫ ౪ | ౧ ౨ | ౩ ౬ |
| 2 | వృషభం | ౧ ౩ | ౨ ౭ | ౨ ౩ | ౬ ౧ | ౭ ౪ | ౪ ౨ | ౬ ౬ |
| 3 | మిధునం | ౪ ౩ | ౩ ౧ | ౩ ౬ | ౫ ౪ | ౧ ౨ | ౨ ౩ | ౫ ౫ |
| 4 | కర్కాటకం | ౨ ౩ | ౬ ౧ | ౬ ౬ | ౭ ౪ | ౪ ౨ | ౩ ౩ | ౭ ౫ |
| 5 | సింహం | ౩ ౬ | ౫ ౪ | ౫ ౫ | ౧ ౨ | ౨ ౩ | ౬ ౩ | ౧ ౪ |
| 6 | కన్య | ౬ ౬ | ౭ ౪ | ౭ ౫ | ౪ ౨ | ౩ ౩ | ౫ ౬ | ౪ ౭ |
| 7 | తుల | ౫ ౫ | ౧ ౨ | ౧ ౭ | ౨ ౨ | ౬ ౩ | ౭ ౬ | ౨ ౧ |
| 8 | వృశ్చికం | ౭ ౫ | ౪ ౨ | ౪ ౭ | ౩ ౩ | ౫ ౬ | ౧ ౫ | ౩ ౧ |
| 9 | ధనుస్సు | ౧ ౭ | ౨ ౨ | ౨ ౭ | ౬ ౩ | ౭ ౬ | ౪ ౫ | ౬ ౧ |
| 10 | మకరం | ౪ ౭ | ౩ ౩ | ౩ ౧ | ౫ ౬ | ౧ ౫ | ౨ ౭ | ౫ ౪ |
| 11 | కుంభం | ౨ ౭ | ౬ ౩ | ౬ ౧ | ౭ ౬ | ౪ ౫ | ౩ ౭ | ౭ ౪ |
| 12 | మీనం | ౩ ౧ | ౫ ౬ | ౫ ౪ | ౧ ౫ | ౨ ౭ | ౬ ౭ | ౧ ౨ |

# • ఆదాయ వ్యయములు •

| నెం. | రాశి | ఆది | | సోమ | | మంగళ | | బుధ | | గురు | | శుక్ర | | శని | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | మేషము | ౨ | ౧౪ | ౧౪ | ౨ | ౮ | ౧౪ | ౫ | ౫ | ౧౧ | ౫ | ౨ | ౮ | ౧౪ | ౧౪ |
| 2 | వృషభము | ౧౧ | ౫ | ౮ | ౧౧ | ౨ | ౮ | ౧౪ | ౧౧ | ౫ | ౧౪ | ౧౧ | ౪ | ౮ | ౮ |
| 3 | మిధునము | ౧౪ | ౨ | ౧౧ | ౨ | ౫ | ౫ | ౨ | ౧౧ | ౮ | ౧౧ | ౧౪ | ౧౧ | ౧౧ | ౪ |
| 4 | కర్కాటకము | ౮ | ౨ | ౫ | ౮ | ౧౪ | ౨ | ౧౧ | ౮ | ౨ | ౧౧ | ౮ | ౧౧ | ౫ | ౫ |
| 5 | సింహము | ౧౧ | ౧౧ | ౮ | ౨ | ౨ | ౧౪ | ౧౪ | ౨ | ౫ | ౫ | ౧౧ | ౫ | ౮ | ౧౫ |
| 6 | కన్య | ౧౪ | ౨ | | | ౫ | ౫ | ౨ | ౧౧ | ౮ | ౧౧ | ౧౪ | ౧౧ | ౧౧ | ౫ |
| 7 | తుల | ౧౧ | ౫ | ౮ | ౧౧ | ౨ | ౮ | ౧౪ | ౧౧ | ౫ | ౧౪ | ౧౧ | ౪ | ౮ | ౮ |
| 8 | వృశ్చికము | ౨ | ౧౪ | ౧౧ | ౮ | ౮ | ౧౪ | ౫ | ౫ | ౧౧ | ౫ | ౨ | ౮ | ౧౪ | ౧౪ |
| 9 | ధనుస్సు | ౫ | ౫ | ౨ | ౧౧ | ౧౧ | ౫ | ౮ | ౧౧ | ౧౪ | ౧౧ | ౫ | ౧౪ | ౨ | ౮ |
| 10 | మకరము | ౮ | ౧౪ | ౫ | ౫ | ౧౪ | ౧౪ | ౧౧ | ౫ | ౨ | ౮ | ౮ | ౮ | ౫ | ౨ |
| 11 | కుంభము | ౮ | ౧౪ | ౫ | ౫ | ౧౪ | ౧౪ | ౧౧ | ౫ | ౯ | ౮ | ౮ | ౮ | ౫ | ౨ |
| 12 | మీనము | ౫ | ౫ | ౨ | ౧౧ | ౧౧ | ౫ | ౮ | ౧౧ | ౧౪ | ౧౧ | ౫ | ౧౪ | ౨ | ౮ |
| | పకలాదాయము | ౫౯ | ౫౩ | ౫౩ | ౪౭ | ౫౬ | ౬౫ | ౬౫ | ౫౩ | ౪౭ | ౬౫ | ౫౯ | ౭౦ | ౫౩ | ౫౬ |

# దుర్ముహూర్తములు

పగటి ప్రమాణమును గాని రాత్రి ప్రమాణమును (సూర్యోదయము నుండి సూర్యాస్తమయమువరకు పగలు; సూర్యాస్తమయము నుండి సూర్యోదయము వరకు రాత్రి అనబడును) 15 చే భాగింపగా దుర్ముహూర్త ప్రమాణము అగును. అనగా పగలు 15 ముహూర్తములు రాత్రి 15 ముహూర్తములు ఉండును.

| | 1వ దుర్ముహూర్తము | 2వ దుర్ముహూర్తము |
|---|---|---|
| ఆదివారము | 14వ ముహూర్తము | పగలు |
| సోమవారం | 9వ ,, | 12వ పగలు |
| మంగళవారం | 4వ ముll౦ పగలు | 7వ ముహూర్తం రాత్రి |
| బుధవారం | 8వ ,, పగలు | |
| గురువారం | 6వ ,, ,, | 12వ ముహూర్తం పగలు |
| శుక్రవారం | 4వ ,, ,, | 9వ ,, ,, |
| శనివారం | 1-2 ,, ,, | |

1989 అక్టోబరు 25 వ తేదీ బుధవారం అహః ప్రమాణము 11 34 దీనిని 15 చే భాగించగా 1వ ముహూర్తమునకు 46 ని-16 సెకనులు అయినది

బుధవారం 8వ ముహూర్తము దుర్ముహూర్తము కావున 8వ ముహూర్తములు గం. 5-23 నిll-52 సెకనులకు ప్రారంభమయినది. ఇది ఏ ప్రాంత సూర్యోదయ సమయమునకు కలిపిన ఆ ప్రాంత దుర్ముహూర్త ప్రారంభ కాలమగును. రాజమండ్రీ సూర్యోదయము 6 గంటలు కావున 6 + 5-23-52= గం. 11-23 ని.-52 సె అనగా ఆ రోజు దుర్ముహూర్తము రాజమండ్రి ప్రాంత వాసులకు గం. 11-24 నిllకు ప్రారంభమయినది. ఆ రోజు ముహూర్త ప్రమాణము 46 నిllలు 16 సెకనులు కావున గం. 11-24 నిll + గం. 0-46 నిll-16 సెll = గం. 12-10 నిll-16 సెll అయినది. ఇది దుర్ముహూర్తము అంత్యము.

## : వర్జ్యమును కనుగొను విధము :

ఏ నక్షత్రమునకు వర్జ్యము (విష సమయము) కావలెను ఆ నక్షత్రా

ద్యంతమును వర్జ్యధ్రువములచే గుణించి 24చే భాగింపగా లబ్ధము గంటలగును దానిని పూర్వనక్షత్ర అంత్యమునకు కలిపిన వర్జ్య ప్రారంభం కాగలదు.

నక్షత్రాద్యంతమును 15చే భాగింపగా వచ్చిన లబ్ధము వర్జ్యప్రమాణము అగును. దీనిని వర్జ్యప్రారంభమునకు కలిపిన వర్జ్యసమాప్తి కాలము కాగలదు.

1989 సెప్టెంబరు 20వ తేదీ కృత్తిక ప గం 11-59 వరకు కలదు కృత్తిక ఋక్షాద్యంతము కావలసిన కృత్తిక ప్రారంభము అనగా భరణి అంత్యము కావలయును భరణి 19వ తేదీ మధ్యా. 1-51 ని॥కు ఉన్నది. అనగా ఋక్షాద్యంతము గం. 22-8 ని॥ అయినది. దీని కృత్తికా నక్షత్ర వర్జ్య ధ్రువమగు 12చే గుణించవలయును కాగా గం. 265-36 ని॥ అయినది దీనిని 24చే భాగించగా లబ్ధము 11-04 అయినది. దీనిని భరణి అంత్యఘడియలగు 1-51 ని॥కు కలుపగా గం. 12-55 అయినది. అనగా 19వ తేదీ రాత్రి 12-55 ని॥ల నుండి వర్జ్యము ప్రారంభమయినది. అనగా (భరణి అంత్యము) కృత్తిక ప్రారంభమయినది నుండి గం. 11-04 ని॥కు కృత్తిక వర్జ్యసమయము ప్రారంభమైనది

కృత్తికా నక్షత్ర ఆద్యంతమును గం. 22-08 ని॥లు 15చే భాగించగా గం. 1-29 ని॥ అయినది దీనిని వర్జ్య ప్రారంభ సమయమగు గం. 12-55కు కలుపగా 14-24 అయినది. ఇది 12 కంటె ఎక్కువ కలదు కావున 12 గం॥లు తీసివేసిన రాత్రి 2-24వరకు వర్జ్యమున్నదని తెలియవచ్చును. ఈవిధముగనే అమృత సమయమును తెలిసికొనవలయును.

| నక్షత్రములు | వర్జ్య ప్రారంభ ధ్రువము | అమృత ప్రారంభ ధ్రువము |
|---|---|---|
| 1. అశ్వని | | |
| 2. భరణి | | |
| 3. కృత్తిక | | |
| 4. రోహిణి | | |
| 5 మృగశిర | | |
| 6. ఆరుద్ర | | |
| 7. పునర్వసు | | |
| 8. పుష్యమి | | |
| 9. ఆశ్లేష | | |
| 10. మఘ | | |

| నక్షత్రములు | వర్జ్య ప్రారంభ ధృవము | అమృత ప్రారంభ ధృవము |
|---|---|---|
| 11. పూర్వ ఫల్గుణి | | |
| 12 ఉత్తర ఫల్గుణి | | |
| 13 హస్త | | |
| 14 చిత్త | | |
| 15. స్వాతి | | |
| 16. విశాఖ | | |
| 17. అనూరాధ | | |
| 18. జ్యేష్ట | | |
| 19. మూల | | |
| 20. పూర్వాషాడ | | |
| 21 ఉత్తరాషాడ | | |
| 22. శ్రవణం | | |
| 23 ధనిష్ట | | |
| 24. శతతార | | |
| 25. పూర్వాభాద్ర | | |
| 26. ఉత్తరాభాద్ర | | |
| 27. రేవతీ | | |

## చంద్ర శృగోన్నతి

శుక్లపక్షాది యందు చంద్రోదయ సమయమునకు చంద్రుడు మీన మేషముల యందున్న దక్షిణ శృంగము ఎత్తుగా నుండును. వృషభ కుంభ రాసుల యందున్న సమశృంగముగా యుండును. మిధునము, కర్కాటకము సింహము, కన్య, తుల, వృశ్చి, ధనుస్సు, మకరములయందు ఉన్నచో ఉత్తర శృంగము ఎత్తుగా నుండును.



# కల్పం అంటే ఏమిటి?

మనము ఏదయినా పనినారంభించునపుడు సంకల్పము చెప్పుచుందుము కదా! ఆ సంకల్పములో "శుభే శోభనే ముహూర్తే... ... .... అద్య బ్రహ్మణ శ్వేత వరాహ కల్పే వైవస్వత మన్వంతరే అని ప్రస్తుతము మనము ఈ శ్వేత వరాహ కల్పమున 7 సంధులు, 6 మన్వంతరములు గతించి 7వ మన్వంతర మున 27 మహాయుగము లతిక్రమించి 28 వ మహాయుగమున కృత, త్రేత, ద్వాపరయుగములు గడచి కలియుగము నందున్నాము.

## కల్పము అంటే ఏమిటి

నవగ్రహములు, వాటి కక్ష్యా దూరబిందువులు (Nods) వాటి కక్ష్యలు రవి మార్గాన్ని ఖండించే బిందువులు ఇవి అన్నీ అశ్వనీ నక్షత్రమునందు కలసి యున్న కాలము నుండి మరల ఇవి అన్నీ అదే నక్షత్రమున కలియుటకు కల మధ్యకాలమునకు కల్పము అని పేరు. ఇది ఇంచుమించు 4320000000 సౌర సంవత్సరములకు సమానము.

ఒక మన్వంతరమునకు 71 మహాయుగముల చొప్పున $6 \times 71 = 426$ మహాయుగములు. ప్రస్తుతము ఏడవదియగు వైవస్వత మన్వంతరమున 27 మహాయుగములు గతించినవి కావున $426 + 27 = 453$ మహాయుగములు. ఈ సంఖ్యను మహాయుగ సంవత్సర సంఖ్యయగు 4320000000 చే గుణింప 1956960000 దీనిలో 7 సంధులు గతించినవి కావున సంధిప్రమాణ సంవత్సర ములగు $1728000 \times 7 = 12096000$. వీటిని కల్పాదిగత మహాయుగాంతమున కైన సంవత్సరములునూ, 28వ మహాయుగమున గతించిన కృత, త్రేత, ద్వాపర యుగములను గలిపిన

| | |
|---|---|
| కల్పాదిగత మహాయుగాంతమునకైన సంవత్సరములు | 1969056000 |
| ఏడు సంధుల ప్రమాణ సంవత్సరములు | 12096000 |
| 28వ మహాయుగమున కృత, త్రేత, ద్వాపరములు గతించినవి | 1972944000 |
| ప్రస్తుతము కలియుగ సంవత్సరములు | 5084 |
| | 3954101084 |
| కల్పాది నుండి సృష్టి ప్రారంభంవరకు గడచిన సంవత్సరాలు | 17064000 |
| ఇవి ఇప్పటి అయిన సృష్ట్యాది సౌరగత సంవత్సరములు | 3937037084 |

# సంవత్సర కాల ప్రమాణ మెంత ?

భూమి సూర్యునిచుట్టూ ప్రదక్షిణచేసి వచ్చు కాలమునకు సాయన సంవత్సరము అని పేరు. అనగా విషువద్బిందువు వద్ద బయలుదేరి మరల అదే విషువద్బిందువు దగ్గరకు వచ్చు కాలము. ఈ కాలము కొలత 365 . 242199 రోజులుగా నిర్ణయించిరి. దీనినే Tropical year అంటారు.

అయితే ఒక ప్రకాశవంతమయిన నక్షత్రము నందలి సూర్య సహోదయ కాలము నుండి మరల అదే నక్షత్రము రెండవ పర్యాయము సూర్య సహోదయ కాలము వరకు నయిన సంవత్సరమును నాక్షత్ర సంవత్సరము అందురు. ప్రస్తుతము ఈ సంవత్సరపు కొలత 365 256366 గా నిర్ణయించిరి. దీనిని Sidereal year అని అంటారు.

పైన చెప్పబడిన సాయన సంవత్సరమునకును, నాక్షత్ర సంవత్సరమునకును కొద్ది భేదము కలదు. దీని ప్రమాణము 0 . 014161 రోజులు లేదా 20 నిముషముల 23 సెకనులకు సమానము. ఈ సంవత్సరముల మధ్య తేడా ఎందుకు వచ్చుచున్నదో పరిశీలించుదము.

## విషువత్తులు

పైన చెప్పబడిన సంవత్సరపు కొలతల యందలి భేదము ఈ విషువత్ చలనముల మూలముననే కలుగుచున్నది. ఈ విషువత్ చలనమునుగుర్తించు రోజును మనము పంచాంగములందు చూడగలము. ఈ విషువచ్చలనమునే "భూ అక్ష చలనము" అని అంటారు. ఇది మన నిత్య జీవితములో కనుపించు చలనము కాదు.

భూ అక్షము ఎప్పుడును ఒకే దిశయందుండక ఒక చిన్న వృత్తమును చుట్టును. ఈ భూమి యిరుసు ఒక వలయమును పూర్తి చేయుటకు 25,800 సంవత్సరములు రమారమి పట్టును. అంటే భూమి అక్షము 360° డిగ్రీలు చుట్టుటకు పట్టు కాలమని అర్థము. రవిమార్గమును పన్నెండు నక్షత్రరాశులుగా విభజించిరి. ఈ రవి మార్గమునకు 23 1/2 డిగ్రీల కోణములో భూగోళ మధ్య రేఖ ఉన్నది. రవి మార్గమును, ఈ భూమధ్య రేఖ ఖండించుకొను బిందువులే విషువద్బిందువులు. రవి మార్చి 21వ తేదీన వసంత విషువత్తుదగ్గర సెప్టెంబర్ 23వ తేదీన శరద్విషువత్ వద్ద ఉంటాడు. ఈ ఖండన బిందువులు స్థిరముగా

మందక కదలిపోవుటకు కారణము ఖగోళ మధ్యరేఖ. ఈ ఖగోళ మధ్యరేఖ కదలుటకు కారణము భూ అక్షము ఎపుడూ ఒకే దిశలో నుండక అతినెమ్మదిగా కదులుచుండుటయే. రవి మార్గము స్థిరమయిననూ ఖగోళ మధ్యరేఖ కదలును కావున విషువచ్చలనము సంభవించుట వలన సాయన సంవత్సరమునకు, నాక్షత్ర సంవత్సరమునకును 20ని॥ 23 సెకనుల తేడా కన్పించుచున్నది. ఈ తేడా చాలా తక్కువయిననూ 70 . 6 సంవత్సరములకు ఈ విషువత్తులు అయనాంతాలు ఒక్కోరోజు చొప్పున వెనుకకు జరుగును.

క్రీ॥ శ॥ 100 నుండి క్రీ॥ పె 2050 సంవత్సరముల మధ్య కాలమున వసంత విషువత్తు మేషరాశిలో ఉండెడిది. ప్రస్తుతము ఈ వసంత విషువత్తు మీనరాశిలో ఉన్నది. ప్రస్తుతమున్న మీనరాశిని వసంత విషువత్తు క్రీ॥ శ॥ 2250 సంవత్సర ప్రాంతమున కుంభరాశిలో ప్రవేశించునన్నమాట. అంటే ఈ విషువత్తులు, అయనాంతములూ ఒక రాశి నుండి మరియొక రాశిని ప్రవేశించు కాలము 2150 సంవత్సరములు ఇది ఒక బిందువు నుండి మరియొక అనగా అదే బిందువును చేరు కాలము 25,800 సంవత్సరములు. ప్రస్తుతము మనము వాడుచున్న మేషాది రాశిచక్రము, సంవత్సరాన్ని వసంతవిషువత్తుతోను ఆరంబించే ఆచారము క్రీ॥ పె 2050 నుండి క్రీ॥ శ 100 వరకు గల కాలము నాటిదనుట నిర్వివాదము.

## : అధిక మాస నిర్ణయము :

చాంద్రమానము సరాసరి పొడవు సుమారు 29 . 5305879 రోజులు. ఈ చాంద్రమానము 29 రోజుల 7 గంటల 20 నిమిషముల నుండి 29 రోజుల 19 గంటలు 30 నిమిషములు. అంటే చాంద్ర సంవత్సర సరాసరి ప్రమాణము 354 36706 అగును. ఈ సంవత్సరమునకును తేడా 10 . 8893 రోజులగును. ఈ చాంద్ర సంవత్సరములకును సౌర సంవత్సరములకును మధ్యనున్న భేధమును సరిచేయుట కొఱకు అధిక, క్షయ మాసములను ఏర్పరచిరి. ఒక అధిక మాసము వచ్చిన తరువాత 28 నెలలకు దాని తరువాత 34 నెలకు దాని తరువాత 35 నెలలకు, దాని తరువాత 28 నెలలకు దాని తరువాత 34 నెలలకు దాని తరువాత 34 నెలలకు దాని తరువాత 35 నెలలకు తిరిగి మరల క్రమముగా అధిక మాసములు వచ్చును.

## క్షయ మాసములనగా ఏమి?

ఒక చాంద్రమాసమున అనగా పాడ్యమి తిథి ప్రారంభము నుండి అమావాస్య (చివరి) పూర్తి అగువరకు అయిన చాంద్రమాసమున రవి రాశి ప్రవేశము లేకుండిన దానిని అధికమాసమని నిర్ణయించిరి. ఏ చాంద్రమాసాన రెండు రవి రాశి ప్రవేశములు జరుగునో ఆ మాసమును క్షయ, లేక లుప్త మాసమనియును చెప్పిరి. అధికమాసము చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ. శ్రావణ. భాద్రపద, ఆశ్వయుజము లనబడు ఏడు మాసములందు మాత్రము వచ్చును. కాని క్షయమాసము కార్తీక, మార్గశిర, పౌష మాసములందు మాత్రము వచ్చును. ఈ క్షయమాసము వచ్చిన సంవత్సరమున రెండు అధిక మాసములు వెనుక ముందుల వచ్చును. అనగా క్షయ మాసమునకు ముందొకటియు, క్షయమాసము తదుపరి ఒకటియు అధికమాసములు వచ్చును



## సౌర చాంద్ర మానములు

మనము వ్యవహారమునందు ముప్పది(30) దినములు ఒక మాసముగా గుర్తించుచున్నాము. కాని ఆకాశ మార్గమున (క్రాంతి మండలం) రవిసంచరించు పథము 360° లతో అండాకార వృత్తము కలిగియున్నది. రవి ఒక రోజునకు సుమారుగ ఒక భాగను దాటును. దీనిని సౌరదినమని వ్యవహరించెదరు. ముప్పది భాగలుదాటు కాలమునకు సౌరమాసమనియును చెప్పబడును. రవి ఒక రాశినుండి వేరొక రాశిని ప్రవేశించు సమయమునకు సంక్రమణము అని చెప్పబడును. రాశి చక్రమున 12 రాసులుండుట చేతను ఒక సంవత్సరమునకు 12 సంక్రమణంబులు ఉండును, దీనికి అనగా రవి భచక్రమును పూర్తిచేయు కాలము సౌర సంవత్సరమగును. ఇది 365.24 రోజులకు సమానము.

తిథిని అనుసరించి చాంద్రమానము ఏర్పడును. సూర్యచంద్రులు ఏకరేఖ (ఒకే డిగ్రీ) నుండు సమయమునుండి మరల సూర్యచంద్రులు ఒకే

డిగ్రీలి పొందు కాలమునకు అనగా శుద్ధ పాడ్యమి ప్రారంభము నుండి అమావాస్య అంత్యము వరకు నుండు కాలము చాంద్రమాసమందురు ఈ మాసములను చైత్రాది మాసములుగ వ్యవహరించుచుందుము.

చాంద్రమాసముల సంవత్సరమునకు 354రోజులు కాగా సౌరమాసముల సంవత్సరమునకు 365 రోజులు ఇంచుమించుగా కాగలవు. సౌర చాంద్రముల రెండింటి మధ్య 11 రోజుల వ్యత్యాసము వచ్చును. ఈ వ్యత్యాసమును సరిచేయుచు సౌరమాసముతో సరియగుటకు అధిక మాసమును నిర్ణయించిరి. ఈ అధిక మాసముల యందలి లోపములు సరిచేయుటకు క్షయమాసములను నిర్ణయించిరి అధికమాసము సౌర చాంద్రమానముల సమన్వయమునకై 30 చాంద్రమాసముల తదుపరి ఒక అధికమాసము వచ్చును. అధిక మాసము అనగా ఆ మాసమున రవి సంక్రమణము ఉండదు. పాడ్యమి ప్రారంభము నుండి మరల అమావాస్య సమయము పూర్తియగు లోపున రవి సంక్రమణం కాదు.

ఈ విధంగానే క్షయ మాసములు 19 సంవత్సరాలకొక పర్యాయము గాని, 121 సంవత్సరములకు గాని వచ్చును.

## రాబోవు సంవత్సరముల మూఢమిని తెలుసుకొనుట

నవగ్రహముల యందు సూర్య, చంద్రులకు వక్రగతి లేదు రాహు కేతువులకు ఋజుగతి లేదు. మిగిలిన అయిదు గ్రహములకును ఋజుగతి, వక్రగతులు రెండును కలవు. నిజమునకు ఈ గ్రహ వక్రాదులు గ్రహములకు లేవు ఎట్లనిన మనము రైలుపైన గాని బస్సుపై గాని ప్రయాణము చేయుచున్నపుడు సైకిలుపై మనము వెళ్ళు మార్గముననే మరియొక ప్రయాణికుడు వెళ్ళుచున్నాడనుకొందము, బస్సు వేగముగా ముందుకు పోవును. మనము దానిలో నుండి చూచిన సైకిలుపై వచ్చువాడు అదే దిశలో ప్రయాణించుచున్నను వెనుకకు పోవుచున్నట్లు అనిపించును ఇదే విధమున భూమి మొదలుగా గల అన్ని గ్రహములు సూర్యుని చుట్టు తిరుగుచున్నపుడు భూచలనం వలన భూమిపై నున్న మనకు ఆ గ్రహము వెనుకకు పోవుచున్నట్లనుభూతమగును. అనగా ఆ సమయమున భూమి ఆ వక్రగతిని పొందిన గ్రహము ఒకే రేఖలో నున్నట్లుగ తెలియగలదు, తదుపరి ఆ సమాంతర రేఖను రెండు

గ్రహములు చేరిన సమయమున గ్రహము స్థంభన పొందును. తదుపరి వక్రత పొందును.

## గ్రహముల ఉదయాస్తమయములు (మూఢమి)

ఏ గ్రహమయినను సూర్యునితో కలసియున్న కాలమునకు "మూఢమి" అని పేరు. కుజాది పంచ గ్రహములకును ఈ మూఢమి కలుగును. కాని శుభ గ్రహములగు గురు, శుక్రుల అస్తంగత్వమును మాత్రమే మనము మూఢమిగా గ్రహించుచున్నాము. ప్రస్తుతము కుజాది పంచగ్రహములకు కలుగు వక్ర అస్తగత్వాదులు సాధారణముగా కలుగు సమయములు చెప్పబడును.

### కుజుడు

కుజుడు సూర్యునితో అస్తమించినది లగాయితు నాలుగు నెలలకు తూర్పున ఉదయించును. తూర్పున ఉదయించిన పది నెలలకు వక్రించును వక్రారంభమయినది మొదలు రెండు నెలలకు వక్రమును విడచును, వక్ర త్యాగమయిన పది నెలలకు మరల పడమట అస్తమించును.

### బుధుడు

బుధుడు తూర్పున అస్తమించిన 32రోజులకు పడమట ఉదయించును. పడమర ఉదయించినది మొదలు 32 రోజులకు వక్రము పొందును. వక్ర ప్రారంభమునుండి మూడు రోజులకు పడమర అస్తమించును. పడమర అస్తమించినది మొదలు 16 రోజులకు తూర్పున ఉదయించుచుండును. తూర్పున ఉదయించిన మూడురోజులకు వక్రము విడచును. వక్రము విడచిన ముప్పది రెండు రోజులకు తూర్పున అస్తమించును.

### గురుడు

గురుడు తూర్పున ఉదయమయిన నాలుగు నెలల ఏడు రోజులకు వక్రము ప్రారంభించును. వక్రారంభమయిన నాలుగు నెలల పర్యంతము వక్రించి ఋజుమార్గమును అనగా వక్రమును వదలును వక్ర త్యాగమయిన ఇరువది ఏడు దినములకు పడమట అస్తమించును. పడమర అస్తమించిన ముప్పది దినములకు తూర్పున ఉదయించును.

## శుక్రుడు

శుక్రుడు తూర్పునఅస్తమించిన రెండునెలలకు పడమట ఉదయించును పడమర ఉదయించిన ఎనిమిది నెలల రెండు రోజులకు వక్రము ప్రారంభించును. వక్ర ప్రారంభమయిన ఇరువది రెండు రోజులకు పడమట అస్తమించును పడమట అస్తమించిన ఏడుదినములకు తూర్పున ఉదయించును తూర్పున ఉదయించిన ఇరువది రెండు రోజులకు వక్రమును వదలి ఋజుమార్గమున ప్రవేశించును. వక్రము వదలిన ఎనిమిది నెలలకు తూర్పున అస్తమించును.

## శని

తూర్పున అస్తమించిన ముప్పది ఏడు రోజులకు తూర్పుననే ఉదయించును. తూర్పున ఉదయించిన మూడు నెలల పదునైదు రోజులకు వక్రమునకు వచ్చును. వక్రము ప్రారంభించిన మూడు నెలల పదునైదు రోజులకు వక్రము విడచి ఋజుమార్గమున ప్రవేశించును. వక్రమును వదలిన మూడు నెలల పదునయిదు రోజులకు తూర్పున అస్తమించును.

ఈ పైన తెలుపబడిన గ్రహచారములు మధ్యమ మానమున అనుసరించి చెప్పబడినవి. ఇందు మాసమనగా 30 రోజులు గ్రహించవలయును. గ్రహస్ఫుటము చేయునపుడు స్వల్పదినముల తేడాలో పడిపోవును. పైన చెప్పబడిన విషయముల వలన రాబోవు సంవత్సరముల యందలి మూఢముల ఒకటి రెండు.

## * తెలుగు సంవత్సరములకు హరాహ సంవత్సరములు *

| తెలుగు సం॥ | ఇంగ్లీషు సం॥ | ఇం॥ సం॥ | అధిక మాసములు |
|---|---|---|---|
| 1) ప్రభవ | 1927-28 | 1987-88 | |
| 2) విభవ | 1928-29 | 1988-89 | |
| 3) శుక్ల | 1929-30 | 1989-90 | |
| 4) ప్రమోదూత | 1930-31 | 1990-91 | |
| 5) ప్రజోత్పత్తి | 1931-32 | 1991-92 | |
| 6) అంగిరస | 1932-33 | 1992-93 | |

| తెలుగు సం॥ | | ఇంగ్లీషు సం॥ | ఇం॥ సం॥ | అధిక మా॥లు |
|---|---|---|---|---|
| 7) | శ్రీముఖ | 1933-34 | 1993-94 | |
| 8) | భావ | 1934-35 | 1994-95 | |
| 9) | యువ | 1935-36 | 1995 96 | |
| 10) | ధాత | 1936-37 | 1996-97 | |
| 11) | ఈశ్వర | 1937-38 | 1997-98 | |
| 12) | బహుధాన్య | 1938-39 | 1998-99 | |
| 13) | ప్రమాది | 1939- 40 | 1999-2000 | |
| 14) | విక్రమ | 1940-41 | 2000-01 | |
| 15) | వృష | 1941–42 | 2001-02 | |
| 16) | చిత్రభాను | 1942-43 | 2002-03 | |
| 17) | స్వభాను | 1943.44 | 2003-04 | |
| 18) | తారణ | 1944-45 | 2004-05 | |
| 19) | పార్థివ | 1945-46 | 2005-06 | |
| 20) | వ్యయ | 1946-47 | 2006-07 | |
| 21) | సర్వజిత్తు | 1947-48 | 2007-08 | |
| 22) | సర్వధారి | 1948-49 | 2008-09 | |
| 23) | విరోధి | 1949-50 | 2009-59 | |
| 24) | వికృతి | 1950-51 | 20010-11 | |
| 25) | ఖర | 1951-52 | 20011-12 | |
| 26) | నందన | 1952-53 | 2012-13 | |
| 27) | విజయ | 1953-54 | 2013-14 | |
| 28) | జయ | 1954-55 | 2014-15 | |
| 29) | మన్మథ | 1955-56 | 2015-16 | |
| 30) | దుర్ముఖి | 1956–57 | 2016-17 | |
| 31) | హేవళంబి | 1957–58 | 2017–18 | |
| 32) | విళంబి | 1958–59 | 2018–19 | |
| 33) | వికారి | 1959–60 | 2019–20 | |
| 34) | శార్వరి | 1960–61 | 2020–21 | |
| 35) | ప్లవ | 1961–62 | 2021–22 | |
| 36) | శుభకృతు | 1962–63 | 2022–23 | |

| | తెలుగు సం॥ | ఇంగ్లీషు సం॥ | ఇం॥ సం॥ | అధిక మా॥లు |
|---|---|---|---|---|
| 37) | శోభకృతు | 1963-64 | 2023-24 | |
| 38) | క్రోధి | 1964-65 | 2024-25 | |
| 39) | విశ్వావసు | 1965-66 | 2025-26 | |
| 40) | పరాభవ | 1966-67 | 2026-27 | |
| 41) | ప్లవంగి | 1967-68 | 2027-28 | |
| 42) | కీలక | 1968-69 | 2028-29 | |
| 43) | సౌమ్య | 1969-70 | 2029-30 | |
| 44) | సాధారణ | 1970-71 | 2030-31 | |
| 45) | విరోదికృతు | 1971-72 | 2031-32 | |
| 46) | పరిధావి | 1972-73 | 2032-33 | |
| 47) | ప్రమాదీచ | 1973-74 | 2033-34 | |
| 48) | ఆనంద | 1974-75 | 2034-35 | |
| 49) | రాక్షస | 1975-76 | 2035-36 | |
| 50) | నల | 1976-77 | 2036-37 | |
| 51) | పింగళ | 1977-78 | 2036-38 | |
| 52) | కాళయుక్తి | 1978-79 | 2038-39 | |
| 53) | సిద్ధార్థి | 1979-80 | 2039-40 | |
| 54) | రౌద్రి | 1980-81 | 2040-41 | |
| 55) | దుర్మతి | 1981-82 | 2041-42 | |
| 57) | రుధిరోద్గారి | 1982-83 | 2042-43 | |
| 56) | దుందుభి | 1983-84 | 2043-44 | |
| 58) | రక్తాక్షి | 1984 85 | 2044-45 | |
| 59) | క్రోధన | 1985-86 | 2045-46 | |
| 60) | అక్షయ | 1986 87 | 2046-47 | |



# వెలుగు సంవత్సరము

# LIGHT YEAR

"వెలుగు కిరణములు బహువేగముతో పోవును. అంతటి యురువడి సృష్టిలో మఱదేనికి లేదు" అని ప్రస్కణ్వ ఋషి ఋగ్వేదమున తెలిపి యున్నారు.

యోజనానాం సహస్రేద్వే ద్వేశతేద్వేచ యోజనే
ఏకేన నిమిషార్ధేన క్రమమాణ నమోస్తుతే

15 నిమేషములు ఒక కాష్ట
30 కాష్టలు ఒక కళ
30 ముహూర్తములు 1 అహోరాత్రము = 4,06,000 నిమేషములు

ఇంగ్లీషు మానముగా

24 × 60 × 60 = 86400 సెకండ్లు ఒక దివారాత్రము ఒక సెకనుకు 4.6875 నిమేషములు.

అనగా ఒక అర్ధ నిమేషమునకు 8/75 సెకండ్ల కాలమునకు కాంతి 2202 యోజనములు గడచును.

1 యోజనము = నాలుగు క్రోసులు
1 క్రోసు = రెండువేల బారలు
4 బార = 20 గజములు (6-2-0)

ఈ మానము ననుసరించి యోజనమనగా 9 మైళ్ళు అగును. దీనినిబట్టి 1 సెకనులో కాంతి 187670 ఇంగ్లీషు మైళ్ళు వెళ్ళును. ప్రస్తుత సైంటిస్టుల ననుసరించి కాంతి 1 సెకనుకు 186330 అన్ని మైళ్ళు.

1 సంవత్సరమునకు కాంతి ఇంచుమించుగా 5,880,000 000,000 మైళ్లు

ఏ కాషామేవ తద్రమ్యం లగ్నం యత్రచ యస్యహృత్

(శుక్రనీతి) లోకధర్మ నిరూపన ప్రకరణం ఎవని మనసు దేని యందు లగ్నమగునో అది వానికి రమ్యమయినది.

## అష్టాదశ విద్యలు

1. ఋగ్యజుస్సా మాథర్వ వేదములు 4
2. శిక్షా, కల్ప, వ్యాకరణ, నిరుక్తంచ్ఛందో జ్యోతిషములు 6
3. పురాణములు 1
4. శాస్త్రములు 9
5. న్యాయము 1
6. మీమాంస 1
7. ఆయుర్వేధము 1
8. ధనుర్వేదము 1
9. గాంధర్వ వేదము 1
10. అర్థ శాస్త్రము 1

18

వార్తా, కామసూత్రం, శిల్పశాస్త్రం, దండనీతి రితిపూర్వై. సహాష్టాదశ విద్యాస్థానాని" ఇత్యపరే ;- రాజశేఖర కావ్య మీమాంస



# జననకాల నిర్ణయము
## (ఉత్తర కాలామృతము)

జాతక పరిశీలనకు ముందు జననకాల ప్రమాణము సరిగానున్నదియు. లేనిదియు తెలిసికొనవలయును. పూర్వము జననకాల జ్ఞానము పాదచ్ఛాయల మూలమున తెలిసికొనెడివారు. ప్రస్తుత కాలమున చేతిగడియారముల వలన సమయమును గుర్తించుచున్నారు. దీని వలన జన్మ సమయమునందు కొంత భేదము కలిగించుచున్నది. మనము వాడు ఏ గడియారము అయినను, మన దేశమున IST గా గుర్తింపబడుచున్నది. కాని జాతకమును గణించవలయు నయినచో LMT ని తెలిసికొనవలయును. కావున సూర్యోదయ కాలమునను సరించి, జననకాల ఘటికలను సరిచూచుట సరియగు పద్ధతి.

కాలామృతము నందు :-

నాడ్యశ్చైవ వినాడికాః కృతగుణా సూర్యోదయాన్నంద।
హృచ్ఛిష్టం దస్ర మఘాసురాత్రి నవకేస్యా జ్జన్మభందస్రతః॥

సూర్యోదయాది జననకాల ఘడియ విఘడియలను విఘడియలుగా మార్చి, దానిని నాలుగుచే గుణించి తొమ్మిదిచే భాగించగా మిగులునట్టి శేషం నవకము ననుసరించి జన్మ నక్షత్రమగును. అశ్వన్యాది ఇరువది ఏడు నక్షత్రములను మూడు నవకములుగా విడదీయబడును. దీనినే నవకశోధనయందురు

1వ నవకము : అశ్వని నుండి ఆశ్లేష వరకు
2వ నవకము : మఖ నుండి జ్యేష్ట వరకు
3వ నవకము : మూల నుండి రేవతి వరకు

చిత్తా నక్షత్ర జాతకుని జననకాల ఘటికలు సరిగా నున్నవా లేవాయని తెలిసికొనదలచిన జననకాల విఘటికలను నాలుగుచే గుణించి, తొమ్మిదిచే భాగించగా శేషము 5 వచ్చిన, ఆ ఘడియలు సరియగునవి. చిత్త రెండవ నవకమునందు ఐదవ నక్షత్రము. జన్మనక్షత్రమునకు సరిపడు శేషమురాకున్న ఆ జననకాల ఘటికలు అండజాదుల జననముగా తెలిసికొనవలయును. అది మానవ జన్మము కాజాలదు. జననకాల ఘటికలను ముందుకు గాని, వెనుకకు గాని, జరుపుకొని నక్షత్రమునకు సరిపడు శేషము వచ్చువరకు జరుపవలయును. మరియు ఆ జననకాల ఘడియలు జాతక స్త్రీ పురుష భేదములకు సరిపడినదియు, లేనిదియును చూడవలయును-

కాలామృతము నందు-

యద్వా పిష్ట ఘటీస్తథా విఘటికాస్తత్వాశ్వి హృచ్ఛేషతో
బాణేలాశ్చ గుణాశ్చ బాణ నిగమాష్టషిశ్చ బాణాద్రయః
శుద్ధాస్తా విఘటీక క్రమాన్నర వధూపుంస్త్ర్యాదిభేదస్మృతః।

సూర్యోదయాది ఘడియా విఘడియలను విఘడియల లోనికి మార్చి, దానిని 225చే భాగించవలయును. భాగించగా మిగిలిన శేషమునందు 15-30-45-60-75-90-105-120-135-150-165-180-195-210-225 అను సంఖ్యల యందు పదితీసి వేయబడునో ఆ సంఖ్యను తీసివేయవలెను. అట్లు తీసివేయబడిన సంఖ్య చివరి భాగమున 5 వున్న (బేసి సంఖ్యఅయిన) పురుష ఖండముగను, తీసివేయబడిన సంఖ్య చివర '0' వున్న, సరిసంఖ్య అయిన స్త్రీ

ఖండముగను గుర్తించవలయును. పురుష ఖండము తీసివేయబడిన స్త్రీ జాతకముగను, స్త్రీ ఖండము తీసివేయబడిన పురుష జాతకముగను గమనించవలయును. స్త్రీ పురుష జన్మములు సరిపడకపోయినచో తత్కాల స్వరమును సూర్యచంద్ర సుషుమ్న స్వరము ననుసరించి ముందు వెనుకలకు జరుపుకొని నవకశోధనకు సరిగా నక్షత్రశేషమువచ్చునటుల గమనించి జననకాల ఘటికా విఘటికలను నిశ్చయింపవలయును.

## : లగ్నాది ద్వాదశ రాశుల గణన విధి :

జన్మ ప్రదేశమునకు సరియగు సూర్యోదయాది జననకాల ఘడియలను కనుగొనవలయును. తదుపరి లగ్న భుక్తిని కనుగొనవలయును. లగ్న భుక్తిని 30 చేత గుణించి, దేశగత లగ్న వినాడికలచే భాగించినచో స్ఫుట లగ్నమగును దానిలో గత రాశులను కలుపవలయును-

## నత సాధనా పద్ధతి

జాతకుడు జననమయిన దినార్ధ యందు సూర్యోదయాది జననకాల ఘడియలు, ధన ఋణములు చేయువలయును-

(1) సూర్యోదయాది పగలు రెండు ఝాముల లోపున జననమయిన సూర్యోదయాది జననకాల ఘడియలు దినార్థలో తీసివేయవలెను.

(2) పగలు రెండు ఝాములు దాటిన తరువాత జననమయిన సూర్యోదయాది జననకాల ఘడియలలో దినార్ధను తీసివేయవలెను.

(3) రాత్రి రెండు ఝాముల లోపున జననమయిన సూర్యోస్తమయాది జననకాల ఘడియలను దినార్థలో కలుపవలయును-

(4) రెండు ఝాములు దాటిన తరువాత రాత్రి జననమయినచో, రాత్రి శేషించిన ఘడియలను అనగా జననము లగాయితు సూర్యోదయం వరకు గల ఘడియలను దినార్ధలో చేర్చవలయును-

రాత్రి రెండు ఝాములు దాటినది లగాయితు అనగా, అర్ధరాత్రి నుండి పగలు రెండు ఝాముల వరకు అనగా మిట్ట మధ్యాహ్నం వరకు పూర్వ కపాలము (A M.) అందురు.

పగలు రెండు ఝాములు దాటినది లగాయతు అనగా దినార్థ తరువాత రాత్రి రెండు ఝాముల వరకు పశ్చిమ కపాలము (P M) అందురు.

నతము వందు వచ్చిన ఘడియా విఘడియలను 6చే గుణించగా, రాశులు భాగలు, లిప్తలు వచ్చును— తదుపరి స్ఫుట రవిలో పూర్వ కపాలనతము యొక్క భాగలయిన తీసివేసియు, పశ్చిమ కపాలనత భాగలయిన కలుప వలయును. అట్లు చేయగా వచ్చినది దశమ భావమగును. ఈ వచ్చిన జన్మ దశమ భావములకు 6 రాశులు చేర్చిన సప్తమ చతుర్థములు వచ్చును.

## ద్వాదశ భావములు – సంధులు

చతుర్థ భావము నుండి తను భావమును తివిచి, వచ్చిన దానిని 6 చే భాగింపగా వచ్చిన లబ్ధమును (షష్ట్యంశము) తను భావములో కలిపినచో తను భావసంధి వచ్చును. ఈ విధముగ షష్ట్యంశమును కలుపుచు పోయిన, చతుర్థభావము వచ్చును. పై విధముగనే సప్తమ భావము నుండి చతుర్థ భావమును తీసివేసి 6చే భాగించగావచ్చిన షష్ట్యంశమును చతుర్థభావమువకు కలుపుచుపోయిన సప్తమ భావము వచ్చును. మరల దశమభావము నుండి సప్తమ భావమును తివిచి దానిని షష్ట్యంశము చేసి సప్తమ భావమునకు కలుపుచు పోయినచో దశమ భావమేర్పడును మరల లగ్నమునుండి దశమ మును తివిచి ఆ షష్ట్యంశమును దశమమువకు కలుపుచు పోయినచో, ద్వాదశ భావములు, త్రయోదశ భావసంధులు ఏర్పడును. ఇప్పుడు భావచక్రము ఏర్పడును. దీనియందు ఏ గ్రహము ఏ భావమును పొందియున్నదో నిర్ణ యించవలయును. ఈ భావచక్రము వేయకుండ జాతకమునకు ఫలనిరూపణ చేయుటగానుట మూర్ఖత యనిపించుకొనగలదు. భావచక్ర నిర్మాణానంతరము షోడశవర్గుల నిర్ణయించవలయును.

## సంవత్సర ఫలము....రవిగతి ననుసరించి

(తాజక నీలకంఠ కంఠీయము)

ఏ సంవత్సరమునకు దశాఫలము కావలయునో ఆసంవత్సరమున జన్మ కాల స్ఫుట రవిని ధృవముగా తీసికొని, ఆ ధృవమును తత్సంవత్సర రవి

హొందు సమయమును జాతకునకు సౌర సంవత్సరారంభ మగును ఆ కాలము నకు, జన్మ కాలమునకు చెప్పినట్లుగనే స్ఫుట గ్రహములను, ద్వాదశ భావము లను గుణించి సౌర సంవత్సర దశలను నిర్ణయించవలెను.

జన్మ నక్షత్రము మొదలు వర్ష ప్రారంభకాల నిత్య నక్షత్రము వరకు లెక్కించి, దానిని 9చే భాగించగా మిగిలిన సంఖ్య సౌరవర్ష నియమితగ్రహ దశాశేషము జన్మకాల దశాశేషము నిర్ణయించు పద్ధతి లోపలనే సౌరసంవత్సర దశాశేషము నిర్ణయించవలయును.

## : గ్రహ - దశకాల పరిమితులు ;

| | దినములు | నెల - దిన | సంఖ్య |
|---|---|---|---|
| రవి | 110 | 3 - 20 | 1 |
| చంద్ర | 60 | 2 - 20 | 2 |
| కుజ | 32 | 1 - 02 | 3 |
| బుధ | 40 | 1 - 10 | 4 |
| గురు | 48 | 1 - 18 | 5 |
| శుక్ర | 56 | 1 - 26 | 6 |
| శని | 4 | 0 - 04 | 7 |
| రాహు | 5 | 0 - 05 | 8 |
| లగ్న | 10 | 0 - 10 | 9 |



# లగ్న నిర్ణయము

లగ్నము అనగా కలియుట అని అర్థము

శిశువు భూ పతనమయిన సమయమున తూర్పు దిశయందు సూర్యో దయ ప్రాంతమున క్షితిజరేఖపై ఏ భాగరాశి చక్రమున ఉదయించుచున్నదో ఆ భాగను రాశిచక్రమున భావమధ్యమముగా గ్రహించవలయును. జనన సమయము నందలి ఆ లగ్న స్ఫుటమునకు గ్రహ ప్రభావమును పరిశీలించి జాతకుని భవిష్యత్ఫలితములు నిర్ణయింపవలయును.

భూమి తన అక్షముపై 24 గంటలు లేక 60 ఘడియలలో తన చుట్టూ తాను ఒక పర్యాయము తిరుగును. అట్లు తిరుగుట వలన రాత్రి పగలు ఏర్పడుచున్నది. ఈ 24 గంటలలో తూర్పునందు ఒకదానివెంబడి మరియొక రాశి క్రమముగ ఉదయించుచున్నట్లు కనుపించుచున్నది. ఈ రాశి స్థానములు భూమిగుండ్రముగా నుండుటచే జాతకుని జన్మ స్థానమును బట్ట ప్రతి అక్షాంశము (Latitude) కు మార్పు చెందును.

ప్రస్తుత కాలమునందు కొంత భూ భాగమునందు పరిస్థితుల వలన ఒకే విధమైన సమయముండవలయునని ప్రభుత్వములు యోచించి 1884వ సంవత్సరమున వాషింగటన్ ఇంటర్‌నేషనల్ కాంగ్రెసులో భూమినంతయు 15 భాగములుగా విభజించి ఒక్కొక్క భాగమునకు ఒకగంట మార్పుతో స్టాండర్డు టైమ్" నిర్ణయించిరి. గ్రీనిచ్ ప్రారంభముగా అర్ధరాత్రిమండి ఈ సమయము ప్రారంభమగును ఈ "స్టాండర్డు టైమ్" ఆయా జోనుల మధ్యభాగమున గల మధ్యాహ్న రేఖలకు సరిపెట్టబడి ఆయా జోనులకు ప్రాంతీయ సమయంగా వ్యవహరించుచున్నారు. భారతదేశము ప్రాంతీయ సమయము 82-30 తూర్పు రేఖాంశముగా నిర్ణయించిరి. గ్రీనిచ్ మధ్యాహ్న రేఖ "0°" భాగగా నిర్ణయించబడినది కావున దీనికి తూర్పుగా భారతదేశముండుట వలన దానికి 5-30 ని॥ముందుగా నుండును, గ్రీనిచ్చిలో అర్ధరాత్రి 12 గంటలు అయినపుడు భారతదేశ మధ్యకాలమానము ఉదయం 5-30 ని॥లు అగుచున్నది.

భూమి తన అక్షముపై ఒక ప్రదక్షిణ పూర్తిచేయుటకు గాను 24 గ॥లు పట్టుచున్నది. అనగా భూమి 24 గంటలలోను 360° డిగ్రీల ప్రదక్షిణము పూర్తి చేయుచున్నది. పై నిర్ణయానుసారము 1 డిగ్రీ భూ ప్రదక్షణకు 4 నిమిషములుపట్టును. గ్రీనిచ్ నుండి 82°-30 తూర్పురేఖాంశమున భూమియుండుట వలన 82-30 $\times$ 4 ని॥లు = 330 ని॥లు = 5-30 ని॥లు పూర్వము మనకు సూర్యోదయము అగుచున్నది.

ఈ విధముగనే భారతదేశ మధ్యకాలమునకు (I. S. T.) భారతదేశము నందలి వివిద పట్టణముల రేఖాంశము న గ్రహించి ఆయా ప్రాంతీయసమయములను నిర్ణయించవలయును. దీనినే స్థానిక కాలమాన అందురు.

భారతదేశము రేఖాంశముల మధ్య యున్నందునను, భారతదేశ

కాలమానము (I. S. T:) 82°-30 వద్ద నిర్ణయించి యున్నందునను భారత దేశమునందు వివిధ రేఖాంశములవద్ద సమయము మార్పుచెందును-ప్రాంతీయ లేక స్థానికకాలమానము సూర్యోదయ భేదముల వలన మార్పుచెందుచున్నది. ఈ మార్పు ఒక్కొక్క రేఖాంశమునకు 4 నిముషములుండును. భారతదేశ రేఖాంశము 82-30 తూర్పు కావున ఈ రేఖాంశలకు జనన ప్రాంతము తక్కువ రేఖాంశలము యందున్న I. S. T. లో తీసివేసి ను 82°-31 రేఖాంశాలకు ఎక్కువ రేఖాంశములున్న I.S. T.లో అన్ని డిగ్రీలకు నిముషములు కలిపియు స్థానిక కాలమానము ననుసరిచూడవలయును. ప్రస్తుతము భారతదేశమున మన గడియారములు చూపు సమయమంతయు I S.T, ఇండియన్ స్టాండర్డ్ సమయముగనే గుర్తెరుంగవలయును. ఎవరయినను ఒక జననసమయము చెప్పియుండిన అది I S.T. గా గుర్తించి ఆ జననము ఏ ప్రాంతమున జరిగినదో ముందుగా తెలిసికొని ఆప్రాంతపు రేఖాంశములను గ్రహించి ప్రాంతీయ సమయమును నిర్ధారించవలయును.

ఉదా॥

ఒక జాతకుడు 28-7-1989 న ఉద 9-24ని॥కు హైదరాబాదులో జన్మించినాడు. ఈ జన్మ సమయమును మనము I.S.T. గా గుర్తించవలయును అది మన గడియారముసూచించిన సమయమున మన గడియారములు భారతదేశ మధ్యకాలము 82-30 రేఖాంశముల సమయమును సూచించును.

హైదరాబాదు రేఖాంశములు 78°-27

భారతదేశ రేఖాంశములు 82-30నకు ఈ రేఖాంశములు తగ్గియున్నందున (4°-3,) 1 డిగ్రీకి నాలుగు నిముషముల చొప్పున 16ని॥ల 12 సెకనులు జనన సమయము నుండి తగించవలయును. ఇపుడు 9-24-16-12 = 9 గం. 7 ని॥-48 సె॥ హైదరాబాదున ప్రాంతీయ జనన సమయమగును.

ఇదే విధముగ పై సమయమునకు కలకత్తా యందు జననమయిన

కలకత్తా రేఖాంశములు 88-24

భారతదేశ రేకాంశములగు 82-30 కు 5°-54 పెరిగియున్నది. 1° భాగకు 4ని॥ చొప్పున 23 ని॥ల 36 సెకనులు I.S.T. కి కలిపిన అన జనన సమయము 9-24 + 0-23-36 కలిపిన 9 గ 47 ని 36 సె॥ అగును. ఇది కలకత్తా నగరము నందు స్థానిక కాలమానము అగుచున్నది,

ఈ విధముగా ఒకే భారతదేశ మధ్యకాలమునకు ఆయా రేఖాంశములు ననుసరించి స్థానిక కాలమానమును గుర్తించి అగ్నప్పుటము చేయవలెను.

# నిరయన కాలమానము

## సైడీరియల్ టైమ్

## SIDEREAL TIME

ఆకాశము నందలి ఒక స్థిర బిందువువద్ద ప్రయాణము ప్రారంభించి మరల అదే స్థిర బిందువును భూమిచేరు సమయమునకు (సైడీరియల్ టైమ్) నక్షత్ర సమయము అని పేరు,

భూమి తన అక్షముపై ఒక పర్యాయము 360° భాగలు తిరిగివచ్చుటకు 24 గంటలు పట్టును. నిజమునకు భూమి 360° భాగలు ఆత్మప్రదక్షణమునకు 23 గం. 56 ని॥లు మాత్రము పట్టును మన గడియారములో సూచించు 24 గంటల కాలమునకు భూమి 361° భాగల ఆత్మ ప్రదక్షణము చేయును.

ఈ కాలమును రవి సాయన రాశిచక్రము ప్రారంభ సమయమును హద్దుగా నిర్ణయించిరి రవి సాయన మేషమున మార్చి 21 వ తేదీ ప్రాంతమునందుండును. రవి ఆ కాలమున ఆకాశ మధ్యమున ఉచ్ఛయందుండును. గ్రీనిచ్చియందు ఇది మధ్యాహ్న కాలము. ఈ నిరయన కాలమానము ఆ సమయమున ప్రారంభమయి మరల రవి సాయనరాశి ప్రవేశముతో సమాప్తమగుచున్నది

భూమి తన అక్షముపై 360° భాగలు పయనించి ఒక నిరయన దినము పూర్తి చేయుచున్నది. ఈ సమయమున రవి ఒక భాగ తన కక్ష్యయందు ముందువకు కదలినట్లు మనకు కనిపించుచున్నది కాని నిజమునకు భూమి తన కక్ష్యయందు సూర్యునిచుట్టి వచ్చుటకు ఒక భాగ ముందుకు ప్రయాణము చేసినది. కావున రవి ఆకాశములో మధ్యాహ్న కాలమున భూమిపై ఉచ్ఛస్థితిని పొందుటకు ఒక భాగ ప్రయాణము చేయవలసి యుండును. ఈ భాగ ప్రయాణమునకు భూమికి 3 ని॥ 56 సెకనుల కాలము ఇంచుమించుగా పటుచున్నది,

ఈ విధముగా నిరయన కాలమానము 1 రోజునకు 3ని॥ 56 సె॥ల చొ॥న జరుగుచు 365 1/4 సౌర దినములలో 360౦ల ప్రయాణము చేయుచున్నది, లేదా 24 గంటలు పూర్తి చేయుచున్నది.

జనన కాల లగ్న పత్రిక వేయుటకు కావలసిన వివరములు.

1) జన్మించిన తేదీ
2) జన్మించిన సమయము I S, T
3) జన్మ స్థలము అక్షాంశ-రేఖాంశములు నిర్ధారించుట
4) జనన సమయమునకు నిరయన కాలము
5) జనన సమయ నిరయన గ్రహస్ఫుటము.
6) జనన సమయ చంద్రగ్రహ మహాదశా శేషము.

ఉదాహరణము :

1981-9-27 ఉద 9-10 ని॥కు జనన సమయము 17-21 అక్షాంశమున 82-32 రేఖాంశముల యందు జరిగినది.

ముందుగా నాక్షత్ర కాలము (Sidereal Time) కనుగొనవయును.

# రాశి చక్ర నిర్మాణ పద్ధతి

ఇపుడు రాశి చక్రమును వేయుదము. రాశిచక్రములు సవ్యము అపసవ్యములనియు రెండు విధములుగా వేయుచున్నారు.

| | | | |
|---|---|---|---|
| మీన | మేష | వృష | మిధు |
| కుంభ | సవ్య చక్రము | | కర్కా |
| మక | | | సింహ |
| ధను | వృశ్చి | తుల | కన్య |

| | | | |
|---|---|---|---|
| మిధు | వృష | మేష | మీన |
| కర్కా | అపసవ్య చక్రము | | కుంభ |
| సింహ | | | మక |
| కన్య | తుల | వృశ్చి | ధను |

దక్షిణ భారతదేశము నందు ఉత్తర భారతదేశమునను ఈ రెండు విధములయిన పద్ధతులను వాడుచున్నారు. పై గ్రహములననుసరించి.

| | | | |
|---|---|---|---|
| మీన | మేష | వృష ల | మిధు |
| కుంభ | సవ్యరాశి చక్రము | | కర్కా కు రా |
| మక కే | | | సింహ |
| ధను | వృశ్చి | తుల శు బు | కన్య రగు చ శ |

రవి 5 రాసుల 10 డిగ్రీల 50 నిముషముల యందున్నాడు. అనగా అయిదు రాసులు దాటి 6వ రాశియగు కన్యయందు రాశి చక్రమున చూపింపబడినది. అటులనే కుజుడు మూడు రాసులు దాటి నాల్గవ రాశియందు 22డి॥ల 20 ని॥లందు ఉన్నాడు. కనుక నాల్గవ రాశియగు కర్కాటకమున కుజుడున్నాడు.

జాతకుని జన్మలగ్నమును సాధించిన తరువాత గ్రహముల స్థానములను గుర్తించవలయును. గ్రహముల నిరయన భాగలను వేయునపుడు గ్రహములను I S T లో మాత్రము తీసికొనవలయును. ప్రాంతీయ సమయమునుబట్టి గ్రహములను సంస్కరించరాదు. పంచాంగము నందలి గ్రహస్థితిని బట్టియు గ్రహములను నిరయణ ప్రమాణము గ్రహించవచ్చునుగాని అదికష్టసాధ్యము ప్రస్తుతము మనకు లభించు అధునాతన పంచాంగముల యందు ప్రతి తేదీకి ఉద 5-30 ని॥కు గాని సాయంకాలము 5-30 ని॥కు గాని నిరయన స్ఫుట గహములను ఇచ్చుచున్నారు. భారతప్రభుత్వమువారు కూడ పంచాంగమును

మ (Ephemeris) ప్రచురించుచున్నారు. ఈ ఉదయకాల గ్రహముల నుండి జాతకుని జనన సమయమునకగు తత్కాల గ్రహస్థితిని సాధించవచ్చును.

ప్రస్తుత జాతకము నందు ఇండియన్ ఎఫమరీస్ నుండి తత్కాల గ్రహములను గ్రహించవచ్చును.

**27-9-1981** ఉదయము **9-10** నిఃకు గ్రహ స్థితి,

| | |
|---|---|
| రవి | 5-10-50-00 |
| చంద్ర | 5-04-27-18 |
| బుధ | 6-16 28-00 |
| శుక్ర | 6-23-24-00 |
| కుజ | 3-22-20-00 |
| గురు | 5-23-35-00 |
| శని | 5-18-11-45 |
| రాహు | 3-04-4000 |
| కేతు | 9-04-40-00 |

ముందుగా సాధించిన లగ్నము దశమమును గ్రహించిన

లగ్న రా 1-9-24
దశ 9-28-06 అయినది.

ఎఫమరీజ్ నందివ్వబడు నిరయన గ్రహములు మేషాది బిందువునుండి మీనము వరకు గ్రహించబడును. ఈ పట్టికలు ఇందు జత చేయబడినవి.

రాశి చక్రము వేసిన తదుపరి ఫలితములు చెప్పుటకు భావ చక్రమును తయారుచేయవలయును. ఫలితములు చెప్పుటయందు ఈ భావ చక్రము అత్యంత ప్రాధాన్యమును వహించుచున్నది.

## భావచక్ర నిర్మాణ పద్ధతి

కమగొనిన లగ్న స్థానమును దశమ స్థానమును గ్రహించవలయును, లగ్న స్ఫుటమే లగ్నభావ మధ్యమము దశమస్ఫుటమే దశమభావ మధ్య

మము. తను భావమునకు ఆరు రాసులు లేక 180° కలిపిన సప్తమభావ మధ్యమమగును. దశమభావ మధ్యమమునకు 6 రాసులు లేక 180° లు కలిపిన చతుర్థ భావము వచ్చును. ద్వాదశ భావములను కనుగొనునపుడు చతుర్థభావము నుండి లగ్న మధ్యమమును తీసివేసి దీనిని 6 భాగములుగా చేయవలయును. వీటిని కలుపుచు పోయిన సప్తమ భావమధ్యమము వరకు వచ్చును.

లగ్నము 1–9–24 చతుర్థ భావము 3–28–06

చతుర్థము—లగ్నము = 3—28—06

1— 9—24

2—18—42

మొత్తము భాగలు చేయగా 78—42

దీనిని ఆరు భాగములు చేయగా 82–42 ÷ 6 = 13–07 అయినది దీనిని లగ్న స్ఫుటమునకు 6 పర్యాయములు కలుపవలెను.

| | | |
|---|---|---|
| లగ్న భావ స్ఫుటము | 1 - 09 - 24 | |
| | 13 - 07 | షష్ట్యంశము |
| లగ్న సంధి | 1 - 22 - 31 | |
| | 13 - 07 | 2వ షష్ట్యంశము |
| ద్వితీయ భావ స్ఫుటము | 2 - 5 - 38 | |
| | 13 - 07 | 3వ షష్ట్యంశము |
| ద్వితీయ భావ సంధి | 2 - 18 - 45 | |
| | 13 - 07 | 4వ షష్ట్యంశము |
| తృతీయ భావ స్ఫుటము | 3 - 1 - 52 | |
| | 13 - 07 | 5వ షష్ట్యంశము |
| తృతీయ భావ సంధి | 3 - 14 - 59 | |
| | 13 - 07 | 6వ షష్ట్యంశము |
| చతుర్థ భావ స్ఫుటము | 3 - 28 - 6 | |

ఇపుడు మరల సప్తమ భావము నుండి చతుర్ధ భావమును తీసివేసి దీని షష్ట్యంశమును చతుర్ధ భావాదిగా కలుపవలయును.

సప్తమము - చతుర్థ స్ఫుటము = 7-09-24 — 3-28-06 = 3-11-18 భాగలు చేయగా 101 — 18.

షష్ట్యంశము = 101 — 18 ÷ 6 = 16 - 53 ఇది చతుర్థము నుండి ఆరు పర్యాయములు కలిపిన సప్తమము వచ్చును.

| | | |
|---|---|---|
| చతుర్థ భావ స్ఫుటము | 3 - 28 - 06 | |
| | 0 - 16 - 53 | షష్ట్యంశము |
| చతుర్థ భావ సంధి | 4 - 14 - 59 | |
| | 0 - 16 - 53 | షష్ట్యంశము |
| పంచమ భావ స్ఫుటము | 5 - 1 - 52 | |
| | 16 - 53 | షష్ట్యంశము |
| పంచమ భావ సంధి | 5 - 18 - 45 | |
| | 16 - 53 | షష్ట్యంశము |
| షష్ఠ భావ స్ఫుటము | 6 - 5 - 38 | |
| | 16 - 53 | షష్ట్యంశము |
| షష్ఠ భావ సంధి | 6 - 22 - 31 | |
| | 16 - 52 | షష్ట్యంశము |
| సప్తమ భావము | 7 - 9 - 24 | |

ఇపుడు తను భావ స్ఫుటము నుండి సప్తమభావము వరకు 6 భావ స్ఫుటములు ఆరు భావ సంధులు ఏర్పడినవి. ఇపుడు సప్తమ భావమునుండి తనుభావము వరకు గల భావములను సంధులను వేరుగ గుణించనక్కరలేదు. తను భావము లగాయతు వచ్చిన వానికి రాశి స్థానము నందు 6 రాసులను కలుపుచు పోయిన సప్తమ, అష్టమ, నవమ, దశమ ఏకాదశ ద్వాదశ భావములు వాని సంధులు ఏర్పడును. ఈ విధముగా తను భావము మొదలు ద్వాదశ భావములు ఏర్పడును. వీనియందు గ్రహస్ఫుటమును వేసినచో భావచక్రము ఏర్పడును.

| | | | |
|---|---|---|---|
| | | 0 - 22 - 31 | సంధి |
| 1. | తనుభావము | 1 - 9 - 24 | |
| | | 1 - 22 - 31 | తను సంధి |
| 2. | ధన భావ | 2 - 05 - 38 | |
| | | 2 - 18 - 45 | ధన భావ సంధి |
| 3. | సహజ | 3 - 01 - 52 | 3 - 04 - 40 రా |
| | | 3 - 14 - 59 | సహజ భావ సంధి |
| 4. | మాతృ ॥ | 3 - 28 - 06 | 3 - 22 - 20 కు |
| | | 4 - 14 - 59 | మాతృభావ సంధి |
| 5. | పుత్ర ॥ | 5 - 01 - 52 | 5 - 04 - 27 చం 5 - 18 - 12 శ<br>5 - 10 - 50 ర |
| | | 5 - 18 - 45 | పుత్రభావ సంధి |
| 6. | శత్రు ॥ | 6 - 05 - 38 | 5 - 23 - 35 గు 6 - 06-29 బు |
| | | 6 - 22 - 31 | శత్రు భావ సంధి |
| 7. | కళత్ర ॥ | 7 - 09 - 24 | 6 - 23 - 24 శు |
| | | 7 - 22 - 31 | కళత్రభావ సంధి |
| 8 | ఆయుర్భావము | 8 - 02 - 38 | |
| | | 8 - 18 - 45 | ఆయుర్భావ సంధి |
| 9. | భాగ్య ॥ | 9 - 01 - 52 | 9 - 04 - 40 కే |
| | | 9 - 14 - 59 | భాగ్య భావ సంధి |
| 10. | రాజ్య | 9 - 28 - 06 | |
| | | 10 - 14 - 59 | రాజ్యభావ సంధి |
| 11. | లాభ | 11 -01 -52 | |
| | | 11 - 18-45 | లాభ భావ సంది |
| 12. | వ్యయ | 0 - 05 - 38 | |
| | | 0 - 22 - 31 | వ్యయ భావ సంధి |

ఇపుడు భావచక్రము తయారయినది. ప్రతి భావమును పూర్వసంధితో ప్రారంభమయి పరసంధితో అంతమగును. భావము అనగా భావమధ్యమము గా గ్రహింపవలయును. భావమధ్యము నందుండు గ్రహము ఆ భావకార

కత్వములను సంపూర్ణముగా నిమ్చును. భావ సంధులకు అనగా భావాంత్య సంధి యందున్న గ్రహము సరియగు ఫలితమును ఇవ్వదు. రాశి చక్రము బట్టి భావ ఫలములను చెప్పరాదు.

ప్రస్తుత ఉదాహరణయందు మాతృభావ సంధి 4-14-59 భావమధ్యము 5 - 1 - 52 భావ అంత్యము 5 - 18 - 45 రాశి చక్రమును. భావచక్రమును పరిశీలించిన రాశిలో పంచమమునందు ఉన్న గురుడు భావచక్రమున షష్ట ములో ఉన్నాడు. ఆ విధముగా కన్యా రాశియందున్న గురుడు షష్ట భావ ఫలములను ప్రసాదించును. మిగిలిన గ్రహములనుకూడ గణించవలయును.

## మహాదశా శేషము

ఫలనిర్దేశన విషయమును చూచినచో ప్రస్తుతము వింశోత్తరీ దశాపద్ధతి అమలునందున్నది. పరాశరాది మతానుసారముగా వింశోత్తరీ విధానము నందు ఫలితములు అనుభవమునకు సరిపడి పడుచున్నవి.

జననకాల నిరయన చంద్రుని నుండి మహాదశా శేషమును కనుగొనవ లయును. స్ఫుట చంద్రుని గ్రహించి పట్టికల ఆధారముగా మహాదశా శేష మును కనుగొనవచ్చును. లేదా జననకాల చంద్రస్థిత నక్షత్రము ననుసరించి (ఘడియలలో కాని డిగ్రీలను కాని) జననకాల మహాదశా శేషమును నిర్ణ యించవచ్చును.

జననకాల సమయమున చంద్రుని నిరయన భాగలు రా $5^{s}-4^{\circ}-27'$ అనగా అయిదు రాసులు గడచి ఆరవ రాశియందు నాలుగు భాగల ఇరువది ఏడు నిమిషములు గడచినది. అనగా సింహరాశి దాటి ఒక పాదము గడచి రెండవ పాదమునందున్నది సింహరాశి మొదటి పాదముతో సమాప్తమగును అనగా కన్యారాశియందు కూడ ఒక పాదము ముగిసి రెండవ పాదము నందు జనన సమయమున చంద్రుడున్నాడు. అనగా ఉత్తర మూడవ పాదమున చంద్రుడున్నాడని తెలియుచున్నది.

మహాదశలు ఈ క్రింది నియమము ననుసరించి యుండును.

| | నక్షత్రములు | | మహాదశానాధుడు | సం॥ పరిమితి |
|---|---|---|---|---|
| కృత్తిక | ఉత్తరఫల్గుని | ఉషాడ | రవి | 6 సం॥లు |
| రోహి | హస్త | శ్రవ | చంద్ర | 10 ,, |
| మృగ | చిత్త | ధని | కుజ | 7 ,, |
| ఆరు | స్వాతి | శత | రాహు | 18 ,, |
| పున | విశా | పూభాద్ర | గురు | 16 ,, |
| పుష్య | అనూ | ఉభాద్ర | శని | 19 ,, |
| ఆశ్రే | జ్యేష్ఠ | రేవ | బుధ | 17 ,, |
| మఘ | మూల | అశ్వ | కేతు | 7 ,, |
| పూ ఫలు | పూషాడ | భర | శుక్ర | 20 ,, |

ప్రస్తుత జాతకమున ఉత్తర ఫల్గుని నక్షత్రము కావున రవి మహాదశ జరుగుచున్నట్లు తెలియవలయును.

మహాదశా శేషము $=$ $\dfrac{\text{నక్షత్ర శేషము} \times \text{మహాదశా సంవత్సరము}}{\text{నక్షత్ర ప్రమాణము}}$

ఉత్తరా నక్షత్ర ప్రారంభము 4–26–40 (ధ్రువము) ప్రస్తుత జనన కాలమున చంద్రుడు $5^s - 5^0 - 27'$ యందున్నాడు. అనగా ఉత్తరానక్షత్ర భుక్తి కావలసివచో

జనన కాల చంద్రుడు — జననకాల నక్షత్ర ప్రారంభము

$5^c - 4^{\circ} - 27$

$4 - 26 - 40$

$7 - 47$ ఇది ఉత్తరా నక్షత్ర భుక్తి

నక్షత్ర ప్రమాణము $13^0 - 20'$ లు లేక 800 నిముషములు నక్షత్ర శేషము = నక్షత్ర ప్రమాణము – నక్షత్ర భుక్తి

$13 — 20$

$— 7 — 47$

$5^0 — 33'$ నక్షత్ర శేషము

ఉత్తరా నక్షత్రమునకు రవి మహాదశ వచ్చును రవి మహాదశకాలము 6 సం॥లు. ప్రస్తుత ఉత్తరా నక్షత్ర శేషము 5°-33' అయినది. కావున

13° - 20' (800') లకు 6 సూర్యదశా సంవత్సరములైన
5° - 33' (333) లకు ?

$\frac{333 \times 6}{800}$ $\frac{198}{80}$ = సం. - నె - రో
2 - 5 - 29 అయినది

ప్రస్తుత జననకాల చంద్రునకు రవి మహాదశా శేషము 2 సం -5 నె.-29 రో అయినది. పట్టికలనుబట్టి కూడా ఈ వివరములు సాధించవచ్చును. చంద్రుడు కన్యలో 5-04-27 ఉన్నాడు. కావున కిన్యారాశి అని వ్రాసియున్న గడి క్రిందుగా 4° - 21 లకు 2 - 6 - 18
7 ని॥లకు 0 - 19

జననకాల రవి మహాదశా శేషము 2 సం -5 నె. 29 రోజులు

ఈ విధముగా కూడా పట్టికల ఆధారముగా సూక్ష్మముగా మహాదశను నిర్ణయింపవచ్చును.

జనన కాలమునకు జనన కాలము నందు వచ్చిన మహాదశా శేషము తదుపరి దశాక్రమము ననుసరించి ఆయా దశలు ఆధిపత్యము వహించును.

| | |
|---|---|
| ప్రస్తుత ఉదాహరణమున జనన కాలము | 1981 - 9 - 27 |
| జననకాల రవి మహాదశా శేషము | 2 - 5 - 29 |
| | 1984 - 3 - 26 |

అనగా 2 సం॥ 5 మా॥ 29 రోజులు వరకు రవి మహాదశావ శేషము ఉండును తదుపరి చంద్ర మహాదశ 10 సంవత్సరము లుండును. అటు తదుపరి కుజ మహాదశ 7 సం॥లు అటు తదుపరి రాహు మహాదశ 18 సం॥లు ఈ విధముగా ఆ జాతకుని లగ్నము ననుసరించి శుభ పాప ఫలితములు అనుభవింప జేయును.

# * లగ్నమును సరిచూచుకొను విధానం *

1) రవికి వెనుక రాశిలో చంద్రుడున్న కృష్ణపక్ష మగును.

2) రవికి ముందు రాశిలో చంద్రుడున్న శుక్ల పక్షము

3) రవి లగ్నమందు యున్న సుమారు సూర్యోదయ కాలము

4) రవి నుండి 7వ రాశి లోపల లగ్నమున్న పగటి జననం

5) రవి నుండి 4వ రాశిలో లగ్నమున్న మిట్ట మధ్యాహ్నం జననం

6) రవి నుండి 7వ రాశిలో లగ్నమున్న అస్తమయి జననం.

7) రవి నుండి 10వ రాశిలో లగ్నమున్న అర్ధరాత్రి జననం

8) పగటి జననమయిన రవియున్న గత నక్షత్రము నుండి **2, 7, 12** వ నక్షత్రములలో లగ్న ముండును.

9) రాత్రి జననమయిన రవి గత నక్షత్రము నుండి **17, 22** నక్షత్రములలో లగ్నముండును, లేదా చంద్రుని నుండి **1, 3, 5, 7, 9, 11** రాసులలో లగ్నముండును.



# లగ్నాంత కాలములు 78 - 30E

| | తేది | మీన | మేషం | వృష | మిథు | కర్కా | సింహం | కన్యా | తులా | వృశ్చి | ధను | మకర | కుంభం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 18 | 7-47 | 9-32 | 11-32 | 1-44 | 3-56 | 6-02 | 8-07 | 10-18 | 12-31 | -38 | 4-29 | 6-07 |
| | 19 | 7-43 | 9-28 | 11-28 | 1-40 | 3-52 | 5-58 | 8-04 | 10-14 | 12-27 | 2-34 | 4-25 | 6-02 |
| | 20 | 7-38 | 9-23 | 11-23 | 1-35 | 3-47 | 5-53 | 7-59 | 10-09 | 12-22 | 2-29 | 4-20 | 5-58 |
| | 21 | 7-34 | 9-19 | 11-19 | 1-31 | 3-43 | 5-49 | 7-55 | 10-05 | 12-18 | 2-25 | 4-16 | 5-54 |
| | 22 | 7-30 | 9-15 | 11-15 | 1-27 | 3-38 | 5-45 | 7-51 | 10-01 | 12-14 | 2-21 | 4-12 | 5-50 |
| | 23 | 7-26 | 9-11 | 11-11 | 1-23 | 3-36 | 5-41 | 7-47 | 9-57 | 12-10 | 2-17 | 4-08 | 5-46 |
| మార్చి | 24 | 7-22 | 9-07 | 11-07 | 1-19 | 3-31 | 5-37 | 7-43 | 9-53 | 12-06 | 2-13 | 4-04 | 5-42 |
| | 25 | 7-18 | 9-03 | 11-03 | 1-15 | 3-27 | 5-33 | 7-39 | 9-49 | 12-02 | 2-09 | 4-00 | 5-38 |
| | 26 | 7-14 | 8-59 | 10-59 | 1-11 | 3-23 | 5-29 | 7-35 | 9-45 | 11-58 | 2-05 | 3-56 | 5-34 |
| | 27 | 7-10 | 8-55 | 10-55 | 1-07 | 3-19 | 5-25 | 7-31 | 9-41 | 11-54 | 2-01 | 3-52 | 5-30 |
| | 28 | 7-06 | 8-51 | 10-51 | 1-03 | 3-15 | 5-21 | 7-27 | 9-37 | 11-50 | 1-57 | 3-48 | 5-26 |
| | 29 | 7-02 | 8-47 | 10-47 | 12-59 | 3-11 | 5-17 | 7-23 | 9-33 | 11-46 | 1-53 | 3-44 | 5-22 |
| | 30 | 6-58 | 8-43 | 10-43 | 12-55 | 3-08 | 5-12 | 7-18 | 9-28 | 11-41 | 1-48 | 3-40 | 5-18 |
| | 31 | 6-54 | 8-38 | 10-38 | 12-51 | 3-03 | 5-09 | 7-15 | 9-25 | 11-38 | 1-45 | 3-37 | 5-14 |
| | 1 | 6-50 | 8-35 | 10-35 | 12-47 | 2-58 | 5-05 | 7-11 | 9-21 | 11-34 | 1-41 | 3-33 | 5-10 |
| | 2 | 6-46 | 8-31 | 10-31 | 12-43 | 2-55 | 5-01 | 7-07 | 9-17 | 11-30 | 1-37 | 3-29 | 5-05 |
| | 3 | 6-41 | 8-26 | 10-26 | 12-38 | 2-50 | 4-56 | 7-02 | 9-12 | 11-25 | 1-32 | 3-24 | 5-01 |
| | 4 | 6-37 | 8-22 | 10-22 | 12-34 | 2-46 | 4-52 | 6-58 | 9-08 | 11-21 | 1-28 | 3-20 | 4-58 |
| | 5 | 6-34 | 8-19 | 10-19 | 12-31 | 2-43 | 4-49 | 6-55 | 9-05 | 11-18 | 1-25 | 3-17 | 4-54 |
| | 6 | 6-30 | 8-15 | 10-15 | 12-27 | 2-39 | 4-45 | 6-51 | 9-01 | 11-14 | 1-21 | 3-13 | 4-51 |
| ఏప్రిల్ | 7 | 6-27 | 8-12 | 10-12 | 12-24 | 2-36 | 4-42 | 6-48 | 8-58 | 11-11 | 1-18 | 3-10 | 4-47 |
| | 8 | 6-23 | 8-08 | 10-08 | 12-20 | 2-32 | 4-38 | 6-44 | 8-54 | 11-07 | 1-14 | 3-06 | 4-43 |
| | 9 | 6-19 | 8-04 | 10-04 | 12-16 | 2-28 | 4-34 | 6-40 | 8-50 | 11-03 | 1-10 | 3-02 | 4-39 |
| | 10 | 6-15 | 8-00 | 10-00 | 12-12 | 2-24 | 4-30 | 6-36 | 8-46 | 10-59 | 1-06 | 2-58 | 4-35 |
| | 11 | 6-11 | 7-56 | 9-56 | 12-08 | 2-20 | 4-26 | 6-32 | 8-42 | 10-55 | 1-02 | 2-54 | 4-31 |
| | 12 | 6-07 | 7-52 | 9-52 | 12-04 | 2-16 | 4-22 | 6-28 | 8-38 | 10-51 | 12-58 | 2-50 | 4-27 |
| | 13 | 6-03 | 7-48 | 9-48 | 12-00 | 2-12 | 4-18 | 6-24 | 8-34 | 10-47 | 12-54 | 2-46 | 4-24 |
| | | మేషం | వృష | మిథు | కర్కా | సింహ | కన్యా | తులా | వృశ్చి | ధను | మకర | కుంభ | మీనం |
| | 14 | 7-44 | 9-44 | 11-56 | 2-08 | 4-14 | 6-20 | 8-30 | 10-43 | 12-50 | 2-42 | 4-20 | 5-55 |
| | 15 | 7-40 | 9-40 | 11-52 | 2-04 | 4-10 | 6-18 | 8-26 | 10-39 | 12-46 | 2-38 | 4-16 | 5-51 |
| | 16 | 7-36 | 9-36 | 11-48 | 2-00 | 4-06 | 6-12 | 8-22 | 10-35 | 12-42 | 2-34 | 4-12 | 5-48 |
| | 17 | 7-33 | 9-33 | 11-45 | 1-57 | 4-2 | 6-7 | 8-17 | 10-31 | 12-38 | 2-29 | 4-07 | 5-43 |
| | 18 | 7-28 | 9-28 | 11-40 | 1-52 | 3-57 | 6-2 | 8-12 | 10-26 | 12-33 | 2-25 | 4-03 | 5-39 |
| | 19 | 7-24 | 9-24 | 11-36 | 1-48 | 3-53 | 5-58 | 8-08 | 10-22 | 12-29 | 2-22 | 4-00 | 5-36 |
| | 20 | 7-21 | 9-21 | 11-33 | 1-45 | 3-50 | 5-55 | 8-05 | 10-19 | 12-26 | 2-17 | 3-55 | 5-31 |
| | 21 | 7-16 | 9-16 | 11-28 | 1-40 | 3-45 | 5-50 | 8-00 | 10-14 | 12-21 | 2-13 | 3-51 | 5-27 |
| | 22 | 7-12 | 9-12 | 11-24 | 1-36 | 3-41 | 5-46 | 7-56 | 10-04 | 12-17 | 2-09 | 3-47 | 5-23 |
| ఏప్రిల్ | 23 | 7-08 | 9-08 | 11-20 | 1-32 | 3-37 | 5-42 | 7-52 | 10-06 | 12-13 | 2-06 | 3-43 | 5-19 |
| | 24 | 7-04 | 9-04 | 11-16 | 1-28 | 3-33 | 5-38 | 7-48 | 10-02 | 12-09 | 2-01 | 3-39 | 5-16 |
| | 25 | 7-00 | 9-00 | 11-12 | 1-24 | 3-29 | 5-34 | 7-44 | 9-58 | 12-05 | 1-57 | 3-35 | 5-11 |
| | 26 | 6-56 | 8-56 | 11-8 | 1-20 | 3-25 | 5-30 | 7-40 | 9-54 | 12-01 | 1-54 | 3-32 | 5-08 |
| | 27 | 6-53 | 8-53 | 11-5 | 1-17 | 3-22 | 5-27 | 7-37 | 9-51 | 11-58 | 1-49 | 3-27 | 5-03 |
| | 28 | 6-48 | 8-48 | 11-0 | 1-12 | 3-17 | 5-22 | 7-32 | 9-46 | 11-53 | 1-46 | 3-24 | 5-00 |
| | 29 | 6-45 | 8-45 | 10-57 | 1-9 | 3-14 | 5-19 | 7-29 | 9-43 | 11-50 | 1-42 | 3-20 | 4-56 |
| | 30 | 6-41 | 8-41 | 10-53 | 1-5 | 3-10 | 5-15 | 7-25 | 9-39 | 11-46 | 1-37 | 3-15 | 4-51 |
| | 1 | 6-36 | 8-36 | 10-48 | 1-00 | 3-5 | 5-10 | 7-20 | 9-34 | 11-41 | 1-33 | 3-11 | 4-47 |
| | 2 | 6-32 | 8-32 | 10-44 | 12-56 | 3-1 | 5-6 | 7-16 | 9-30 | 11-37 | 1-29 | 3-07 | 4-43 |
| | 3 | 6-28 | 8-28 | 10-40 | 12-52 | 2-57 | 5-2 | 7-12 | 9-26 | 11-33 | 1-25 | 3-03 | 4-39 |
| | 4 | 6-24 | 8-24 | 10-36 | 12-48 | 2-53 | 4-58 | 7-08 | 9-22 | 11-29 | 1-21 | 2-59 | 4-35 |
| | 5 | 6-20 | 8-20 | 10-32 | 12-44 | 2-49 | 4-54 | 7-04 | 9-18 | 11-25 | 1-17 | 2-55 | 4-31 |
| | 6 | 6-16 | 8-16 | 10-28 | 12-40 | 2-45 | 4-50 | 7-00 | 9-14 | 11-21 | 1-14 | 2-52 | 4-28 |
| | 7 | 6-13 | 8-13 | 10-25 | 12-37 | 2-42 | 4-47 | 6-57 | 9-11 | 11-18 | 1-09 | 2-47 | 4-23 |
| | 8 | 6-8 | 8-8 | 10-20 | 12-32 | 2-37 | 4-42 | 6-52 | 9-06 | 11-13 | 1-06 | 2-44 | 4-20 |
| మే | 9 | 6-5 | 8-5 | 10-17 | 12-29 | 2-34 | 4-39 | 6-49 | 9-03 | 11-10 | 1-03 | 2-41 | 4-17 |
| | 10 | 6-2 | 8-2 | 10-14 | 12-26 | 2-31 | 4-36 | 6-46 | 9-00 | 11-07 | 12-58 | 2-36 | 4-12 |
| | 11 | 5-57 | 7-57 | 10-9 | 12-21 | 2-28 | 4-31 | 6-41 | 8-55 | 11-02 | 12-55 | 2-33 | 4-09 |
| | 12 | 5-54 | 7-54 | 10-6 | 12-18 | 2-23 | 4-28 | 6-38 | 8-52 | 10-59 | 12-51 | 2-29 | 4-07 |
| | 13 | 5-50 | 7-50 | 10-2 | 12-14 | 2-19 | 4-24 | 6-34 | 8-48 | 10-55 | 12-47 | 2-25 | 4-01 |
| | 14 | 5-46 | 7-46 | 9-58 | 12-10 | 2-15 | 4-20 | 6-30 | 8-44 | 10-41 | 12-43 | 2-21 | 3-55 |
| | | వృష | మిథు | కర్కా | సింహం | కన్యా | తులా | వృశ్చి | ధను | మక | కుంభ | మీన | మేష |
| | 15 | 7-42 | 9-54 | 12-6 | 2-12 | 4-17 | 6-27 | 8-40 | 10-48 | 12-30 | 2-17 | 3-52 | 5-38 |

# లగ్నాంత కాలములు 78 - 30E

| తేది. | వృష | మిథు | కర్కా | సింహం | కన్యా | తులా | వృశ్చి | ధను. | మకర | కుంభం | మీనం | మేషం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 16 | 7-38 | 9-50 | 12-02 | 2-08 | 4-14 | 6-23 | 8-37 | 10-43 | 12-35 | 2-13 | 3-50 | 6-34 |
| 17 | 7-34 | 9-46 | 11-58 | 2-04 | 4-10 | 6-19 | 8-33 | 10-39 | 12-31 | 2-19 | 3-45 | 5-30 |
| 18 | 7-30 | 9-42 | 11-54 | 2-00 | 4-06 | 6-15 | 8-29 | 10-35 | 12-27 | 2-05 | 3-31 | 5-25 |
| 19 | 7-25 | 9-37 | 11-49 | 1-55 | 4-01 | 6-10 | 8-24 | 10-30 | 12-22 | 2-00 | 3-36 | 5-21 |
| 20 | 7-21 | 9-33 | 11-45 | 1-51 | 3-57 | 6-06 | 8-20 | 10-26 | 12-18 | 1-57 | 3-33 | 5-17 |
| 21 | 7-17 | 9-29 | 11-41 | 1-47 | 3-53 | 6-02 | 8-16 | 10-23 | 12-14 | 1-53 | 3-28 | 5-13 |
| 22 | 7-13 | 9-26 | 11-37 | 1-43 | 3-49 | 5-58 | 8-12 | 10-18 | 12-10 | 1-49 | 3-26 | 5-10 |
| 23 | 7-10 | 9-22 | 11-34 | 1-40 | 3-46 | 5-55 | 8-09 | 10-16 | 12-07 | 1-40 | 3-22 | 5-05 |
| 24 | 7-05 | 9-17 | 11-29 | 1-35 | 3-41 | 5-50 | 8-04 | 10-11 | 12-02 | 1-41 | 3-16 | 5-01 |
| 25 | 7-01 | 9-13 | 11-25 | 1-31 | 3-37 | 5-46 | 8-00 | 10-07 | 11-58 | 1-37 | 3-12 | 4-57 |
| 26 | 6-57 | 9-09 | 11-21 | 1-27 | 3-33 | 5-42 | 7-56 | 10-03 | 11-54 | 1-33 | 3-06 | 4-52 |
| 27 | 6-52 | 9-04 | 11-16 | 1-22 | 3-28 | 5-37 | 7-51 | 9-58 | 11-49 | 1-28 | 3-03 | [illegible] |
| 28 | 6-49 | 9-01 | 11-13 | 1-19 | 3-25 | 5-34 | 7-48 | 9-55 | 11-46 | 1-25 | 3-01 | [illegible] |
| 29 | 6-45 | 8-57 | 11-09 | 1-15 | 3-21 | 5-30 | 7-44 | 9-51 | 11-42 | 1-21 | 2-57 | 4-11 |
| 30 | 6-41 | 8-53 | 11-05 | 1-11 | 3-17 | 5-26 | 7-40 | 9-47 | 11-38 | 1-17 | [illegible] | 4-37 |
| 31 | 6-37 | 8-49 | 11-01 | 1-07 | 3-13 | 5-22 | 7-36 | 9-43 | 11-34 | 1-13 | 2-49 | [illegible] |
| 1 | 6-33 | 8-45 | 10-57 | 1-03 | 3-09 | 5-18 | 7-32 | 9-39 | 11-30 | 1-09 | 2-45 | 4-29 |
| 2 | 6-29 | 8-41 | 10-53 | 12-59 | 3-05 | 5-14 | 7-28 | 9-35 | 11-26 | 1-05 | 2-41 | 4-26 |
| 3 | 6-26 | 8-38 | 10-50 | 12-56 | 3-02 | 5-11 | 7-25 | 9-32 | 11-23 | 1-02 | [illegible] | 4-22 |
| 4 | 6-22 | 8-34 | 10-46 | 12-52 | 2-58 | 5-07 | 7-21 | 9-28 | 11-19 | 12-58 | 2-34 | 4-19 |
| 5 | 6-18 | 8-30 | 10-42 | 12-48 | 2-54 | 5-03 | 7-17 | 9-24 | 11-15 | 12-54 | 2-30 | 4-14 |
| 6 | 6-14 | 8-26 | 10-38 | 12-44 | 2-50 | 4-59 | 7-13 | 9-20 | 11-11 | 12-50 | 2-26 | 4-10 |
| 7 | 6-10 | 8-22 | 10-34 | 12-40 | 2-46 | 4-55 | 7-09 | 9-16 | 11-07 | 12-46 | 2-22 | 4-07 |
| 8 | 6-07 | 8-19 | 10-31 | 12-37 | 2-43 | 4-52 | 7-06 | 9-13 | 11-04 | 12-43 | 2-19 | 4-03 |
| 9 | 6-03 | 8-15 | 10-27 | 12-33 | 2-39 | 4-48 | 7-02 | 9-09 | 11-00 | 12-39 | 2-15 | [illegible] |
| 10 | 5-59 | 8-11 | 10-23 | 12-29 | 2-35 | 4-44 | 6-58 | 9-05 | 10-56 | 12-35 | 2-11 | [illegible] |
| 11 | 5-55 | 8-07 | 10-19 | 12-25 | 2-31 | 4-40 | 6-54 | 9-01 | 10-52 | 12-31 | 2-07 | 3-51 |
| 12 | 5-51 | 8-03 | 10-15 | 12-21 | 2-27 | 4-36 | 6-50 | 8-57 | 10-48 | 12-27 | [illegible] | 3-47 |
| 13 | 5-47 | 7-59 | 10-11 | 12-17 | 2-24 | 4-32 | 6-46 | 8-53 | 10-44 | 12-23 | [illegible] | 3-45 |
| 14 | 5-45 | 7-57 | 10-09 | 12-15 | 2-21 | 4-30 | 6-44 | 8-51 | 10-42 | 12-20 | [illegible] | 3-41 |

| తేది | మిథు | కర్కా | సింహ | కన్యా | తులా | వృశ్చి | ధను | మక | కుంభ | మీనం | మేషం | వృష |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 15 | 7-53 | 10-5 | 12-12 | 2-17 | 4-27 | 6-40 | 8-47 | 10-39 | 12-17 | 1-53 | 3-38 | [illegible] |
| 16 | 7-49 | 10-1 | 12-08 | 2-13 | 4-23 | 6-36 | 8-43 | 10-35 | 12-13 | 1-49 | 3-34 | 5-33 |
| 17 | 7-45 | 9-57 | 12-04 | 2-09 | 4-19 | 6-32 | 8-39 | 10-31 | 12-09 | 1-45 | 3-30 | 5-28 |
| 18 | 7-40 | 9-52 | 11-59 | 2-04 | 4-14 | 6-27 | 8-34 | 10-26 | 12-04 | 1-40 | 3-25 | 5-24 |
| 19 | 7-36 | 9-48 | 11-55 | 2-00 | 4-10 | 6-23 | 8-30 | 10-22 | 12-00 | 1-36 | 3-21 | 5-21 |
| 20 | 7-33 | 9-45 | 11-52 | 1-57 | 4-07 | 6-20 | 8-27 | 10-19 | 11-57 | 1-33 | 3-18 | 5-17 |
| 21 | 7-29 | 9-41 | 11-48 | 1-53 | 4-03 | 6-16 | 8-23 | 10-15 | 11-53 | 1-29 | 3-14 | 5-13 |
| 22 | 7-25 | 9-37 | 11-44 | 1-49 | 3-59 | 6-12 | 8-19 | 10-11 | 11-49 | 1-25 | 3-10 | 5-09 |
| 23 | 7-21 | 9-33 | 11-40 | 1-45 | 3-55 | 6-08 | 8-15 | 10-07 | 11-45 | 1-21 | 3-06 | 5-06 |
| 24 | 7-18 | 9-30 | 11-37 | 1-42 | 3-52 | 6-05 | 8-12 | 10-04 | 11-42 | 1-18 | 3-03 | 5-04 |
| 25 | 7-13 | 9-25 | 11-32 | 1-37 | 3-47 | 6-00 | 8-07 | 9-59 | 11-37 | 1-13 | 2-58 | 4-57 |
| 26 | 7-09 | 9-21 | 11-28 | 1-33 | 3-43 | 5-56 | 8-03 | 9-55 | 11-33 | 1-09 | 2-54 | 4-53 |
| 27 | 7-05 | 9-17 | 11-24 | 1-29 | 3-39 | 5-52 | 7-59 | 9-51 | 11-29 | 1-05 | 2-50 | 4-49 |
| 28 | 7-01 | 9-13 | 11-20 | 1-25 | 3-35 | 5-48 | 7-55 | 9-47 | 11-25 | 1-01 | 2-46 | 4-48 |
| 29 | 6-58 | 9-10 | 11-17 | 1-22 | 3-32 | 5-45 | 7-52 | 9-44 | 11-22 | 12-58 | 2-42 | 4-11 |
| 30 | 6-53 | 9-05 | 11-12 | 1-17 | 3-27 | 5-40 | 7-47 | 9-39 | 11-17 | 12-53 | 2-37 | 4-37 |
| 1 | 6-49 | 9-01 | 11-08 | 1-13 | 3-23 | 5-36 | 7-43 | 9-36 | 11-13 | 12-49 | 2-33 | 4-34 |
| 2 | 6-46 | 8-58 | 11-05 | 1-10 | 3-20 | 5-33 | 7-40 | 9-32 | 11-10 | 12-40 | 2-30 | 4-30 |
| 3 | 6-42 | 8-54 | 11-01 | 1-06 | 3-16 | 5-29 | 7-36 | 9-28 | 11-06 | 12-42 | 2-26 | 4-26 |
| 4 | 6-38 | 8-50 | 10-57 | 1-02 | 3-12 | 5-25 | 7-32 | 8-24 | 11-02 | 12-38 | 2-22 | 4-22 |
| 5 | 6-34 | 8-46 | 10-53 | 12-58 | 3-08 | 5-21 | 7-28 | 9-20 | 10-58 | 12-34 | 2-18 | 4-19 |
| 6 | 6-31 | 8-43 | 10-50 | 12-55 | 3-05 | 5-18 | 7-25 | 9-17 | 10-55 | 12-31 | 2-15 | 4-14 |
| 7 | 6-26 | 8-38 | 10-45 | 12-50 | 3-00 | 5-13 | 7-20 | 9-12 | 10-50 | 12-28 | 2-10 | 4-10 |
| 8 | 6-22 | 8-34 | 10-41 | 12-46 | 2-26 | 5-09 | 7-16 | 9-08 | 10-46 | 12-22 | 2-06 | 4-07 |
| 9 | 6-19 | 8-31 | 10-38 | 12-43 | 2-23 | 5-06 | 7-13 | 9-05 | 10-43 | 12-19 | 2-03 | 4-03 |
| 10 | 6-15 | 8-27 | 10-34 | 12-39 | 2-19 | 5-02 | 7-09 | 9-01 | 10-39 | 12-16 | 1-59 | 3-59 |
| 11 | 6-11 | 8-23 | 10-30 | 12-35 | 2-15 | 4-58 | 7-05 | 8-57 | 10-35 | 12-11 | 1-55 | 3-55 |
| 12 | 6-07 | 8-19 | 10-26 | 12-31 | 2-11 | 4-54 | 7-01 | 8-53 | 10-31 | 12-07 | 1-51 | 3-51 |
| 13 | 6-03 | 6-15 | 10-22 | 12-27 | 2-07 | 4-50 | 6-57 | 8-40 | 10-27 | 12-03 | 1-47 | 3-47 |

థము, మార్గము చెడుట, సుగంధములు. సంగీతము, పూవులు, షడ్రసోపేతమయిన, అన్నపానాదులు, తాంబూలము, ప్రయాణముల యందు ఆటంకములు పెరుగు, మరచిపోవుట, వస్త్రములు పొందుట, రేతస్సు, భర్త, పవిత్రత జీవిత భాగస్వామి, గుహ్యము, మూత్రము, గుదాస్థానము, వ్యాపారము; పాలు తి ్య్ని వస్తువులు తినుట, పప్పు నేయి మొదలగు వానితో కూడిన భోజనము, దానగుణము, శౌర్యము, శత్రు విజయము, ఇతర స్థానములందలి ధనము పొందుట తగవులు, రతి, నేయి మొదలగు పదార్థములు తినుట, విదేశ ప్రయాణములు భార్య, మన్మధ (రతి) సంబంధమగు రహస్యమయిన పనులు, దొంగతనము

## అష్టమ భావము

ఆయుస్సు, సౌఖ్యము, అపవాదులు వచ్చుట, వారసులు చనిపోవుట వలన (వారసత్వ) వచ్చు ధనము, విచారములు, మరణ సంబంధమగు బాధ, విషాదముతో కలిపిన అన్నము, గొడవలు, మేహరోగము బాధలు, సోదరుని యొక్క శత్రువులు, భార్యకు పీడ, శత్రువుల రహస్య ప్రదేశము. కష్టములు, మాంద్యము, అధికారి (రాజు) వలన భయము, ఆదాయము నిలువ లేకపోవుట వలన అప్పు చేయుట, ఆకస్మికమైన గుప్త బంధువులవలన ధనము, చిరకాలముగ నుండు ధనము, దుర్మార్గుడగు శత్రువు వచ్చి చేరుట, (అనుకూల శత్రుత్వము) పాపము, జీవులను చంపుట, అవయువ లోపము శిరస్సు నరుకబడుట, గొప్పదుఃఖము, మనస్సు స్థిమితములేని పనులు తనను ఆశ్రయించి బ్రతుకు జనము, కఠినమైన పనులు చేయుట, యుద్ధము, మనస్సునకు సంబంధించిన గొప్ప బాధ.

## నవమ భావము

దానము, ధర్మము, పుణ్య తీర్థముల యందు తిరుగుట తపస్సు, గురువుల భక్తి, ఔషధము, ఆచారము, మనో నిర్మలత దేవతాపూజ, విద్య నేర్చుకొనుట (యోగవిద్య) గొప్పతనము, ప్రయాణము ఐశ్వర్యము, నీతిశాస్త్రము, వీరత్వము, మంచి కథలు, యాత్రలు చేయుట అభిషేకము, పుష్టి, మంచి వారిని కలుసుకొనుట, శుభము, పితృ సంబంధమగు ధనము, పుత్రులు, పుత్రికలు, అష్టఐశ్వర్యములు, గుణములు, ఏనుగులు, గుర్రాలు పట్టాభిషేకము, ఆలయము, యోగ సంబంధమగు బ్రహ్మజ్ఞానము వేదసంబంధమగు యజ్ఞము, ధనము దాచుట

## దశమ భావము

వ్యాపారము, ప్రభుత్వము వలన గౌరవము పొందుట గుఱ్ఱముపై ప్రయాణము, కుస్తీ పట్టుట (మల్లయుద్ధము యందు నేర్పు, రాజకీయ సంబంధమైన పనులుచేయుట, సేవలుచేయుట, వ్యవసాయం, వైద్యము, కీర్తి, నిధినిక్షేపం యజ్ఞం మొ॥వి చేయుట, గొప్పవానిగా పేరుపొందుట, గురువు, యంత్రములు తల్లి గొప్పదయిన పుణ్యము, ఔషధము, గొప్పదయిన పదవిని పొందుట, దేవతా మంత్రములను జపించి దేవతలను ప్రత్యక్షము చేసికొనుట, దత్త పుత్రులు, ప్రభుత్వము, (రాచరికము) మార్గము, గౌరవము గౌరవమయిన జీవనము, రాచరికము పొందుట, కీర్తి, గురువువద్ద విద్య నేర్చుకొనుట,దయాగుణము, ముద్రాధికారము పొందుట, మనో నిగ్రహము, పరిపాలించు సామర్ధ్యము.

## ఏకాదశ భావము

అన్ని విధములయిన లాభములు, ఎక్కువ ఆశ, అనేకమయిన పనుల వలన ఆదాయము, ఇతరుల చేతిక్రింద బ్రతుకుట, పెద్ద అన్న, తండ్రి సంబంధమయిన మామగారు (మేనత్తభర్త) దేవతలను పూజించుట; చదువు బంగారము, ధనము మొదలగు వాటిని సంపాదించుట యందు ఎక్కువ నేర్పు కలుగుట, తాత ముత్తాతలకు సంబంధించిన ధనము, మోకాలు, గొప్ప వస్తువులు (అలంకారములు) మణులు, ఇష్టము, ప్రభుత్వ సంబంధమయిన ధనము నష్ట ధన సంపాదన (అప్పు ఇచ్చి గాని పోగొట్టుకున్నగాని ధనము తిరిగివచ్చుట) స్త్రీ ధనము, బంగారము మొదలగు వాటిని చేయుట (రసవిద్య) అదృష్టము, స్త్రీ ప్రేమ, గొప్పతనముతో కూడిన మంత్రిపదవి, మామగారి వలన లాభము పొందుట, భాగ్యము వచ్చుట, తలంచిన పనులు నెరవేరుట, సులభంగా ఆదాయము పొందుట, వంటచేయుట, ఆశ, తల్లి, ఆయుస్సు, చెవి మోకాలిపై పిక్కలు, బొమ్మలు వేయుటయందు నేర్పు (చిత్రలేఖనము)

## ద్వాదశ భావము

కలత నిద్ర, నిద్రాభంగము, మనస్సునకు సంబంధించిన బాధ, రెండు కాళ్ళు జంతువు (శత్రువు) వలన భయము, కారాగార ప్రాప్తి, గ్రహ పీడ

మోక్షము, అప్పుమంది బయటపడుట. ఏనుగులు, గుఱ్ఱములు తండ్రి సంబంధ మయిన ఆస్తి, శత్రువులు, స్వర్గ ప్రాప్తి, ఎడమ కన్ను, ప్రజలయందు శత్రుత్వము, అంగపై కల్యము, జారత్వము, వివాహ భాగస్వామి నష్టము పైవ్య త్యాగము, అధికారము పోవుట (రిటైర్‌మెంట్) శత్రువుల వలన బంధనప్రాప్తి ఇంటియందు మానసిక వికలత, దీనస్వభావము, అపకారము; తల్లిదండ్రులకు సోదరులకు, సుఖము లేకుండ చేయుట యందు ఆలోచన, తగవులు, కోపము, దేహమునకు సంబంధించిన బాధ, ఇతర దేశములకు వెళ్ళుట వలన మరణము జీవిత భాగస్వామి మరణము.



# గ్రహముల పాప కారకత్వములు

## పాప గ్రహ నివారణోపాయములు

### సూర్యుడు

1 ప్రమాదములు, 2 కష్టములు 3 స్థాన చలనము, 4 ఉద్యోగ భంగము 5 అపకీర్తి నిందలు 6 భయము 7 దుర్వ్యయము 8 నష్టములు 9 మంత్ర తంత్రములవలన హాని 10 వ్యవహారమున అపజయము 11 ఎముకలు విరుగుట 12 అనుకున్నపనులకు అంతరాయము 13 శిరోవ్యాధి 14 మానసిక దౌర్బల్యము 15 భార్యకు ఆపదలు 16 నేత్రవ్యాధి 17 హృదయరోగము 18 పాండు రోగములు 19 క్షయ 20 మూర్ఛ 21 అపస్మారము 22 దేశాంతర నివాసము 23 రక్తస్రావములు 24 టైఫాయిడ్ 25. కంఠ వ్యాధులు, 26 మతిమరుపు మొదలగు వ్యాధులు కలుగును.

పై వాటి నివారణకు గాను సూర్యుని పూజించుట, ఆదిత్య హృదయము పారాయణ చేయుట, కెంపు (మాణిక్యము) ధరించుట సూర్యునకు గోధుమలు బెల్లము, కంచు, గుఱ్ఱము, రక్తచందనము, పద్మములు ఆదివారము దానము చేసినచో రవి వలన కలుగు దోషము తొలగును.

మరియు కంచుచే చేయబడినను ఉంగరం ధరించుట వలనను, మంజిష్టము. గజమదము, కుంకుమ పూవు రక్తచందనములను రాగిపాత్ర యందలి

నీటిలో కలిపి ఆ రాగి పాత్ర యందలి నీటితో స్నానము చేసిన దోషనివృత్తి కలుగును. రాగి ఉంగరము ధరించిన కూడ మంచిది.

శుభ తిధిగల ఆదివారము నందు సూర్యుని ఓం-హ్రాం-హ్రీం-హ్రౌం-సః సూర్యాయ నమః అను మూల మంత్రమును జపప్రారంభము చేసి 40 రోజుల లో 6 వేలు జపము పూర్తి చేసినచో సూర్య సంబంధమైన దోషము తొలగును.

# చంద్రుడు

1 అస్థిర బుద్ధి, 2 మతిభ్రమణము, 3 విచారము, 4 ఉన్మాదము 5 మూర్ఛలు 6 నంజువ్యాధి 7 నీరు పట్టుట 8 దగ్గు 9 కడుపులో క్రిములు 10 కుష్టువ్యాధి (మచ్చలు), 11 ఆటలమ్మ, 12 అంత్రవ్యాధులు, 13 అజీర్ణము 14 మనసు వికసించక పోవుట (చిన్న పిల్ల ల చేష్టలు) 15 ఉబ్బసము, 16 కంటివ్యాధులు, 17 రక్త విరోచనములు, 18 వరిబీజము, 19 త్రాగుడు, వలన బాధలు 20 పక్షవాతము 21 గొంతుజబ్బులు 22 రక్తపోటు 23 కుక్క ఎలుక పిల్లుల వలన బాదలు, 24 నీటిగండములు 25 తుఫానులయందు చిక్కుకొనుట 26 వరదల వలన బాధ పొందుట మొదలగునవి కలుగును.

పై వాటి నివారణకుగాను చంద్రుని పూజించుట దుర్గాదేవి ఉపాసించుట బియ్యం దానము చేయుట ముత్యమున ఉంగరమున ధరించుటగాని మాలగా వేసికొనుటగాని చేయవలయును. సీసము, ఆవు, ముత్యములు తెల్లని వస్త్రము నేయితో నింపిన కలశము, ఎద్దులలో ఏదేని ఒకటి సోమవారము దానము చేసినచో చంద్రునకు సంబందించిన దోషము పోవును.

పట్టి వేళ్ళు, దిరిసెన గంధము, కుంకుమపూవు రక్తచందనము కలిపిన శంఖువునందు పోసిన నీటిచేత స్నానము చేసినచో చంద్రదోషము పరిహారము కలుగును. సీసపు ఉంగరముకాని, వెండి ఉంగరముకాని ధరించుటమంచిది

శుభ తిధి గల సోమవారము నందు ఓం - శ్రాం - శ్రీం - శ్రౌం-సః చంద్రాయనమః అను మంత్రమును 40 రోజులు జపము చేసి చివరి రోజున అనగా 41వ రోజున బియ్యం తెల్లని వస్త్రమునందు పోసి దానము చేసినచో చంద్రదోష నివారణ కలుగును.

## కుజుడు

1 ఉష్ణపైత్య సంబంధ వ్యాధులు, 2 అంటువ్యాధులు, 3 మానసిక సంబంధ వ్యాధులు, 4 రక్తపోటు, 5 వివిధమైన జ్వరములు 6 ప్లేగువ్యాధి 7 మశూచికము 8 కామెల 9 రక్తనాళములు పగులుట 10 మెదడో జ్వరము 11 టైఫాయిడ్ 12 హెర్నియా 13 గాల్‌స్టోన్స్ 14 మలేరియా 15 రాచకురుపులు 16 గర్భస్రావములు 17 ఎపెండిసైటిస్ 18 వడదెబ్బ 19 తపన 20 అధికదాహము 21 క్షయవ్యాధి 22 మూత్రము బంధింపబడుట 23 కురుపులు, 24 కత్తిదెబ్బలు 25 శిరోశూల 26 అంగశూల 27 దాయాదులపేచీలు 28 దెబ్బలాటలు 29 బాధలు 30 సాహసము చేయుటవలన ప్రమాదములు. 31 ఎలక్ట్రిక్ షాక్ 32 పీడకలలు 33 గండములు (ఏక్సిడెంట్స్) 34 కూరమైన శిక్షలు 35 దుష్టుల సహవాసము 36 కారాగృహ ప్రాప్తి 37 జూదము వలన ధన వ్యయము 38 భార్యతో పోట్లాట 39 భార్యకు బాధలు 40 దాంపత్యసుఖము లేకుండుట 41 విడాకులు 42 వివాహమునకు ఆటంకములు 43 కోర్టు వ్యవహారములు 44 ఋణ బాధలు 45 శత్రుబాధలు కలుగును,

పై వాటి నివారణకుగాను కుజుని పూజించి సుబ్రహ్మణ్యస్వామిని పూజించుట వలనగాని, ఎర్రని పగడమును ధరించుటవలన కాని కందులు. మేకలు, బెల్లము, బంగారము, ఎర్రని వస్త్రము, రాగి వీటి యందేదయిన దానము చేయుటవలన కాని కుజదోష నివారణ అగును.

వెండి పాత్రయందు చంద్రకర్ర గంధము, దేవదారు గంధం ఉసిరిక పప్పు కలిపిన నీటితో స్నానము చేసిన అంగారక దోషము నివర్తింపబడును. బంగారు ఉంగరము ధరించు ఆచారము కలదు

శుభ తిథి గల మంగళవారము నందు

ఓం – క్రాం – క్రీం – క్రౌం–సః భౌమాయనమః అను మంత్రమును 7వేలు 40 రోజులలో పూర్తిచేసి ఎర్రని రంగుబట్టలో కందులు వేసి 41వ రోజున దానముచేయుట మంచిది,

## బుధుడు

1 పైత్యప్రకోపము 2 మెదడు, తలకు, నాలుక, నోరు వీటికి సంబం

దించిన వ్యాధులు 3 ముక్కుకు సంబంధించిన వ్యాధులు 4. చేతులు ఊపిరి తిత్తులకు సంబంధించిన వ్యాధులు 5 నరముల బలహీనత 6 నపుంసకత్వం 7. థైరాయిడ్ గ్రంథిలోపము 8. ఉన్మాదాది మానసిక వ్యాధులు 9 పక్ష వాతము 10 మాటపడిపోవుట 11 నత్తి 12 చెవుడు 13 నిద్రపట్టక పోవుట, 14 హిస్టీరియా 15 గుహ్యరోగములు 16 ఉదరకోశ వ్యాధి 17 కుష్ఠు 18 అజీర్ణము 19 శూలలు, 20. వాయుసంబంధమైన రోగములు 21. పెద్దల వలన బాధలు 22 వైష్ణవవర్గముద్వారా కష్టములు 23 దుఃస్వప్నములు మొదలగునవి కలుగును.

పై వాటి నివారణకు గాను బుధగ్రహమునకు పూజ విష్ణు సహస్రనామ పారాయణ చేయవలయును. పెసలు దానము చేయవలయును.

ఆకుపచ్చ రంగు బట్ట, తగరము టంకము, పచ్చ పెసలు. మరకతము, లొట్టపిట్ట, గజదండము (అంకుశము) పచ్చనిపూవులు మొదలగువానిలో ఒకటి దానము చేసినచో బుధగ్రహమువలన కల్గుగు దోషము పరిహరింపబడును.

నదీ సంగమమునందు గల సముద్రపు నీటిని మట్టిపాత్రలో పోసి ఆ నీటిలో గజమదము కలిపి ఆ నీటిని స్నానముచేసినచో బుధదోషముతొలగును ఇత్తడి లేక కంచు ఉంగరమును ధరించుట సాంప్రదాయము.

శుభ తిథితో కూడిన బుధవారము నందు

ఓం - బ్రాం - బ్రీం - బ్రౌం - సః బుధాయనమః అను మంత్రమును 40 రోజులలో జపించి చివరి రోజున అనగా 41వ రోజున ఆకుపచ్చని వస్త్రములో పెసలు పోసి దానము చేసినచో బుధగ్రహ దోష నివారణ కలుగును.

## శుక్రుడు

1, శ్లేష్మము పెరుగుట 2 గుహ్యావయవదోషము 3. మూత్రపిండముల దోషము 4. గొంతు 5. గడ్డము 6. బుగ్గలు 7. బొడ్డు వీటికి సంబంధించిన బాధలు 8 థైమస్ గ్రంధి దోషములు 9. టాన్సిల్స్ 10. డబ్బునకు సంబంధించిన ఇబ్బంది 11. మూత్రదోషములు 12. కీళ్ళకు సంబంధించిన వాతము 13. రక్తక్షీణత 14 సుఖవ్యాధులు 15 మతిమరుపు 16 వ్యసనములవలన వ్యయము 17. వ్యభిచారము 18. వీర్యనష్టము 19 స్త్రీ నుండి సంక్రమించు రోగములు.

పై వాటి నివారణకు గాను శుక్ర గ్రహమునకు లక్ష్మిదేవి పూజ చేయవలయును వజ్రమును. ఉంగరమున ధరించుటవలన శుభ్ర వస్త్రము, తెల్లవి గుర్రము తెల్లని ఆవు, వజ్రము, వెండి, గంధము, బియ్యం బొబ్బర్లు వీటియందేదొకటి దానమిచ్చుట వలన గాని శుక్రగ్రహ దోషము నివారింపబడును.

వెండిపాత్ర యందలి నీటిలో గోరోచనము గజమదము, శతపుష్పము, శతావరిని కలిపి ఆ నీటితో స్నానము చేసినను శుక్రగ్రహ సంబంధమయిన దోషము తొలగును. వెండితో చేసిన ఉంగరము గాని, ముత్యముతో వెండి ఉంగరము దరించుట గాని సాంప్రదాయము.

శుభ తిథితో కూడిన శుక్రవారము నందు ఓం-ద్రాం-ద్రీం-ద్రౌం-సః శుక్రాయనమః అను మంత్రము 20 వేలు 40 రోజులలో జపము పూర్తి చేసి 41వ రోజున తెల్లని వస్త్రములో బొబ్బరులు పోసి దానముచేసిన శుక్రసంబంధ మయిన దోషము నివారింపబడును.

## గురుడు

1. ఆర్థికపరమైన చిక్కులు 2. కుటుంబమునకు సంబంధించిన చిక్కులు 3. బంధువులతో విరోదము 4 సమస్యలవలన మానసికంగా క్రుంగుట 5 రక్తం నరములు యందు గడ్డకట్టుట 6. కాలేయమునకు సంబందించిన రోగము 7 ఊపిరితిత్తులకు సంబందించిన రోగము 8. రక్తము చెడుట 9 మూర్ఛ 10 లివర్‌నకు సంబందించిన వ్యాధులు, పచ్చకామెర్లు, నంజు 11. చిగుళ్ళు వాచి రక్తము కారుట 12. ముక్కునుండి రక్తముకారుట 13. మూత్రమునకు సంబందించిన 14 చక్కెరవ్యాధి మున్నగునవి (మధుమేహము) 15. కురుపులు 16. చర్మ సంబందమైన వ్యాధులు 17 పితృ, బ్రహ్మహత్యాది దోషములు 18. గుల్మ రోగములు 19. దుఃఖము 20. అజీర్ణరోగము 21. వాత శ్లేష్మముల వలన బాధలు.

పై వాటి దోషనివారణకు గురుగ్రహమును పూజించుట నమకపారాయణ చేయుటవలన దోషనివారణ యగును. పుష్యరాగము ఉంగరమున దరించుట శనగలు, పుష్యరాగము పసుపు, చక్కెర, ఏనుగు, బంగారు రంగు వస్త్రము,

బంగారములలో ఏదొక దానిని దానముచేయుట వలన కూడ గురునకు సంబం చిన దోషము శాంతించగలదు.

బంగారుతో చేసిన పాత్రలో బ్రహ్మమేడి (బొడ్డ) మారేడు. మర్రి, ఉసిరిక ఫలములను వేసి ఆ నీటితో స్నానము చేసినను గురువునకు సంబంధించిన దోషము తొలగిపోవును, బంగారముతో చేసిన ఉంగరము సాంప్రదాయము.

శుభ తిధి గల గురువారము నాడు ఉదయము "ఓం-హ్రాం-హ్రీం-హ్రౌం-సః బృహస్పతయే నమః అను మంత్రము 40 రోజులలో 16 వేలు జపము పూర్తి చేసి పసుపువచ్చని బట్టలో సెనగలుపోసి దానమిచ్చినచో గురు గ్రహ దోషశాంతి కలుగును.

## శని

1. ఎముకలు, నరములు సంబంధించిన వ్యాధులు 2. వాత ప్రకోపము 3. అనేక రకముల ఆపదలు 4. తండ్రితో విరోధము 5 భార్యకు విడాకులు 6. అకస్మాత్తుగా ఆస్తినష్టము 7. ప్రమాదములు 8 అవమానములు భంగపాటు 9. ప్రజలతో విరోధము 10. దరిద్రము 11. పిశాచ బాధలు 12. ధనము వస్తువులు దొంగల పాలగుట 13. తను చేయు పనులయందు ఆటంకములు 14. సంధి రోగములు 15. దురదృష్టము 16. సోమరితనము 17. విషాద వార్తలు 18. దీర్ఘకాలిక వ్యాధులవలన బాధ 19. కష్టించి బ్రతుకుట 20 మల మూత్ర వ్యాధులు 21. కుడిచేయికి కలుగు వ్యాధులు 22. దంతములకు సంబంధించిన వ్యాధులు 23 చలి, జలుబు, 24. చెవుడు 25. డిప్తీరియా 26 గాల్‌స్టోన్ 27. వెన్నుకు నీరుపట్టుట 28. బెణుకులు 29. క్షయ 30 రక్త క్షీణత 31. కీళ్ళవాతము 32. చర్మవ్యాధులు 33 నారికురుపులు 34. కేన్సర్ 35. పక్షవాతము 36. కుంటితనము లేక అవయవలోపము 37. పాముకాటు 38. క్రూరజంతువుచే చంపబడుట 39. గృహదహనము 40. వస్త్ర విహీనత 41. పిచ్చి మొదలగు వ్యాధులు.

పై దోష నివారణకు శనిగ్రహ పూజలు ఈశ్వరపూజ తైలాభిషేకము నీలమణిని ధరించుట నువ్వులు దానముచేయుట వలన శనిగ్రహ దోషనివారణ కలుగును. నీలము, నూనె, నువ్వులు, గేదె, ఇనుము, నల్లని ఆవులందు ఏదో ఒకటి దానము చేయవలయును.

ఇనుప పాత్రయందు గల నీటిలో మినుములు, ప్రియంగు ధాన్యము నీలగంధ, నీలపుష్పములు వేసి ఆ నీటితో స్నానము చేసిన శనిగ్రహ దోషము నివారణ యగును.

శుభతిధి గల శనివారము నుండి "ఓం-ప్రాం-ప్రీం-ప్రౌం సః శనయే నమః అను మంత్రము 40 రోజులలో 19 వేలు జపముచేసి 4'వ రోజున నువులు నల్లని బట్టలో వేసి దానము చేసిన శనిగ్రహ దోష నివారణ యగును.

## రాహువు

1. భయము 2. పనులయందు ఆటంకములు 3. కోమా అపస్మారక స్థితి 4. మసూచిక 5 త్రాడు వలన హాని 6. క్షుద్రవిద్య వలన హాని 7 క్రిమిరోగము 8 భోజన అరుచి 9. కుష్టు 10. భూతప్రేత పిశాచముల వలన బాధలు 11. ఆకస్మికమగు నొప్పులు 12. ముఖమునకు నోటికి సంబంధించిన పక్షవాతము 13 హిస్టీరియా 14 కేన్సర్ 15. ఎక్కిళ్ళు 16 పట్టుబడని వ్యాధులు (నిర్ణయించలేనివి) 17. ఆత్మహత్యలు 18. ఉరిశిక్షలు 19 శిరచ్ఛేదము 20. కరంటుషాక్ 21. అణుశక్తి వలన హాని 22 రేడియేషన్ 23 ఏక్సిడెంటులు 24. పాముకాటువలన మరణము 25. విషప్రయోగము 26 ఉమ్మడి హత్యలు 27. సంకెళ్ళు 28 మానభంగములు 30 గౌరవలోపము మొదలగు బాధలు కలుగును.

పై వాటి నివారణకు గాను రాహుగ్రహమును పూజించుట, దుర్గాదేవిని పూజించుట, గోమేధికమును ధరించుటవలన రాహు గ్రహ దోషనివారణయగును గోమేధికము, గుఱ్ఱము, నీలవస్త్రము, కంబళి నూనె, మినుములు పంచలోహములు, వీటియందేదయిన దానము చేయుట వలన కూడ దోషశాంతి యగును.

గేదె కొమ్ముతో చేసిన పాత్రయందలి ఉదకమున గుగ్గిలము, ఇంగువ, హరిదళము, మనశ్శిలలతో కలిపి ఆ నీటితో స్నానముచేసినచో రాహుదోషము తొలగును, పంచలోహములతో చేసిన ఉంగరము ధరించుట సాంప్రదాయము

శుభ తిథి గల శనివారమునాడు రాహు మంత్రమగు ఓం-భ్రాం-భ్రీం భ్రౌం-సః రాహవే నమః అను మంత్రమును 40 రోజులలో 18 వేలు జపము పూర్తి చేసి 41వ రోజున మినుములు నల్లని బట్టలో వేసి దానము చేసినచో రాహు గ్రహ సంబంధమయిన దోషము తొలగిపోవును.

# కేతువు

1 పట్టరాని ఆవేశము, 2. మానసిక సంచలనము, 3, మనోవ్యథ 4 ఉన్మాదము వలన బాధలు. 5 దృష్టిమాంద్యము, 6 విషాదము, 7 నంజు 8 నీరుపట్టుట, 9 కుష్టు, 10 క్షీణత 11 అపస్మారము (కోమా) 12 వెన్నెముకు సంబంధించిన వ్యాధి, 13 పీనియల్‌గ్రంధి లోపము, 14 కురుపులు 15 మంత్రశక్తుల వలన బాధ, 16 ఆకస్మిక మృతి, 17 ఏ పనియు తోచకపోవుట, 18 అరాచకము 19 రహస్యములు నిలుపకపోవుట వలన బాధలు 20 వంధ్యాత్వము 21 హిస్టీరియా 22 క్షయ 23 పైత్యజ్వరము 24 గజ్జి, దురద 25 శత్రువుల వలన బాధలు.

పై దోష నివారణకు గాను కేతుగ్రహమును పూజించి సూర్య నమస్కారములు చేయుచు ఉలవలు దానమీయవలెను. వైడూర్యము, నూనె, శాలువ, కస్తూరి, ఉలవలు వీటిని దానము చేసినను కేతుగ్రహ దోష నివారణ కల్గును.

ఖడ్గమృగము కొమ్ముతో చేయబడిన పాత్రయందు గంగ నీటిలో పర్వతములయందు పంది కొమ్ముచే త్రవ్వబడిన మట్టి, మేకపాలు కలిపి ఆ నీటితో స్నానము చేసినచో కేతుగ్రహ దోష నివారణ కలుగును. పంచలోహముల ఉంగరము ధరించుట సాంప్రదాయము,

శుభ తిధి గల మంగళవారము నాటి నుండి "ఓం-ప్రాం-ప్రీం-ప్రౌం సః కేతవే నమః" అను మంత్రమును 40 రోజులలో 7 వేలు జపము పూర్తిచేసి 41వ రోజున ఎర్రని వస్త్రములో ఉలవలు పోసి దానమిచ్చినచో కేతుగ్రహ దోష నివారణ కలుగును.

## సూర్యాది నవగ్రహ దోషము తొలగుటకు స్నానౌషములు,

సిద్ధౌషధ సేవల వలన రోగములు మంత్రజపము వలన సకల భయము తీరునట్లుగా ఔషధస్నాన విధానము వలన గ్రహదోషములు నశించును,

1) సూర్యదోషము తొలగుటకు :- మణిశిల, ఏలకులు, దేవదారు కుంకుమ పువ్వు వట్టివేళ్ళు యష్టిమధుకము ఎర్ర పుష్పాలు, ఎర్రగన్నేరు పువ్వులు ఈ వస్తువులను నీళ్ళవేసి కాచి, ఈ నీటితో స్నానము చేయవలయును.

2) చంద్రదోషము తొలగుటకు :- గోమూత్రము ఆవుపాలు ఆవు పెరుగు, ఆవుపేడ ఆవునెయ్యి శంఖములు, మంచి గంధము స్ఫటికము ఈ వస్తువులను నీళ్ళలోవేసి కాచి, ఆ నీటితో స్నానము చేయవలయును.

3) కుజ దోషము : మారేడుపట్ట, ఎర్రచందనము, ఎర్రపువ్వులు, మంగిలీకము, మాల్కంగినీసమూలముగా పొగడ పువ్వులు ఈ వస్తువులను నీళ్ళలోవేసి కాచి ఆ నీటితో స్నానము చేయవలయును.

4) బుధ దోషము : ఆవుపేడ తక్కువ పరిమాణములో, పండ్లు, గోరోచనము తేనె, ముత్యములు బంగారము, ఈ వస్తువులను నీళ్ళలో వేసి కాచి ఆ నీటితో స్నానముచేయవలయును.

5) గురు దోషమునకు :- మాలతీ పువ్వులు, తెల్ల ఆవాలు, యష్టిమధుకం తేనె ఈ వస్తువులను నీళ్ళలో వేసి కాచి, ఆ నీటితో స్నానము చేయవలయును.

6) శుక్ర దోషము :- ఏలకలు, మణిశిల, సౌవర్చ లవణము, కుంకుమ పువ్వు ఈ వస్తువులను నీళ్ళలోవేసి కాచి, ఆనీటితో స్నానము చేయవలెను వలయును.

7) శని దోషము :- నల్ల నువ్వులు, సుర్మగాయి, సాంబ్రాణి, సోపు ఈ వస్తువులను నీళ్ళలో వేసి కాచి, ఆ నీటితో స్నానము చేయవలయును.

8) రాహు దోషము :- సాంబ్రాణి, నువ్వుచెట్టు ఆకులు, కస్తూరి, ఏనుగు దంతము (ఏనుగు దంతము లేకపోయినను తతిమ్మా వాటితో) ఈ వస్తువులను నీళ్ళలో వేసి ఆ నీటితో స్నానము చేయువలయును.

9) కేతు దోషము :- సాంబ్రాణి, నువ్వుచెట్టు ఆకులు, ఏనుగు దంతము, మేక మూత్రము మారేడుపట్ట ఈ వస్తువులను నీళ్ళవేసి కాచి ఆ నీటితో స్నానము చేయవలయును.



# రశ్మిలు - ఫలితములు

ప్రతి గ్రహమునకు రశ్మిలుండును. కొన్ని గ్రంధములు అన్ని గ్రహములకు రశ్మిలు సమానమనియు, ప్రతి గ్రహమునకు 7 రశ్మిలుగా చెప్పినవి కాని సారావళి ప్రకారము రవికి 10; చంద్రుడు 9; కుజుడు 5; బుధుడు 5: గురుడు 7; శుక్రుడు 8; శని 5 ఈ సంఖ్యలు గ్రహములు తమ తమ ఉచ్ఛలయందు వుండగా కలుగును. అన్ని గ్రహములు ఉచ్ఛ యందుండగా రశ్మిల సంఖ్య 49. సర్వ గ్రహములు నీచ యందుండగా రశ్మిలు సూన్యము

ఉచ్ఛాభిముఖ గ్రహణమునకు ఆరోహణ గ్రహణమనియు; నీఛాబిముఖ గ్రహణమునకు అవరోహణ గ్రహణమనియు చెప్పబడును. గ్రహమును నీఛలో నుండి తీసివేయగా శేషము ఆరు రాశుల కధికమయిన 12 నుండి తీసివేయుగా వచ్చిన రాశ్యాధికమును తమ తమ ఉక్త రశ్మిలచే గుణించి ఆరుచే భాగించగా రశ్మి సంఖ్య వచ్చును, శేషమును గ్రహింపనక్కర లేదు

గ్రహము మిత్ర ద్వాదశాంశల యందుండెనేని, గణితాగత రశ్మిలు ద్విగుణించవలెను, స్వవాంశయందు వున్న చో 3చే గుణించవలెను. గ్రహము ఉచ్ఛయందు గాని, స్వక్షేత్రమందు కాని యుండి వక్రము పొందిన గణితాగత రశ్మిలు 3చే గుణించవలయును. స్వ ఉచ్ఛేతర క్షేత్రముల యందుండి వక్రించిన 2చే గుణించవలయును. గ్రహము శత్రు ద్వాదశాంశమున గాని, నీఛ ద్వాదశాంశము గాని యుండిన, గణితాగత రశ్మిలు షోడశాంశ హీనములగును. శని శుక్రులు గాక యితర గ్రహము లస్తంగతముల యునచో గణితాగత రశ్మిలు శూన్యము. శని శుక్రు లస్తంగతములయిన హరణములేదు వక్రావసానము కూడ గణితాగత రశ్మిలు ద్విగుణమగును వక్రత్యాగ దినమున గణితాగత రశ్మిలు అష్టమాంశచే హీనములు.

## * రశ్మిలు - వాటి ఫలితములు *

గణితాగత సప్త గ్రహముల నొకటిగా చేర్పగా—

1 నుండి 5 అయిన ! అధిక దుఃఖము; కుల విహీనత, పరతంత్రత, దరిద్రము; నీచ రతియు కలుగును.

5 నుండి 10 అయిన : కూలి నిమిత్తము పరదేశముల యందు తిరుగువాడు భాగ్యము లేనివాడు; మలినుడును అగును.

10 నుండి 15 అయిన : సుజన వాక్యములు విను వాడును, ధర్మాభిరతుడు, సుముఖి, కులజుడు నగును

15 నుండి 20 అయిన : కులాధికారము; జనఖ్యాతి; కీర్తికరుడు, సర్వజన పూజ్యుడు అగును.

20 నుండి 25 అయిన : పూజ్యుడు, అందమైనవాడు, ధీరుడు రాజు ధనుర్విద్యా నిపుణుడు, సమస్త కార్యములు చేయువాడు అగును.

25 నుండి 30 అయిన : చండుడు, రాజ శత్రుడు, రాజాశ్రయ లబ్ధ ధన సౌఖ్యములు కలవాడు, మంత్రిపూజ్యుడు అగును.

31 అయిన : ప్రవరుడు. కీర్తి కలవాడు, రాజప్రీతుడు అగును.

32 అయిన : 500 గ్రామముల కధిపతి యగును.

33 అయిన : వేయి గ్రామముల కధిపతి యగును.

34 అయిన : మూడు వేల గ్రామముల కధిపతి యగును.

35 అయిన : మండలాధిపతియు; అధిక ధన సత్వములు కలవాడగును.

36 అయిన : లక్ష యాబది గ్రామములకు రాజగును.

37 అయిన : మూడు లక్షల గ్రామములకు రాజగును.

39 అయిన : సర్వజన హితుడగు నరేంద్రుడగును.

40 అయిన : అధిక భూపాలుడు, శత్రుహింసకుడు, కీర్తి కల. కరుణగల నరేంద్రుడగును.

41 అయిన : చతుస్సముద్ర పర్యంత భూమిని నిరుపద్రవముగ పరిపాలించు రాజగును.

42 అయిన : రెండు సముద్రముల మధ్యగల భూమిని పాలించు రాజగును

43 అయిన : మూడుసముద్రముల మధ్యగల భూమిని పాలించు రాజగును

44 అయిన : దేవబ్రాహ్మణ భక్తిగల సాత్వికుడగు రాజగును సార్వభౌముడగును.

45 అయిన : నిరుపద్రవముగ ద్వీపాంతరములను పాలించువాడును సర్వులచే నమస్కరింపబడు వాడును. ఇంద్రతుల్య పరాక్రమయుక్తుడగు రాజగును.

నలుబది అయిదు కన్న ఎక్కువ అంశలు ఉన్నచో జనపాలుడును లేక యతీంద్రియుడును, ఋషికాని కాగలడు.

49 అయిన : శతృవులు లేనట్టి సర్వజన హితుడునగు చక్రవర్తి కాగలడు.

# రశ్మిలు

## : రవి :

| రాశి-భాగ | రాశి-భాగ | రశ్మి |
|---|---|---|
| 0-10 | 0-10 | 10 |
| 0-28 | 11-22 | 9 |
| 1-16 | 11-04 | 8 |
| 2-04 | 10- 6 | 7 |
| 2-22 | 9-28 | 6 |
| 3-10 | 9-10 | 5 |
| 3-28 | 8-22 | 4 |
| 4-16 | 8-04 | 3 |
| 5-04 | 7-16 | 2 |
| 5-22 | 6-28 | 1 |
| 6-10 | 6-10 | 1 |

## బుధుడు

| | | |
|---|---|---|
| 5-15 | 5-15 | 5 |
| 6-21 | 4-09 | 4 |
| 7-27 | 3-03 | 2 |
| 9-03 | 1-27 | 3 |
| 10-09 | 0-21 | 1 |
| 11-15 | 11-15 | 0 |

## శుక్రుడు

| | | |
|---|---|---|
| 11-27-00 | 11-27-00 | 8 |
| 00-19-30 | 11-04-30 | 7 |
| 01-12-00 | 10-12-00 | 6 |
| 02-04-30 | 9-19-30 | 5 |

## : కుజుడు :

| రా-భా-క-విక | రా-భా-క-వి | రశ్మి |
|---|---|---|
| 9-28 | 9-28 | 5 |
| 11-04 | 8-22 | 4 |
| 0-10 | 7-16 | 3 |
| 1-16 | 6-10 | 2 |
| 2-22 | 5-04 | 1 |
| 3-28 | 3-28 | 0 |

## : గురుడు :

| | | |
|---|---|---|
| 3-05- 0- 0 | 3-05-00-00 | 7 |
| 4-00-42-51 | 2-09-17-08 | 6 |
| 4-26-25.43 | 1-13-34-17 | 5 |
| 5-22-08-34 | 0-17-51-26 | 4 |
| 6-17 51-26 | 11-22 08-34 | 3 |
| 7-13-34-17 | 10-26-25.43 | 2 |
| 8-09-17-08 | 10-00-42-51 | 1 |
| 9-05-00-00 | 9.05-00-00 | 0 |

## : శని :

| | | |
|---|---|---|
| 6-20 | 6-20 | 5 |
| 7-26 | 5-14 | 4 |
| 9 02 | 4-08 | 3 |
| 10-08 | 3-02 | 2 |
| 11-14 | 1-26 | 1 |
| 0-20 | 0-20 | 0 |

| రాశి-భాగ | రాశి-భాగ | రశ్మి |
|---|---|---|
| 2-27-00 | 8-27-00 | 4 |
| 3-19-30 | 8-04-30 | 3 |
| 4-12-00 | 7-12-00 | 2 |
| 5-4-30 | 6-19 30 | 1 |
| 5-27-00 | 5-27-00 | 0 |

| రా-భా-క-వి | రా-భా-క-వి | రశ్మి |
|---|---|---|
| చంద్రుడు | | |
| 1-03 | 1-03 | 9 |
| 1-23 | 0-13 | 8 |
| 2-13 | 11-23 | 7 |
| 3-03 | 11-03 | 6 |
| 3-23 | 10-13 | 5 |
| 4-13 | 9-23 | 4 |
| 5-03 | 9-03 | 3 |
| 5-23 | 8-13 | 2 |
| 6-13 | 7-23 | 1 |
| 7-03 | 7-03 | 0 |

## : తారా బలము :

జన్మ చంద్రుడున్న నక్షత్రము నుండి వివిధ గ్రహములు ఏ ఏ నక్షత్రముల యందున్నవో గ్రహించి జన్మ నక్షత్రమునకు ఆ గ్రహస్థిత నక్షత్రము ఏ తార అయినదో గ్రహించి దానివలన ఫలితములు చెప్పవలయును.

ఉదాహరణకు చంద్రుడు ఉత్తరా నక్షత్రములో ఉండిన ఆశ్రేషా నక్షత్రమున కుజుడు ఉండిన ఉత్తరకు ఆశ్రేష నైధన తార అయినది. కావున ఆ కాలమునందు జాతకునకు అనారోగ్యము చేయును. కుండలియందు స్థితి సరిగా లేకున్న మారకము కూడ చేయును. ఈ విధముగా ఫలితములు చెప్పవచ్చును ఈ విధముగనే

జన్మలగ్నము ఏ నక్షత్రము నందుండినదో గ్రహించి ఆ నక్షత్రము నుండి నవతారా విభాగమును చేసి ఫలితములను చెప్పవచ్చును. పై రెండింటి యందు జాతకమున జన్మ చంద్ర నక్షత్రముల బలాబలములు తెలిసికొని ఫలితములు చెప్పవలయును.

లగ్నస్థానము కృత్తిక అయినచో కృత్తిక నుండి గ్రహమువకగు తార లెక్కించవలయును. కుజుడు ఆశ్రేషయందున్నాడు కావున కృత్తికకు ఆశ్రేష నైధన తారయగును. పై విధముగ చూచినను కుజుడు ఉదాహరణ జాతకమునందు అనారోగ్యము చేయును. అనగా కుజ మహాదశ కుజాంతరమున జాతకునకు అనారోగ్యము చేయును అని చెప్పగలము. ఈ విధముగ మిగిలిన గ్రహములను కూడ లెక్కించి గ్రహించవలయును.

## * యోగస్థానము *

నిరయన రవిచంద్రుల మొత్తమునకు పుష్యమీ నక్షత్ర ధ్రువమును కలిపిన యోగస్థానము యొక్క స్ఫుటము వచ్చును.

ఉదా :—

| | |
|---|---|
| రవి | 5 – 10 – 50 |
| చంద్ర | 5 – 4 – 27 |
| పుష్యమి ధ్రువము | 3 – 3 – 20 |
| | 1 – 18 – 37 |

ఈ జాతకునకు యోగస్థానము వృషభమున రా 1 – భా 18 – లి 37 అనగా రోహిణీ నక్షత్రమునకు సంబంధించిన దశనాధుడు జనయోగకారకుడగు తదధిపతి అయిన శుక్రుడు కూడ సహయోగి అగుచున్నాడు.

## * ఇందు లగ్నము *

గ్రహములకు కళలు చెప్పబడినవి. ఆ కళల ఆధారముగా ఇందు లగ్నమును నిర్ణయించవలయును.

జన్మ లగ్నాధిపతి, చంద్ర లగ్నాదిపతి, నవమాదిపతుల కళలను కలిపి 12 చే భాగించగా వచ్చిన శేషము చంద్రలగ్నము లగాయితు ఇందు లగ్నమగును.

| గ్రహము | | కళలు |
|---|---|---|
| రవి | — | 30 |
| చంద్ర | — | 16 |
| బుధ | — | 8 |
| శుక్ర | — | 12 |
| కుజ | — | 6 |
| గురు | — | 10 |
| శని | — | 1 |

ఇందు లగ్నము ఏ లగ్నమయినను ఆ లగ్నము నందున్న గ్రహము

యొక్క దశయందు గాని (ఆ లగ్నాధిపతి) దశయందుగాని యోగమువట్టును. ఇందు లగ్న విచారణయందు లగ్నము ఏ ద్రేక్కాణము నందు కలదో ఆ ద్రేక్కాణాధిపతి ద్రేక్కాణాధిపతులను గ్రహించిచేసిన సరియగు ఫలితముల నిచ్చుచున్నది.

## : ధూమాది అప్రకాశ గ్రహములు :

1 జననకాల స్ఫుట సూర్యునకు 4 రా – 13 భా – 20 లిలు కలిపినచో ధూమగ్రహము వచ్చును

2) ధూమగ్రహ భాగలను 12-00-00 రాసుల నుండి తీయగ వ్యతీపాత గ్రహము వచ్చును

3) వ్యతీపాత గ్రహ భాగలకు 6 రాసులు కలిపిన పరివేషము అను గ్రహమగును.

4) పరివేష గ్రహభాగలను 12-00-00 రాసుల నుండి తీసివేయగ ఇంద్రచాపము వచ్చును.

5) ఇంద్రచాప గ్రహభాగలకు 0-16-40 కలిపిన కేతువు వచ్చును.

6) ఇంద్రచాపస్ఫుటమునకు 1 రాశికలిపిన స్ఫుటసూర్యుడగును

7) ఈ అప్రకాశ గ్రహములు అయిదును రవి-చంద్ర-లగ్నములతో ఎవరు కలసినను రవివలన వంశము-చంద్రునివలన ఆయువు లగ్నమువలన జ్ఞానము నశించును.

## : షోడశ వర్గ నిర్ణయము :

జాతకమునందు రాశి చక్ర, భావ చక్రముల యందు తెలియని అనేక విషయములు ఈ వర్గుల నుండి గ్రహింపవచ్చును ఈ విషయములు "బృహత్పరాశర హోర" యందు మాత్రము విపులముగా వ్రాయబడియున్నది. ఫల నిర్ణయము చేయుటయందు రాశిని సూక్ష్మముగ విభజించి ఆ భావము నందు ఆయా విభాగములను బట్టి ఫల నిర్ణయము చేసినచో ఫలితము నిర్దుష్టముగా నుండగలదని శాస్త్రకారులు నిర్ణయించిరి.

అథషోడశ వర్గమ వివేకంచ వదామ్యహం
లగ్నే దేహస్య విజ్ఞానం హోరాయాం సంపదాదికం
ద్రేక్కాణే భ్రాతృజం సౌఖ్యం తుర్యాంశే భాగ్యచింతనం
పుత్ర పౌత్రాది కానాంవై చింతనం సప్తమాంశకే
నవమాంశే కళత్రాణాం దశమాంశే మహత్ఫలమ్
ద్వాదశాంశే తథాపిత్రో శ్చింతనం షోడశాంశకే
సుఖా సుఖస్య విజ్ఞానం వాహనానాం తథైవచ
ఉపసనాయ విజ్ఞానం సాధ్యం వింశతి భాగకే
విద్యాయా వేద బాహ్వంశే భాంశేచైవ బలాబలం
త్రింశాం శేరిష్ట ఫలం ఖవేదాంశే శుభాశుభం
అక్ష వేదాంశకే చైవ షష్ట్యంశేఽఖిల మీక్షయేత్
యత్ర కుత్రాపి సంప్రాప్తః క్రూర షష్ఠంశ్య కాధిపే
తత్రనాశో నసందేహో గర్గాదీనాం వచోయథా
యత్ర కుత్రాః సంప్రాపః కళాంసాధి ఃతిః శుభః
తత్ర వృద్ధిశ్చ పుష్టిశ్చ గర్గాదీనాం వచోయథా
ఇతి షోడశ వర్గాణాం భేధాస్తే ప్రతిపాదితాః

1. లగ్నము వలన శరీర స్వరూపాదులు 2. హోర వలన సంపదను 3 ద్రేక్కాణము వలన సోదరాది సుఖము 4 చతుర్థాంశవలన భాగ్యచింతనం 5 సప్తమాంశ వలన పుత్రపౌత్రాదుల సుఖమును 6 నవాంశ వలన జీవిత భాగస్వామి విషయము 7. దశమాంశ వలన రాజ్యాది (వ్యాపార) ఫలమును 8. ద్వాదశాంశ వలన మాతాపితరుల విషయములు 9. షోడశాంశ వలన వాహనాదుల యొక్క సుఖదుఃఖములు 10. వింశాంశవలన ఉపాసనా విషయమను 11 చతర్వింశాంశ వలన విద్యను 12 భాంశనుండి బలాబలములు 13 త్రింశాంశ వలన అరిష్ట ఫలమును 14 ఖవేదాంశల నుండి భావ శుభాశుభములను 15. అక్షవేదాంశ 16 షష్ట్యంశములను బట్టి భావసంబంధ శుభా శుభములను గ్రహించవలయును. ఏ భావము యొక్క షష్ట్యంశాధిపతి క్రూర గ్రహమైన ఆ భావమునకు దోషము శుభ గ్రహాధిపత్యము కలిగిన శుభ ఫలితమును చెప్ప వలెను. ఏ భావమును గూర్చి విచారణ చేయువలయునో ఆ భావముతో పాటు ఆ కారకత్వమునకు సరిపడు షోడశవర్గ విభాగమును గుర్తించి ఆ వర్గునను సరించి భావవిచారణలో శుభాశుభ నిర్ణయమును చేయువలయును. సప్తమభావమును నిర్ణయించుటలో సప్తమభావమును భావాధిపతిని నవాంశ లగ్నమును చక్రమును వేసి విచారణ చేయువలయును.

1. క్షేత్రము :- క్షేత్రము ప్రమాణము 30 భాగాలు. ఏ రాశి జన్మలగ్నమగునో అదియే క్షేత్రము. ఆ రాశ్యాధిపతే క్షేత్రాధిపతి.

| | రాశి | అధిపతి | | రాశి | అదిపతి |
|---|---|---|---|---|---|
| 1. | మేషము | కుజ | 7. | తుల | శుక్ర |
| 2. | వృషభము | శుక్ర | 8. | వృశ్చికము | కుజ |
| 3. | మిధునము | బుధ | 9. | ధనుస్సు | గురు |
| 4. | కర్కాటకము | చంద్ర | 10. | మకరము | శని |
| 5. | సింహము | రవి | 11. | కుంభము | శని |
| 6 | కన్య | బుధుడు | 12. | మీనము | గురు |

2. హోర :- రాశి ప్రమాణమున రెండు భాగలు చేయగా 15 భాగలగును ప్రతి రాశియందు రెండు హోరలుండును 1 సూర్య 2 చంద్ర హోరలు.

| | 1 నుండి 15 | 16 నుండి 30 | | 1 నుండి 15 | 16 నుండి 30 |
|---|---|---|---|---|---|
| మేష | సూర్య | చంద్ర | వృష | చంద్ర | సూర్య |
| మిధు | ,, | ,, | కర్కా | ,, | ,, |
| సింహ | ,, | ,, | కన్య | ,, | ,, |
| తుల | ,, | ,, | వృశ్చి | ,, | ,, |
| ధను | ,, | ,, | మీన | ,, | ,, |

## : షోడశ వర్గు చక్రములు వేయు విధము :

క్షేత్రము :- రాశ్యధిపతియే క్షేత్రాధిపతి

2. హోర :- జాతకుని లగ్నమును గాని, గ్రహముగల రాశిగాని రెండు భాగములు చేసి అందు లగ్నముగాని, గ్రహముగాని ఏ భాగమునందు గలదో నిర్ణయింపవలయును, బేసిరాశుల యందయిన ప్రధమార్థము రవిహోర రెండవది చంద్రహోర. సమరాశులయిన మొదటిది చంద్రహోర రెండవది రవిహోర హోరా చక్రము నిర్మించునపుడు మొదటిహోర యందుగల గ్రహము అదేరాశి యందు రెండవ హోరయందు గల గ్రహమును తరువాత రాశి యందును గుర్తించవలయును, బేసి రాశుల యందును, రవిహోర యందును గల రవి కుజ, గురులు బలవంతులు సమరాశుల యందును, చంద్రహోరల యందును గల చంద్ర, శుక్ర, శని, రాహు కేతువులు బలవంతులగుదురు.

3. ద్రేక్కాణము :— ఒక రాశి యందలి మూడవ భాగమును ద్రేక్కాణ మని వ్యవహరింతురు. అందువలన ఒక్కొక్క ద్రేక్కాణము 10 భాగ లగును. 1, 5, 9 అధిపతులు క్రమముగా ఆ ద్రేక్కాణాధిపతులు అగుదురు. తన ద్రేక్కాణమునందు గల గ్రహములు బలవంతులు ఆయుర్దాయాది బలమునిచ్చి యోగము చేయుదురు ద్రేక్కాణము ననుసరించి గ్రహముయొక్క జాగ్రతాదియవస్థలు ఏర్పడును. 1. జాగ్రతావస్థయందు గల గ్రహము యత్న కార్యసిద్ధి, 2. స్వప్నావస్థయందున్న గ్రహము శుభపాప (మిశ్రమ) ఫలితము 3 సుషుప్త్యావస్థ యందున్న గ్రహము పాప ఫలములు ఇచ్చును.

| రాశి | అవస్థలు 1 to 10 | 11 to 20 | 21 to 30 |
|---|---|---|---|
| మేషము | జాగ్రత్త (ఆయు) | స్వప్న (చతు) | సుషుప్తి (ఆయు) |
| వృషభము | సుషుప్తి (అనం) | స్వప్న (చతు) | జాగ్రత్త (విహగ) |
| మిథునము | జాగ్రత్త (స్త్రీ) | ,, (ఆయు) | సుషుప్తి (ఆయు) |
| కర్కాటకము | సుషుప్తి (చతు) | ,, (స్త్రీ) | జాగ్రత్త (సర్ప) |
| సింహము | జాగ్రత్త (విహ) | ,, (ఆయు) | సుషుప్తి (ఆయు) |
| కన్య | సుషుప్తి (స్త్రీ) | ,, (ఆయు) | జాగ్రత్త (స్త్రీ) |
| తుల | జాగ్ర (పురు) | ,, (విహ) | సుషు (చతు) |
| వృశ్చి | సుషు (సర్ప) | ,, (పాశ) | జాగ్ర (చతు) |
| ధన | జాగ్ర (చతు) | ,, (స్త్రీ) | సుషు (ఆయు) |
| మక | సుషు (విహ) | ,, (స్త్రీ) | జాగ్ర (ఆయు) |
| కుంభ | జాగ్ర (విహ) | ,, (స్త్రీ) | సుషు (పురు) |
| మీన | సుషు (పురు) | ,, (స్త్రీ) | జాగ్ర (సర్ప) |

ఇందు సర్ప చతుష్పద ద్రేక్కాణ జాతకులు క్రూరులు, ధనహీనులు క్రమముగు పరివర్తన లేనివారును అగుదురు. దీని వివరము బృహజ్జాతక ద్రేక్కాణాధ్యాయమున కలదు.

4. చతుర్థాంశ :— రాశిని నాలుగుభాగలు చేయగా 7–30 భాగల ప్రమాణము చతుర్థాంశ యగును. రాశి నుండి 1, 4, 7, 10 రాశుల అధిపతులు అనగా కేంద్రాధిపతులు చతుర్థాంశాధిపతులు అగుచున్నారు. ఏ గ్రహమైన ఒకరాశియందు ప్రథమ చతుర్థాంశ యందున ఆ రాశియందు, ద్వితీయ చతుర్థాంశ యందున్న ఆరాశి నుండి నాల్గవ రాశియందు తృతీయ చతుర్థాంశ

యందున్న సప్తమమునను చతుర్థ అంశ యందున్న దశమమునందును గ్రహమున్న రాశి నుండియే గుర్తించవలయును.

5. సప్తమాంశ :- రాశిని 7 భాగములు చేయగా సప్తమాంశ యగును. లగ్నముగాను, గ్రహముగాని, విషమరాశియందున్నచో ఆ బేసిరాశి నుండియు, సరిరాశియగుచో ఆ సరిరాశికి సప్తమరాశి నుండియు సప్తమాంశము గుర్తించవలయును.

6. నవమాంశ :-

7. దశమాంశ :- రాశి ప్రమాణమును 10 భాగములుచేయుగా దశమాంశ యగును కావున 3 భాగాలు దశమాంశ ప్రమాణము లగ్నము లేక గ్రహములు బేసిరాశులయందుండిన ఆ రాశి నుండియు సరిరాశులగుచో ఆ రాశికి 9వ రాశి నుండియు గ్రహములను గుర్తించవలయును.

8. ద్వాదశాంశ :- రాశి ప్రమాణమును 12 భాగములు చేయగా ద్వాదశాంశయగును ఒక్కొక్క భాగమునకు 2-30 భాగములగును. లగ్నము లేక గ్రహములు ఏ రాశియందు ఎన్నవ భాగమును పొందినవో ఆ రాశిను డి అన్నవభాగము ద్వాదశాంశయగును.

9. షోడశాంశ :- రాశిని 16 భాగములుచేయుగా షోడశాంశ అగును. ఈ ప్రమాణము 1-52-30 అగును గ్రహముగాని, లగ్నముగాని ఏ భాగము నందున్నదో గ్రహించవలయును. చరరాశియందున్న మేషమాదిగను స్థిర రాశియందు గ్రహమున్న సింహాదిగను ద్విస్వభావమయిన ధనురాశ్యాదిగను గ్రహములను గుర్తించవలెను.

10. వింశాంశ :- రాశిని 20 భాగములు చేయగా వింశాంశయగును. గ్రహముగాని లగ్నముగాని ఏ రాశియందు ఏభాగమునందున్నచో గుర్తించవలెను. చరరాశులకు మేషాదిగను, స్థిరరాశులకు ధనురాశిగను, ద్విస్వభావ రాశులకు సింహాదిగను గ్రహములను గుర్తించవలయును

11. చతుర్వింశాంశ ;- రాశిని 24 భాగములుచేయుగా చతుర్వింశాంశయగును. దీని ప్రమాణము 1°-15 భాగాలగును. దీనిని సిద్ధాంశ అనియును అందురు. ఇందు బేసిరాశులయందు గ్రహముగాని, లగ్నముగానియున్న సింహాదిగను, సరిరాశులయందున్న కర్కాటకాదిగను గ్రహములను గుర్తించవలయును.

12. ఖాంశ :- రాశిని 27 భాగములు చేయగా సప్తవింశాంశలేక ఖాంశ యనియు చెప్పబడును. దీని ప్రమాణము 1°-6'-40" అగును. ఇందు ఏరాశి యందు గ్రహముగాని లగ్నముకానియుండునో ఆ రాశినుండి క్రమముగా 27 రాశ్యధిపతులుగ గుర్తించి ఆప్రదేశమున గ్రహమును గుర్తించవలెను. అనగా రాశిచక్రము రెండు ఆవృతులు పూర్తియగును.

13. త్రింశాంశ :- రాశిని 30 భాగములు చేయగా త్రింశాంశయగును. దీని ప్రమాణము 1 భాగ రాశియందు గ్రహముగాని లగ్నముగాని ఏ భాగ యందుగలరో గుర్తించవలయును. విషమరాశులగు మేష, మిథున, తుల, ధనస్సు, కుంభములయందు మొదటి అయిదు భాగాలు కుజునకు, తరువాత అయిదుభాగాలు శనికి, తదుపరి 8 భాగలు గురునకు తదుపరి 7 భాగలు బుధునికి శుక్రునకు తదుపరి 5 భాగలు ప్రాప్తించును. సమరాశులగు వృషభ, కటక, కన్య, వృశ్చి, మకర మీనములందు పై క్రమమునకు వ్యత్యస్థముగా శుక్రునకు 5, బుధునకు 7, గురునకు 8, శనికి 5, కుజునకు 5 భాగలు కలుగును.

కుజ, బుధ, గురు, శుక్ర, శనులకు రాశ్యాధిపత్యములు సమబేసిరాశులు కలవు అందువలన విషమరాశియందుగల గ్రహముయొక్క త్రింశాంశనాధుని విషమరాశి యందును. సమరాశియందు గల గ్రహమును త్రింశాంశనాధుని సమరాశియందును గుర్తించవలయును. ఉదా:- ఒక జాతకమున రవి మేష మున 0-3 45 మొదటి అయిదు భాగలయందున్నాడు. కావున ఆ అయిదు భాగలు కుజునివి కావున గ్రహము విషమరాశి యందున్నది కావున కుజుని విషమరాశియగు మేషమునందే రవిని గుర్తించవలయును,

14 ఖవేదాంశ :- రాశిని 40 భాగములు చేయగా ఖవేదాంశయగును. దీని 0°-45' నిమిషముల ప్రమాణమగును. ఇందు గ్రహమునుగాని లగ్నముగాని రాశియందు ఏభాగమునందున్నదో గ్రహించవలయును. బేసిరాశులయినచో మేషాదిగను, సరిరాశులయందు గ్రహమున్నతులాదిగను గ్రహముని ఆయాస్థానములయందు గుర్తించవలయును. ఇందు రాశి చక్రము 3 ఆవృతులగును.

15. అక్షవేదాంశ :- రాశిని 45 భాగములు చేయగా అక్షవేదాంశయగును దీనికి 0°-40' నిముషములు ప్రమాణమగును. ఇందు గ్రహముగాని లగ్నముగాని రాశియందే భాగమున కలదో గుర్తించి చరరాశులకు మేషాదిగను, స్థిరరాశులకు సింహాదిగను, ద్విస్వభావరాశులకు ధనురాదిగను గ్రహములు

గుర్తింపవలయును,

16 షష్ట్యంశ :- రాశిని 60 భాగములు చేయుగా షష్ట్యంశయగును. దీని ప్రమాణము 0°-30' నిముషములు బేసిరాశియందు షష్ట్యంశ సంఖ్యను 12 చే భాగించగా మిగులు శేషమును సరించి మేషాదిగను, సమరాశులందు షష్ట్యంశ సంఖ్యను 12చే భాగించి మిగులు శేషమునుబట్టి మీనాదిగ అపసవ్యముగను గ్రహమును గుర్తించవలయును.

## * భావ పరిశీలనలో ముఖ్యాంశములు *

1. భావము భావేశుని చేతగాని శుభగ్రహముచేగాని చూడబడినను వారి యుతియున్నను మంచి ఫలితములను ప్రసాదించును.
2. 6-8-12 అధిపతులు శుభగ్రహములయినను వారి యుతి లేక దృష్టులు మిగిలిన భావములకు శుభమును ఇవ్వవు.
3. 6-8-12 భావాధిపతులకు కేంద్రాధిపత్యంగాని, కోణాధిపత్యంగాని కల వారయిన లేదా మర్చులుడయిన, ఆగ్రహము కంటె గ్రహాల ప్రభావ మధికమగును. అనగా అగ్రహప్రభావము ఫలితమును ఇవ్వదు.
4. షష్టమున గురుడు, అష్టమము (8) బుధుడు ద్వాదశమున (12) శుక్రుడు శుభ ఫలితముల నివ్వగలరు
5. 6-8-12 లలో ఉన్న ఇతర గ్రహములు మేలు చేయలేవు కాని ఆ రాశి వారికి మూలత్రికోణ స్వక్షేత్ర, ఉచ్చమిత్రరాసులయునను శుభ దృష్టికలిగియున్నను చెడును కొంత తగ్గించును.
6. 6-8-12 అధిపతులు అస్తంగతత్వ నీచ శత్రుక్షేత్రస్థితిని పొంది శత్రువులచే ఆక్రాంతులయి నిర్బలురయినను లేక స్వక్షేత్రములందున్న (6-8-12లలో) అశుభఫలితములను ఇవ్వరు పూర్తి శుభఫలితములను ఇవ్వగలరు.
7. 6-8-12 భావాధిపతులు ఏ భావములో ఉంటే ఆ భావము చెడుతుంది. కాని ఆ దుష్టస్థానాధి పత్యంతో బాటుగా లగ్నాధిపత్యము ఉన్నచో దోషంలేదు. రవి చంద్రులకు అష్టమాధిపత్యం లేదు. తులకు అష్టమ శుక్రుడు మేషమునకు అష్టమ కుజదోషమును లేదు.

8. అశుభయోగ కారకులయిన గ్రహాలు ఎన్ని శుభగ్రహాలచే చూడబడితే (వారువారు మిత్రులైనవడం మంచిది) అంతగా శుభులు అవుతారు. అట్టి వారిని "యోగయుక్త" గ్రహాలు అంటారు.

9. 1) రవి, 2) గురుడు, 3) కుజుడు, 4) చంద్రుడు, 5) గురుడు, 6) శనికుజులు, 7) శుక్రుడు, 8) శని, 9) గురురవులు. 10) గురు బుధ, రవి శనులు, 11) గురుడు, 12) శని ఆయాభావాలకు కారకులు ఆ భావాలను పరిశీలించే విషయంలో ఆయా గ్రహాలనుగూడ పరిశీలించాలి.

10. ఆయుష్కారకుడయిన శని అష్టమములో శుభుడు కాని 19 లలో రవి 5లో గురుడు, 7లో శుక్రుడు 12లో శనియోగ కారకులు కారు.

11. భావమును పరిశీలించునపుడు "భావద్భావం" అనే పద్ధతిని పరిశీలించాలి అనగా సప్తమమును చూస్తే లగ్నాన్నిచూడాలి చతుర్థాన్ని చూస్తే సప్తమము చూడాలి.

12. ధనము, ధనవృద్ధి, ఆదాయం, వృత్తి మొదలయిన అంశలు చూచేటప్పుడు ఆ భావాలతో పాటుగ లగ్నాన్ని లగ్న బలాన్ని తప్పనిసరిగ చూడాలి.

13. జన్మ కుండలి :- జన్మకుండలి నుండి గ్రహాల అధిపత్య శుభత్వ పాపత్వములను గుర్తించడము ద్వారా ఆయా గ్రహాలిచ్చే ఫలితాలను నిర్దేశించాలి. ఇది క్రియాశీలతను ప్రయత్న పరిణామాదులను వెల్లడిస్తుంది

14 చంద్ర కుండలి :- చంద్రలగ్నాత్తు భావాలను పరిశీలన చేయడం ద్వారా మానసిక ప్రవృత్తులను కోరికలను పరిశీలన చేయవచ్చును.

15. చలిత కుండలి :- భావ చక్రములో ఏ గ్రహము భావమధ్యములో ఉన్నదో అది సంపూర్ణ ఫలితములనిస్తుంది, భావమధ్యమునకు దూరం అయిన కొలది త్రైరాశికము ద్వారా బలాన్ని పరిగణించాలి.

16. నవాంశ కుండలి :- అదృష్టాన్ని అనుభవించే భాగ్యాన్ని పరిశీలించడానికి నవాంశ కుండలిలో బలాబలాలు మిత్ర, శత్రు, ఉచ్ఛ, నీచ, స్వక్షేత్ర, మూల త్రికోణాదులను పరిశీలించవలెను.

17. గ్రహస్ఫుటము,షడ్వర్గ లేదా షోడశవర్గ వీనిద్వారా గ్రహముయొక్క శుభము నిచ్చే బలాన్ని పరిగణించవలెను.

18. సుదర్సన చక్రం :- జననాది 12 సంవత్సరాలు లగ్నాది ద్వాదశ భావములకు చెందినవి; 13 నుండి 24 వరకు చంద్రాది ద్వాదశ భావములకు చెందినవి; 25 నుండి 36 వరకు, రవ్యాది ద్వాదశ భావములకు చెందినవి; మరల ఇదేక్రమం పునరావృతమవుతుంది, ఉదాహరణకు 32 వ సంవత్సర సూర్యుని నుండి 8వ రాశికి చెందినది అగును. ఆ రాశ్యాధిపతి ఆ సంవత్సరాదిపతి అగును ఆ రాశి నుండి సంచారాన్ని పరిశీలించడమే సుదర్శన చక్ర పద్ధతి.

19 అష్టక వర్గు :- వర్తమాన దశాంతర్దశలు ఏ ఏ భావాలలో అధిక (4 కంటె ఎక్కువ) శుభ బిందువుల నిచ్చునో ఆ దశ ఆయా భావాలకు పరిపూర్తి నిచ్చును. అష్టకవర్గులో ఏ గ్రహము ఏ రాసులలో అధిక బిందువుల నిచ్చునో ఆయా రాసులలో గోచారవశం చేత ప్రవేశించునపుడు మేలు చేస్తుంది.

20. రవిచంద్రులు మారక స్థానాధిపతులయిననూ మారకులు కారు. (2,7)

21. కేంద్రాధిపతితానిచ్చే ఫలితాన్ని అస్పష్టంగా ఇస్తాడు. శుభులు కేంద్రాధిపతులయిన వారి శుభత్వము పోవును. పాపులు కేంద్రాధిపతులయిన వారి పాపత్వము పోవును

22. గురు శుక్రులు మారకాధిపతులైనా మారకస్థానాల్లో ఉన్నా (2, 7) విశేష మారకులౌతారు.

24 మూల త్రికోణములోగాని స్వోచ్చాదులలోగాని ఉన్న గ్రహాలు ఇచెడి శుభ ఫలితములను విచారణచేయు సందర్భమున నేదు జన్మలగ్నము నుండి మాత్రమే వాటిని పరిశీలించవలయును చంద్రలగ్నమునుండి పరిశీలించకూడదు

24. ఏభావల శుభార్గళ (ఆ భావానికి ద్విర్ద్వాదశశాలలో శుభగ్రహాలు ఉండుట శుభార్గళలు) కలిగి ఉందో పరిపుష్టము అయి ఉంటుంది. పాపార్గళ భావనాశనమును చేయును.

పంచమ-సప్తమ-నవమములలో శుభులున్నచో 6-8 స్థానాల ద్వారా కలిగే అశుభ ఫలితము తగ్గిపోవును.

25. కుండలి పూరర్ధ్వము (దశమ స్ఫుటము నుండి చతుర్ధ స్ఫుటము వరకు ఉన్న గ్రహాలు ప్రత్యక్షంగా శీఘ్రఫలితము నిచ్చును. ఉత్తరార్థము

(చతుర్థస్ఫుటం నుండి దశమ స్ఫుటం వరకు) లో ఉన్న గ్రహాలు అప్రత్యక్షంగా ఫలాన్నిస్తాయి.

26. శుభగ్రహము వక్రిస్తే విశేష శుభఫలము, అశుభ గ్రహం వక్రిస్తే అధిక దోష ఫలం ఇస్తాయి

27 ఉచ్ఛగ్రహం వక్రిస్తే నీచ ఫలం నీచగ్రహం వక్రిస్తే ఉచ్ఛ ఫలం ఇస్తాయని వేరొక మతము.

28. జన్మలగ్నము నుండి 22వ ద్రేక్కాణము అష్టమ స్థానములో పడును. దీనిద్వారా మృత్యుకారణమును ఊహించవలయును వారి దశలో కష్ట ఫలితాన్ని చెప్పాలి.

29 64వ నవాంశమును బట్టి కూడ మృత్యు కారణమును పరిశీలించవలెను లేదా ఆ గ్రహ దశయందు దోషఫలితమును గుర్తించవలయును.

30. మాందీ, గుళికలున్న భావాలను గూడ పరిశీలించవలెను ఆ భావాధిపతుల దశలను దోషదాయకములుగా గుర్తించాలి

31. ఛిద్ర గ్రహాలు ఏడు వాటిని కూడా పరిశీలించవలెను

1) అష్టమాధిపతి
2) అష్టమ భావస్థిత గ్రహము
3) అష్టమాన్ని చూసే గ్రహము
4) 22వ ద్రేక్కాణాధిపతి
5) అష్టమాధిపతితో కలసిన గ్రహము
6) 64వ నవాంశాధిపతి (చంద్రుని నుండి అని ఒక మతం)
7) అష్టమేశుని అతి శత్రువులు

ఇవి ఛిద్రగ్రహాలు జాతక పారిపాతంలో చెప్పబడినవి.

32) 6-8-11-12 స్థానాధిపతుల దశలు సామాన్యముగా కష్టఫలాన్నిస్తాయి

33) అంగభంగం, వికలాంగత 6-12 స్థానాల నుండి పరిశీలించాలి.

34) అష్టకవర్గులో కక్ష్యాక్రమాన్ని పరిశీలించాలి.

ప్రతి రాశిలోను రాశ్యారంభము నుండి

0° నుండి 3-45 వరకు శనికక్ష్య

3°-45' నుండి 7-30 వరకు గురు కక్ష్య

7–30 నుండి 11–15 వరకు కుజ కక్ష్య
11 15 నుండి 15°–00 వరకు రవి కక్ష్య
15 00 నుండి 18–45 వరకు శుక్ర కక్ష్య
18°-45 నుండి 22–30 వరకు బుధ కక్ష్య
22°–30 నుండి 26–15 వరకు చంద్ర కక్ష్య
26-15 నుండి 30-00 వరకు లగ్న కక్ష్య

ఒక గ్రహానికిచెందిన అష్టకవర్గులో ఒక భావములో ఏ గ్రహముద్వారా బిందుపు వచ్చినదో ఆ కక్ష్యలో ఆ గ్రహము సంచరించే కాలము శుభప్రదము ఏ గ్రహం శుభ బిందువు ఇవ్వలేదో ఆ కక్ష్యలో ముఖ్య గ్రహసంచార కాలము దోషప్రదము.

ఉదా :– రవ్యష్టక వర్గులో లగ్న భావంలో శని బిందువు ఇవ్వనపుడు ఆ కక్ష్యలో రవి సంచరించే కాలములో రవి దుష్టఫల ప్రదాత అవుతాడు. ఆదోష ఫలం శని కారకత్వాలు రవి కారకత్వాలు మిశితమైన దోషం సంభవిస్తుంది.

6 - 8 - 12 స్థానాదిపతులు అయినచో ఆ భావమునందున్న గ్రహాలు శుభ ఫలితాలను ఇస్తాయి

ఆత్మ కారకుడు

యోగాలు

గురుడు

మహాదశా నాధుడు అంతర్దశానాధుడు గోచారంతో షష్టాష్టక, ద్విర్ద్వా దశాలు పట్టినపుడు సత్ఫలితము నిచ్చును.

3-5-7 తారల దశలు యోగదాయకము కావు గోచారములో కూడా ఈ తారయందున్న గ్రహములు యోగము నీయవు



## : షష్ట్యంశ శుభ పాప వివరములు :

| | బేసిరాశులు | అంశనామములు | శుభపాప నివారణ | సమరాశులు | |
|---|---|---|---|---|---|
| 1 | 0-30' | ఘోరాంశ | పాపి | 30-00' | 60 |
| 2 | 1 00' | రాక్షసాంశ | పాపి | 29-30' | 59 |

| బేసిరాశులు | | అంశదామములు | శుభపాప నవారణ | సమరాశులు | |
|---|---|---|---|---|---|
| 3 | 1-30' | దేవాంశ | శుభ | 29-00 | 58 |
| 4 | 2-00' | కుభేరాంశ | శుభ | 28-30' | 57 |
| 5 | 2 30' | యక్షాంశ | శుభ | 28 00' | 56 |
| 6 | 3 00' | కిన్నరాంశ | శుభ | 27-30' | 55 |
| 7 | 3-30' | భ్రష్టాంశ | పాపి | 27 00' | 54 |
| 8 | 4-00' | కులఘ్నాంశ | పాపాంశ | 26-30' | 53 |
| 9 | 4 30' | గరళాంశ | పాపాంశ | 26 00' | 52 |
| 10 | 5-00' | అగ్న్యంశ | ,, | 25-30' | 51 |
| 11 | 5 30' | మాయాంశ | ,, | 25 00' | 50 |
| 12 | 6-00' | ప్రేతపురీషాంశ | ,, | 24-30' | 49 |
| 13 | 6 30' | అపాంపత్యంశ | శుభాంశ | 24-00' | 48 |
| 14 | 7-00, | దేవగణేశాంశ | ,, | 23-30' | 47 |
| 15 | 7 30' | కాలాంశ | పాపాంశ | 23-00 | 46 |
| 16 | 8-00' | సర్పాంశ | శుభాంశ | 22-30' | 45 |
| 17 | 8-30' | అమృతాంశ | ,, | 22-00' | 44 |
| 18 | 9 00' | చంద్రాంశ | ,, | 21-30' | 43 |
| 19 | 9-30' | మృద్వంశ | ,, | 21-00' | 42 |
| 20 | 10-00' | కోమలాంశ | ,, | 20-30' | 41 |
| 21 | 10-30' | పద్మభావ్యంశ | ,, | 20-00' | 40 |
| 22 | 11-00' | బ్రహ్మాంశ | ,, | 19-30 | 39 |
| 23 | 11-30' | విష్ణ్వంశ (వాగీశాంశ) | ,, | 19-00' | 38 |
| 24 | 12-00' | మహేశ్వరాంశ | ,, | 18-30' | 37 |
| 25 | 12-30' | దేవాంశ | ,, | 18-00' | 36 |
| 26. | 13-30' | ఆర్ద్రాంశ (ఇంద్రాంశ) | ,, | 17-30' | 35 |
| 27. | 13-30' | కలినాంశ | పాపాంశ | 17 00' | 34 |
| 28. | 14-00' | క్షితీశ్వరాంశ | శుభాంశ | 16-30' | 33 |
| 29 | 14-30' | కమలాకరాంశ | ,, | 16-00' | 32 |
| 30. | 15-00' | గుళికాంశ | ,, | 15-30' | 31 |
| 31. | 15-30' | మృత్యుకరాంశ | శుభపాపాంశ | 15-00' | 30 |
| 32. | 16 00 | కాలాంశ | పాపాంశ | 14-30 | 29 |

| బేసిరాశులు | | అంశనామములు | శుభపాప నివారణ | సమరాశులు | |
|---|---|---|---|---|---|
| 33 | 16 00 | దవాగ్న్యంశ | పాపాంశ | 14-00' | 28 |
| 34 | 17-00 | ఘోరాంశ | ,, | 13-30' | 27 |
| 35 | 17 30 | యమాంశ | ,, | 13-00' | 26 |
| 36 | 18-00 | కంటకాంశ | శుభాంశ | 12-30' | 25 |
| 37 | 18-30 | సుధాంశ | ,, | 12 00' | 24 |
| 38 | 19-00 | అమృతాంశ | ,, | 11-30' | 23 |
| 39 | 19-30 | పూర్ణ చంద్రాంశ | ,, | 11-00' | 22 |
| 40 | 20-00 | విష ప్రదిగ్ధాంశ | పాపాంశ | 10-30' | 21 |
| 41 | 20 30 | కులనాశాంశ | ,, | 10-00 | 20 |
| 42 | 21-00 | వంశ క్షయాంశ | శుభాంశ | 9-30 | 19 |
| 43 | 21-30 | ఉత్పాతాంశ. | పాపాంశ | 9-00 | 18 |
| 44 | 22-00 | కలిమూపాంశ | ,, | 8-30' | 17 |
| 45 | 22-30' | సౌమ్యాంశ | శుభాంశ | 8 00' | 16 |
| 46 | 23 00 | కోమలాంశ | ,, | 7-30 | 15 |
| 47 | 23-30 | సీతాలాంశ | ,, | 7-00' | 14 |
| 48 | 24-00 | దంష్ట్రాకులాంశ | , | 6-30' | 13 |
| 49 | 24-30 | వం గముఖాంశ | పాపాంశ | 6 00' | 12 |
| 50 | 25.00 | ప్రలీనాంశ | ,, | 5-30' | 11 |
| 51 | 25-30 | కాలా వ్వంశ | శుభాంశ | 5-00' | 10 |
| 52 | 26-00 | దండయుధాంశ | పాపాంశ | 4-30' | 9 |
| 53 | 26-30 | నిర్మలాంశ | శుభాంశ | 4 00' | 8 |
| 54 | 27-00 | సౌమ్యాంశ | ,, | 3-30' | 7 |
| 55 | 27-30 | క్రూరాంశ | ,, | 3-00' | 6 |
| 56 | 28 00 | అతిశీతలాంశ | ,, | 2-30' | 5 |
| 57 | 28-30 | అమృతాంశ | ,, | 2-00' | 4 |
| 58 | 29-00 | పయోధీశాంశ | ,, | 1-30' | 3 |
| 59 | 29-30 | భ్రమణాంశ | పాపాంశ | 1-00' | 2 |
| 60 | 30-00 | ఇందు రేఖాంశ | శుభాంశ | 0-30' | 1 |



# స్త్రీ జాతక పరిశీలనలో ముఖ్య విషయములు

ప్రతి జాతకమునందును గ్రహములు తాము ఇచ్చు సామాన్య ఫలితము లను ఇచ్చుచుందురు. స్త్రీ జాతకమును అనుసరించి ఆ స్త్రీ వివాహము చేసికొను పురుషునకు ప్రాప్తించు ఫలితములు తెలియవచ్చును. అదేవిధముగ పురుషుని జాతకము నుండియు గ్రహింపవచ్చును. వివాహము అయిన తరువాతనే పురుషునకు గాని స్త్రీకి గాని పూర్ణత్వము సిద్ధించుననుట సామాన్యము అనగా స్త్రీ పురుష(భార్యాభర్తల) జాతకముల సమన్వయము ననుసరించి కుటుంబస్థితిని తెలిసికొనవచ్చును. స్త్రీ జాతకము లేక పురుషజాతకము పురుష జాతకము విడచి స్త్రీ జాతకము వివాహమయిన తరువాత చూడరాదు.

ఏ విధముగా పురుష జాతకమును చూడవలెనో ఆ విధముగనే స్త్రీ జాతకమును కూడ పరిశీలించవలయును. స్త్రీ జాతకము నందు అష్టమ భావము నుండి ఆ స్త్రీయొక్క భర్త ఆయురారోగ్యములు గ్రహించవలయును. స్త్రీ సౌందర్యాదులను లగ్న చంద్రరాసుల నుండి గ్రహింపవలయును. సప్తమం నుండి భర్త గుణగణములు స్త్రీయొక్క భావములు గ్రహించవచ్చును.

స్త్రీ జాతకము నందు మూడు లక్షణములు ప్రధానము,

1. ఆ స్త్రీకి సంబంధించినవి.
2. భర్తకు సంబంధించినవి.
3. ఇరువురకు సంబందించినవి.

లగ్న చంద్రులలో ఎవరు బలవంతులో వారినుండి వైధవ్యము, అష్టమము నుండి అభివృద్ధి సుఖము కలుగును. భర్త అదృష్టము; లగ్నము నుండి రూపవర్ణాలు, సౌందర్యాదులు గుర్తించవలెను. సప్తమమునుండి సుఖం భర్త గుణగణములు సంపద గ్రహించవలయును. చతుర్థభావము నుండి పాతివ్రత్యము చూడవలెను ఇందు పాపులు స్వక్షేత్ర గతులయినచో శుభము జరుగవచ్చును.

సంతాన విషయమున పంచమ నవమ భావములను పూర్తిగ పరిశీలించవలయును. దైవభక్తి, పితృభక్తి, శాంతము మున్నగునవి నవమునుండి గ్రహించవలయును.

సహజముగా స్త్రీ లక్షణములలో పురుషులనాకర్షించు లక్షణము మొదటిది

స్త్రీ జాతకమునందు లగ్నమున చంద్ర శుక్రులు, సప్తమమున కుజ శనులు న్నచో ఆ స్త్రీ అతి కాముకత గలిగి భర్తతో తృప్తి పడదు. పై గ్రహములకు శుభదృష్టి లేకున్న తప్పక జారురాలగును.

స్త్రీకి జనన కాల గ్రహ సంపత్తిని చూచు విధముననే ప్రథమ రజస్వల కాలమును జననకాలము వలెనే గుర్తించవలయును. ఈ క్రింది యోగములు ప్రథమ రజస్వలా కాలమునందున్న శుభము జన్మకాలము వలెనే రజస్వలా సమయమునకు గ్రహస్థితి వేయవలయును.

1. లగ్న సప్తమాధిపతులు లగ్నము నందుండి శుక్రదృష్టి నొందిన శుభము

2 లగ్న సప్తమాధిపతులు సప్తమము నందుండి గురు చంద్రుల దృష్టి యుండిన శుభము.

3 ఉచ్ఛ నొందిన లేదా స్వక్షేత్రాధిపతయిన సప్తమాధిపతి లగ్నాధిపతితో లగ్న సప్తమములలో నొకచోట నుండుట.

4 లగ్నాధిపతి ఉచ్ఛ నొందగా సప్తమమును సప్తమాదిపతిని వీక్షింప కేంద్రములు శుభగ్రహములతో యుండగా నీతి నియమములు కలది యగును

5 సప్తమాదిపతి షష్ఠమందును లేదా షష్ట సప్తమాదిపతులు వ్యయమందు గాని యుండిన పతివ్రత యగును.

6. కేంద్ర మందున్న సప్తమాదిపతి నవాంశ నొంది షష్ఠాదిపతి యుతిని వ్యయాదిపతి దృష్టి కలిగినను నీతి నియమములు కలది యగును.

## : వివాహ కాలము :

స్త్రీ జాతకము నందు సప్తమాధిపతి గ్రహ దశయందు గాని, సప్తమ మందున్న గ్రహ దశయందు గాని శుక్రుడు లేదా లగ్నాదిపతి లేదా చంద్ర రాస్యాదిపతిగాని గోచార వశమున సప్తమమును పొందినను, గురువు గాని, సప్తమ నవాంశాదిపతి గాని గోచారవశమున సప్తమమును పొందినకాలమున గాని స్త్రీకి వివాహమగును.

# లగ్న చంద్రులలో బలవంతుని బట్టియే లగ్న నిర్ణయము చేయవలెను.

స్త్రీల జన్మరాశికి అష్టమము వలన భర్త మరణము, జన్మరాశి లగ్నముల ననుసరించి శరీర స్థితి సప్తమము ననుసరించి భర్తృ సౌఖ్యము పంచమము ననుసరించి సంతానమును ముఖ్యముగా తెలియవలయును. లగ్న చంద్రులు పురుషరూప రాశులందుండినచో పురుషరూపము, పురుష స్వభావం దుఃస్వభావము దుఃఖము గలది యగును. పాపులతో కూడినను చూడబడినను పాపా చారిణంతురాలగును. మరియు గుణహీనురాలగును. మిశ్రమముగ నుండెనని మిశ్రగుణములు కలది యగును.

లగ్న చంద్రులయందు బలవంతుడు త్రింశాంశాధిపతియగు కుజ, శుక్ర బుధ, గురు, శనులలో ఏ త్రింశాధిపతి యందుండునో దాని ననుసరించి ఫలములు చెప్పబోవ బడుచున్నవి.

లగ్న చంద్రులలో బలవంతుడు (లగ్నాధిపతులు గాని చంద్రుడుగాని చంద్ర లగ్నాధిపతి గాని) కుజ క్షేత్రమందు కుజ త్రింశాంశ యందున్నచో పెండ్లి కాకముందే పురుష సంపర్కము చేయును. శుక్ర త్రింశాంశ యందుండిన దురాచారయు బుధ త్రింశాంశ అయిన మాయతో గూడినదియు, గురు త్రింశాంశ అయినచో పతివ్రతయు, శని త్రింశాంశ అయిన దాసీభావము పొందునదియు, నాట్యము చేయునదియు నగును.

శుక్ర క్షేత్రమునందు శుక్ర త్రింశాంశ యందుండగా బుట్టిన స్త్రీ సౌశీలాది గుణములచే ప్రసిద్ధురాలగును. బుధ త్రింశాంశ యందుండెనేని గీతాది కళల జ్ఞానము కలదియు, గురు త్రింశాంశ యందుండెనేని శుభగుణములు కలదియు శని త్రింశాంశ యందుండెనేని వివాహానంతరము మరియొకరిని పెండ్లియాడునది, కుజ త్రింశాంశ యంతుండెనేని దుర్మార్గురాలగును.

లగ్న చంద్రులలో బలవంతుడు బుధ క్షేత్రమందు శుక్ర త్రింశాంశ యందుండగా బుట్టిన స్త్రీ అనేక పురుషులయందు వ్యాపించిన కామముకల స్త్రీ యగును. బుధ త్రింశాంశ యందుండిన సుగుణములు కలది యగును. గురు త్రింశాంశ యందుండిన పతివ్రత యగును. శని త్రింశాంశ యందుండిన నపుంసకురాలగును, కుజ త్రింశాంశ యందుండెనేని దుర్మార్గురాలగును.

చంద్ర క్షేత్రమందు కుజ త్రింశాంశ యందుండగా బుట్టిన స్త్రీ యథేష్ట వ్యవహారిణి యగును. శుక్ర త్రింశాంశ యందున్న వ్యభిచారిణి యగును. బుధ త్రింశాంశ యందున్న శిల్పకర్మలు చేయునట్టిది యగును. గురు త్రింశాంశందున్న అనేక సుగుణములు కలదియగును. శని త్రింశాంశయందున్న మగనిని చంపు స్వభావము కలది యగును.

రవి క్షేత్రమందు కుజ త్రింశాంశ యందున్న స్త్రీ పురుషాచరము కలది యగును. శుక్ర త్రింశాంశ యందున్న వ్యభిచారిణి యగును.

బుధ త్రింశాంశ యందున్న పురుష స్వభావము కలదియగును. గురు త్రింశాంశ యందున్న పతివ్రత యగును. శని త్రింశాంశ యందున్న స్వకులమును విడచునది యగును.

గురు క్షేత్రమున కుజ త్రింశాంశ యందున్న స్త్రీ బహుగుణములు కలది యగును శుక్ర త్రింశాంశ యందుండిన విస్తరించి మాటలాడునదియు పతివ్రతయు నగును బుధ త్రింశాంశ యందున్న శాస్త్రజన్య జ్ఞానము కలది యగును గురు త్రింశాంశ యందున్న బహు సుగుణములు కలది యగును. శని త్రింశాంశ యందుండిన అల్పమయిన రతి కలది యగును.

శని క్షేత్రమందు కుజ త్రింశాంశలో బుట్టిన స్త్రీ దాసి యగును. శుక్ర త్రింశాంశ యందుండిన గొడ్రాలగును. బుధ త్రింశాంశ యందుండిన దుర్మార్గురాలగును గురు త్రింశాంశ యందున్న పతివ్రత యగును. శని త్రింశాంశ యందుండిన నీచ పురుషగామిని యగును.

## * అతి కాముక స్త్రీ లక్షణము *

1) శుక్ర శనులు ఏకరాశి యందైనను, శని నవాంశము యందు శుక్రుడు శుక్ర నవాంశయందు శనియుండి పరస్పర వీక్షణము కలిగినను.

2) శుక్ర క్షేత్రములగు వృషభతులలలో నొకరాశి జన్మలగ్నమై జన్మ లగ్న నవాంశ కుంభ నవాంశ అయినను ఈ యోగములయందు బుట్టిన స్త్రీ పురుష సంయోగముచే తృప్తి పొందక చర్మముల లింగధారణియగు మరియొక స్త్రీతో రమించును. విషతుల్య మదనాగ్ని కలది యగును.

లగ్న చంద్రులలో బలవంతుడయిన వానినుండి సప్తమము గ్రహవర్జితమైనను, బలహీనమైనదయినను, శుభదృష్టి లేనిదయ్యును యుండగా పుట్టిన స్త్రీ యొక్క భర్త కుత్సితుడగును సప్తమమున బుధ శనులలో నొకడుండగా

బుట్టిన స్త్రీయొక్క భర్త పుంస్త్వహీనుడగును సప్తమము చరరాశి అయిన ఎల్లప్పుడు భర్త పరదేశమున తిరుగువాడగును. స్థిరరాశి అయిన ఏల్లప్పుడు స్వగ్రామము నందుండువాడును ద్విస్వభావ రాశి అయిన కొన్ని దినములు దేశాంతరమున కొన్ని దినములు స్వగృహమునందుండు వాడగును.

సప్తమ రాశియందు రవి యుండిన మగనిచే విడువబడినది యగును. కుజుడుండిన బాల్యమునందే విధవ యగును. శనియుండి పాపగ్రహముంచే చూడబడుచుండగా బుట్టిన స్త్రీ వివాహము లేకయే ముసలితనమును పొందును

సప్తమమున సర్వబలహీనుడయిన పాపగ్రహము ఉండి పాపగ్రహములచే చూడబడుచుండగా పుట్టిన స్త్రీ భర్తచే విడవబడును. పాప గ్రహములు బలవంతములై సప్తమరాశి యందున్నచో విధవ యగును. శుభులు పాపులు మిశ్రమముగా నుండిన మగనిని విడచి మరియొకరిని పెండ్లి యాడునది యగును.

ఏ రాశియందయినను శుక్ర నవాంశయందు కుజుడును కుజ నవాంశ యందు శుక్రుడును ఉండగా బుట్టిన స్త్రీ స్వేచ్ఛ చేత పరపురుష సంగతురాలగును. సప్తమమందు శుక్రాంగారకులు చంద్రునితో కూడియుండగా బుట్టిన స్త్రీ భర్త యనుజ్ఞచే పరపురుషుని పొందును.

శని, కుజ క్షేత్రములగు మకర, కుంభ, మేష వృశ్చికములలో నొకటి లగ్నమయి అందు చంద్రు శుక్రులుండి పాపులచే చూడబడుచుండగా పుట్టిన స్త్రీ తల్లితోకూడ వ్యభిచరించునది అగును.

సప్తమ స్థానమందు కుజ నవాంశ శనిచే చూడబడుచుండగా పుట్టిన స్త్రీ వ్యాధిపీడిత భగయగును. శుభగ్రహములు, శుభనవాంశ అయిన సుభగయు మగనికి యిష్టురాలు నగును.

సప్తమము శని క్షేత్రమై అందు శని నవాంశమైయినచో ఆ స్త్రీ భర్త ముసలివాడును, మూర్ఖుడును అగును. కుజ క్షేత్రమయినచో అందుకు జన నవాంశ అయిన భర్త స్త్రీ లోలుడును, కోపియును అగును.

సప్తమము వృషభ తులలు గాని వృషభ తులా నవాంశలుగాగాని కల స్త్రీ భర్త రూపసౌభాగ్యములు కలవాడును అగును. బుధ క్షేత్రములగు మిధున కన్యలలో నొకరాశి గాని తన్నవాంశగాని అయిన దాని భర్త మంచినేర్పు జ్ఞానము కలవాడగును. కర్కాటకము గాని తన్నవాంశము గాని సప్తమము గా

గలవాని భర్త కామాతురుడు మృదుస్వభావము కలవాడును అగును. గురు క్షేత్రమయినను తన్నవాంశమయినను అయిన స్త్రీ భర్త గుణవంతుడు జితేంద్రియుడును అగును రవి క్షేత్రమైనను రవి నవాంశమయినను సప్తమము గా గల స్త్రీ భర్త మృదు స్వభావియు బహు కార్యాసక్తుడు నగును.

## : వైధవ్య ప్రాప్తి కాలజ్ఞానము :

స్త్రీ జన్మ లగ్నమునకు అష్టమమందు పాపగ్రహ ముండెనేని అష్టమాధిపతి పాపగ్రహములతో కూడియున్నను అష్టమ స్థానాధిపతి ఏ గ్రహముయొక్క నవాంశ యందుండునో వివాహానంతరము ఆ గ్రహము దశాధిపతి లేక అంతర్దశాధిపతి అయినపుడు వైధవ్యము సంభవించును. ద్వితీయము నందు శుభ గ్రహము నుండి పాపగ్రహములు అష్టమమందుండగా బుట్టిన స్త్రీకి భర్తకంటె ముందు మరణము కలుగును.

చంద్ర శుక్రులు లగ్నమందుండగా బుట్టిన స్త్రీ మాత్సర్య యుక్తురాలగును. సుఖాసక్తురాలగును. చంద్ర బుధులున్న సుఖము కలదియు గీత వాద్యాది కళలయందు నేర్పు కలదియు, సుగుణవతియు అగును. బుధ శుక్రులు లగ్నమందున్న మనోహరమయినదియు సుందరియు, గీతాదుల నెరిగినదియు నగును మూడు శుభగ్రహములు లగ్నమందున్న అనేక విధముల సౌఖ్యములు కలది యగును. పాప గ్రహములున్న అనేక విధముల కష్టములు కలది యగును.

చంద్రుడు కన్యా, వృశ్చిక వృషభ సింహముల యందుడంగా పుట్టిన స్త్రీ స్వల్ప పుత్రులు కలది యగును. పుత్రస్థానము శుభయుతమైనను చూడబడినను, స్వల్ప పుత్రులు కలది యగును.

చంద్ర బుధ శుక్రులు బలహీనులయి యుండగాను, శనిమధ్యబలుడయి యుండగాను, తక్కిన రవి, కుజ, గురువులు బలవంతులై యుండగాను, విషమ రాశులందు జన్మమయిన స్త్రీ పురుష స్వభావియై లోకమందు ప్రసిద్ధి పొందును.

సప్తమమున పాప గ్రహమునుండి, నవమమున మరియొక పాపగ్రహముండెనేని నవమమందున్న గ్రహమునకు సమమైన ప్రవ్రజ్యను పొందును. (సన్యాసము)

చంద్ర, బుధ, గురు, శుక్రులు బలయుక్తులయి లగ్నము వృషరాశి అగుచుండగా బుట్టిన స్త్రీ శాస్త్రములందు సమర్థురాలయి బ్రహ్మజ్ఞానము కలది యగును.



# ఆయుర్దాయము

(మానము 1 లిప్తకు 1 రో 10 గం. 4 ని॥లు కాలము కలుగును అనగా రాశికి ఏడు సంవత్సరములు అగును. భచక్రమునకు 84 సం॥లు అగును )

జన్మ లగ్నమునకు అష్టమము ననుసరించి జాతక స్థితి నూహింపవలెను. అష్టమ బలాబలమే ఆయుర్దాయముగా పూర్వులు నిర్ణయించి యుండిరి.

జన్మలగ్నమునకు అష్టమమున రవియుండిన అగ్నివలన చంద్రుండిన ఉదకము వలన, కుజుడుండిన ఆయుధము వలనను బుధుడుండిన జ్వరము వలనను, గురుడుండిన తెలియఁబడని దీర్ఘవ్యాధి వలనను, శుక్రుడుండిన దప్పి వలనను, శనియుండిన ఆకలి వలన మరణము కలుగును. అష్టమము చరరాశి అయిన పరదేశమందును ద్విస్వభావమయిన మార్గప్రదేశ మందును స్థిరాశి అయిన స్వదేశమందును మరణము కలుగును. అష్టమము గ్రహశూన్య మయినచో ఏ గ్రహముచే చూడబడునో ఆ గ్రహధాతు జనితమయిన వ్యాధి వలన మరణము కలుగును. అష్టమస్థాన రాశి కాలపురుషుని యొక్క ఏ అంగ మందుండునో ఆ అంగమందు ఏ గ్రహము అష్టమస్థానము చూచునో ఆ గ్రహ మునకు చెప్పిన ధాతుదోషము వలన మరణము సంభవించును. అధిక గ్రహ ములు అష్టమమును చూచుచుండిన అన్ని గ్రహగత పైత్యాది ధాతుదోషముల వలన మరణము సంభవించును.

ఏక కాలమందు రవి కుజులు దశమమందు కాని చతుర్థమున కాని యుండగా పుట్టిన వానికి పర్వతాగ్రమున రాతిదెబ్బలు తగలుటచే మరణము కలుగును. కుజ. చంద్ర, శనులు దశమ, సప్తమి, చదుర్థముల యందుండగా బుట్టినవాడు బావియందు పడి చచ్చును. పాపగ్రహములచే చూడబడుచున్న సూర్యచంద్రులు కన్యారాశి యందుండగా జనించినవాడు తన బంధువుల వలన చంపబడును. మీనము లగ్నమయి అందు రవి చంద్రులుండగా పుట్టిన వాడు ఉదకమునందు మునిగిపోవును.

కర్కాటకమున శని, మకరమున చంద్రుడుండగా బుట్టినవాడు జలోదర వ్యాధిచేగాని, జలమధ్యమున గాని చచ్చును చంద్రుడు మేష, వృశ్చికముల పాపగ్రహ మధ్యస్థుడై యుండగా బుట్టినవానికి శస్త్రమువలనను అగ్నివలనను మరణము కలుగును చంద్రుడు కన్యయందు పాప మధ్యగతుడై యుండగా బుట్టిన వానికి దుష్ట రక్తము చేతనయిన క్షయవ్యాధి చేతనయిన మరణము కల్గును.

చంద్రుడు శని క్షేత్రమందు మకర కుంభముల యందు శుభమధ్యుడై యుండగా బుట్టిన వానికి పగ్గముల చేతగాని అగ్ని యందుగాని పడుటచే మరణము కలుగును.

పంచమ నవమముల రెండిటియందును పాపగ్రహములుండి పాపగ్రహ ములచే చూడబడగా బుట్టినవానికి బంధనముచే మరణము కలుగును అష్టమ రాశియందు సర్పపాశ ద్రేక్కాణముకాని నిగళ ద్రేక్కాణముకాని( కర్కాటకంత్య మీనాంత్యములు సర్పపాశ ద్రేక్కాణములు, మకర ప్రథమద్రేక్కాణము నిగళ ద్రేక్కాణము) ఉదయించుచుండ బుట్టినవానికి బంధనము వలన మరణము కలుగును.

మీనము లగ్నమయి సప్తమమగు కన్యయందు పాపగ్రహ యుక్తుడయిన చంద్రుడుండగా మేషమున రవి యుండెనేని స్వమందిరము నందు స్త్రీ మూలకముగా మరణము కలుగును.

చతుర్థమున కుజుడుకాని రవికాని యుండగా దశమమందు శనివుండగా బుట్టినవాడు శూలముచేత వ్రక్కాలింబడిన శరీరము కలవాడై మరణించును. క్షీణచంద్ర సహితములయిన పాపగ్రహములన్నియు ఏక కాలమందు 1-5-9 ల యందున్నచో శూలోద్భిన్న శరీరుడయి మరణించును (తుపాకి చేత మరణించును)

చతుర్థమున రవి, దశమమున కుజుడుండి వీరలలో ఒకడు క్షీణచంద్ర యుక్తుడగు శనిచే చూడబడగా బుట్టినవాడు కర్రచే కొట్టబడిన మరణించును.

లగ్నమున శని 4న రవి 8న క్షీణచంద్రుడు 10న కుజుడుండగా జనించినవాడు దుడ్డుకొలతో కొట్టబడి చచ్చును. దశమమున క్షీణచంద్రుడు నవమమున కుజుడు లగ్నమున శని పంచమమందు రవి యిట్లుండగా బుట్టిన పొగ చేతగాని అగ్నిచేత గాని అంకుశాదులచేత గాని బంధనముచేతగాని మరణము కలుగును.

చతుర్థమునకు కుజ సప్తమమున రవి దశమమున శని యిట్లుండగా

బుట్టినవానికి ఖడ్గాద్యాయుధముల వలనగాని అగ్నివల్ల గాని రాజకోపము వల్ల గాని మరణము కలుగును.

దశమమున కుజుడు చతుర్థమున చంద్రుడు ద్వితీయమున శని ఇట్లుండగా బుట్టినవానికి వ్రణములయందు బుట్టిన పురుగులచే మరణము కలుగును. దశమమున రవి చతుర్థమున కుజుడు ఇట్లుండగా బుట్టినవాడు ఆందోళనాది వాహనముల మీదనుండి పడి మృతి నొందును.

సప్తమమున కుజుడు లగ్నమున క్షీణచంద్రుడు రవి శనులు ఇట్లుండ పుట్టినవానికి యంత్రపీడన వలన మరణము కలుగును

తులయందు కుజుడు మేషమందు శని మకరమందుగాని కుంభమందు గాని యుండ జనించినవాడు అమేధ్య మధ్యయందు మృతి నొందును.

దశమమందు క్షీణచంద్రుడు సప్తమమున రవి చతుర్థమున కుజుడుండగా బుట్టినవాడు అమేధ్య మధ్యన మృతి పొందును.

క్షీణచంద్రుడు బలయుక్తుడయిన కుజునిచే చూడబడుచుండగా శని అష్టమ మందుండగా బుట్టిన గొప్ప గుల్మవ్యాధి చేతనైన పురుగులు మొ॥నవి కలిగి వానివలనను ఆయుధములచే శస్త్రములు వేయుటచే నిప్పుతో కాలుట వలనకూడ మృతి నొందును.

సప్తమమున రవి కుజులు అష్టమమున శని చతుర్థమున చంద్రుడు ఇట్లుండ బుట్టినవానికి పక్షికృతమైన మరణమును పొందును.

లగ్నమున రవి పంచమమున కుజుడు అష్టమమున నవమమున చంద్రుడు ఇట్లుండ బుట్టినవానికి పర్వత శిఖరముల నుండి పడుటవలన గాని శస్త్రములవలన గాని, గోడ తనమీద పడుటవలనగాని, గోడమీదనుండి పడుట వనలగాని బంధనము వలన గాని మరణము పొందును.

లగ్న నవాంశాదిపతి యొక్క పమానమయిన భూమి (యందు-హోర నవాంశాధిపతితో కూడినట్టియు) చూడబడినట్టియు రాశి నమాన భూమియందు మరణము కలుగును.

లగ్న నవాంశాధి పయుక్తమయిన రాశి మేషమయిన మేకలుగొర్రెలు తిరిగెడు భూమియందును, వృషభమయిన వృషభ ప్రచార భూమియందును మిథునమయిన గృహమున, కర్కటకమయిన బావియందు, సింహమయిన అడవియందును, కన్య అయిన జలప్రాయ ప్రదేశమందును, తుల అయిన

అంగడి యందును, వృశ్చికమయిన గుంట యందును, ధనుస్సు అయిన అశ్వసంచా భూమి యందును, మకరమయిన జలప్రాయ ప్రదేశమందును, కుంభమయిన గృహమందు మీనమయిన జలప్రాయ ప్రదేశమందు మృతి కలుగును. ఎచటయినను బహుత్వమందు బలమును ననుసరించి స్థలము తెలియ వలయును.

జన్మించినపుడు లగ్నమందు కరచిన నవాంశలకు ఎంతకాలమగునో తత్తుల్యకాలము మృత్యు సమయమందు స్మృతి తప్పియుండును. అవగా లగ్న ప్రమాణము 5 ఘడియలయినచో 15 భాగలు గతమయిన 2 1/2 ఘడి యలు కాలము స్మృతి తప్పియుండును. లగ్నము స్వాధిపదృష్టమయిన నవాంశ తుల్యకాలమునకు రెండింతలు శుభులచే చూడబడుచుండిన నవాంశ తుల్యకాలమునకు మూడింతలు స్మృతి తప్పియుండునని సర్వమునులు చెప్పిరి

## : ద్రేక్కాణ లక్షణములు :

ఈపై చెప్పబడిన యోగంబులలో నొక యోగంబును లేక అష్టమస్థానం గ్రహసంయోగ వీక్షణ రహితమైయుండగా జన్మలగ్నమందే ద్రేక్కాణమున జన్మమగునో ఆ ద్రేక్కాణము మొదలు 22వ ద్రేక్కాణమున కధిపతి ఏ గ్రహ మో ఆ గ్రహమునకు అగ్ని జ్వాలాదులలో ఏ హేతువు చెప్పబడియున్నదో ఆ హేతువువలన మరణము సంభవించును. అట్లుగాకున్న అష్టమ రాశ్యాధిపతి గానున్న గ్రహమునకు చెప్పంబడియున్న అగ్నిజలాది కారణముల వలన మర ణము సంభవించుననియు చెప్పవలెను. 22వ ద్రేక్కాణమెద్ది అనిన జననము లగ్న ప్రథమ ద్రేక్కాణమున అష్టమరాశి ప్రథమ ద్రేక్కాణము 22వ ద్రేక్కా ణము. ద్వితీయ ద్రేక్కాణమయిన అష్టమమున ద్వితీయ ద్రేక్కాణము, తృతీ య ద్రేక్కాణమున అష్టమమున తృతీయ ద్రేక్కాణము 22వ ద్రేక్కాణము.

మేషలగ్న ప్రథమ ద్రేక్కాణమయిన అష్టమమయి క్రూర గ్రహ యుతము గాని దృష్టము గాని అయిన జన్మించినవాడు ఉదకము పాములు, మొదలగు వానిచే మృతి నొందును, ద్వితీయ ద్రేక్కాణమయిన జలాదులచే మరణము తృతీయ ద్రేక్కాణమయిన తటాకాదులంతు పడుటచే మరణము పొందును.

వృషభ ప్రథమ ద్రేక్కాణము అష్టమమయి క్రూర గ్రహయుతముగాని [illegible] మొదలగు వానిచే. ద్వితీయ

మయిన పైత్యము అగ్ని మొదలగువానిచే తృతీయ ద్రేక్కాణమయిన పల్లకి ఆసనము గుఱ్ఱము మొదలయిన వానిమీద నుండి పడుటచే మరణము కల్గును

మిధున ప్రథమ ద్రేక్కాణమష్టమమయి క్రూర గ్రహయుతము గాని దుష్టముగాని అయిన కాస శ్వాసరోగము చేతను, ద్వితీయ రోగము చేతను, ద్వితీయ ద్రేక్కాణము క్రూర గ్రహయుతము గాని దృష్టముగాని అయిన మహిషాదుల చేతను, తృతీయ ద్రేక్కాణమట్లుండెనేని వనమృగములు మొ॥ వానిచేతను మరణము కలుగును.

కర్కటకము ప్రథమ ద్రేక్కాణము పాప గ్రహయుతమయినను దృష్ట మయినను మద్యపానాదులచే మరణము కలుగును. ద్వితీయ ద్రేక్కాణమైన దెబ్బలు తగులుటచేత విషపానము చేత మరణము కలుగును. తృతీయ ద్రేక్కాణమయిన పక్షికృతమైన మేహాది వ్యాధులచేతను మరణము కలుగును.

సింహ ప్రథమ ద్రేక్కాణము పాప గ్రహయుతము కాని దృష్టము కాని అయిన ఉదకము విషము పాదములయందు రోగము మొదలగువానిచే మర ణము కలుగును. ద్వితీయ ద్రేక్కాణమయిన జలోదర వ్యాధిచే వన ప్రాంత మున మరణము కలుగును. తృతీయ ద్రేక్కాణమయిన విష శస్త్రాదులచే మృతి కలుగును.

కన్యా ప్రథమ ద్రేక్కాణము పాపగ్రహయుతము గాని దృష్టముగాని అయిన శిరోరోగము మొదలగు వానిచేతను, ద్వితీయ ద్రేక్కాణమైన సర్పం పర్వతములు మొదలగు వానిచేతను, తృతీయ ద్రేక్కాణమయినచో ఒంటె, గాడిద మొదలగు వానిచేతను మృతి కలుగును.

తులా ప్రథమ ద్రేక్కాణము పాపగ్రహ యుతముకాని దృష్టముకాని అయిన పూర్ణవయస్సుకలిగిన ఆడజంతువు మీదనుండి పడుకవలనను,ద్వితీయ ద్రేక్కాణమయిన జఠరరోగము చేతను, తృతీయ ద్రేక్కాణమయిన పాములు నీటియందు పుట్టిన జంతువుల చేతను మృతి కలుగును.

వృశ్చిక ప్రథమ ద్రేక్కాణము పాపగ్రహయుతము కాని దృష్టముకాని అయిన విషము చేతను, శస్త్రము చేతను స్త్రీ కృతమయిన అన్నపానాదుల చేతను ద్వితీయ ద్రేక్కాణమయిన మొలగజ్జి మొదలుగాగల బట్టకట్టుకొనుటకు శక్యముకాని వ్యాధిచే మృతియు, తృతీయ ద్రేక్కాణమయిన చిల్ల పెంకురాయి మొగలయిన వానివలన కలుగు వేదనచే మృతి కలుగును. లేనిచో పిక్కలం యందు ఎముకలు విరుగుటచే మరణించును.

ధనస్సు ప్రథమ ద్రేక్కాణము పాపగ్రహయుతముగాని దృష్టముగాని అయిన గుద ప్రదేశమున కలుగు వాతరోగము చేతను, ద్వితీయ ద్రేక్కాణమయిన విషదోషము చేతను, తృతీయ ద్రేక్కామయిన జలమధ్యమునందు. జల పంభసములయిన వివిధ రోగములచె లేక జఠరరోగము చేతగాని మృతి కలుగును

మకర ప్రథమ ద్రేక్కాణము పాపగ్రహయుతము కాని, దృష్టము కాని అయిన రాజదండన మొదలయిన వానిచేతను, ద్వితీయ ద్రేక్కాణమాయెనేని అగ్ని అస్త్రములు మొదలగు వానిచేతను, తృతీయ ద్రేక్కాణమయిన, స్త్రీ మూలముగను మరణము కలుగును.

కుంభ ప్రథమ ద్రేక్కాణము పాపగ్రహయుతము గాని దృష్టము కాని అయిన స్త్రీ మూలముగను, ఉదకముల చేతను, ఉదరరోగము చేతను ద్వితీయ ద్రేక్కాణమయిన స్త్రీ కృతములయిన దుఃఖముల చేతను, గుహ్య ప్రదేశములందయిన రోగముల చేతను, తృతీయ ద్రేక్కాణమయిన ముఖప్రదేశమునందయిన రోగముచేతను మరణము కలుగును.

మీన ప్రథమ ద్రేక్కాణము పాపగ్రహయుతము గాని దృష్టము కాని ఆయెనని గుల్మరోగము (కడుపులో బల్ల పెరుగుట) చేతను, అతిసారముచేతను మేహరోగము చేతను, స్త్రీల చేతను, ద్వితీయ ద్రేక్కాణమయిన జలమధ్యమందు నావ బద్ధలగుటచేతను, తృతీయ ద్రేక్కాణమయిన కుటిల రోగము చేతను మరణము కలుగును.

## యోగములు — ఫలములు

ఈ యోగములు సర్వదశల యందును జరుగును. యవనాదులు వీనిని 1800 యోగములుగా నిర్ణయించిరి. వీటియందు ముఖ్యమగునవి ముప్పది రెండు మాత్రము. ఆకృతియోగములు, సంఖ్యాయోగములు. దళయోగములు అని మూడు విధములు.

| | |
|---|---|
| అకృతి యోగములు | 20 |
| దళయోగములు | 5 |
| సంఖ్యా యోగములు | 7 |
| | 32. మొత్తము |

# ❁ యోగములు ❁

## ఆకృతి యోగములు

1) నౌకాయోగము :- లగ్న కేంద్రము మొదలు ఏడు రాశులయందు గ్రహములవిచ్ఛిన్నములయిన నౌకా యోగమగును.
సలిలోప జీవ విభవా బహ్వాయాఖ్యాత కీర్తితో దృష్టాః
కృపణా బలినో లుబ్ధానౌనం భూతాశ్చలాః పురుషాః

2) ఛత్ర యోగము :- చతుర్ధ కేంద్రము మొదలు ఏడు రాశుల యందు విచ్ఛిన్నములై గ్రహములుండిన ఛత్రయోగము.
సర్వజనాశ్రయో జయావాన్దాతా నృపవల్లభః ప్రకృష్టమతిః
ప్రధమేంత్యేవయసి వర స్సుఖభాగ్యయు తస్సితాత పత్రస్యాత్

3) కూటయోగము :- సప్తమకేంద్రము మొదలు లగ్నము వరకు గ్రహములవిచ్ఛన్నంబులయిన కూటయోగము.
అనృతిక కితవబంధన పాలానిష్కించనా శ్శరాః క్రూరః
కూటసముత్థా నిత్యం భవంతి గిరిదుర్గ వాసినో మనుజాః

4) కార్ముకయోగము :- దశమ కేంద్రము మొదలు ఏడు రాశుల యందు గ్రహము లవిచ్ఛన్నంబులయి యున్న కార్ముకయోగము.
అనృతిక గుప్తిపాలోశ్చోరాః కితవాశ్చ కాననే నిరతాః
కార్ముక యోగేజాత భాగ్యవిహీనా వయోమధ్యే

5) యూప యోగము :- లగ్న కేంద్రము మొదలు నాలగు రాశుల యందు గ్రహము లవిచ్ఛన్నంబులయి యున్న యూపయోగము.
ఆత్మ నిరతా నిరత స్త్యాగయుతోవిత్త సౌఖ్య సంపన్నః
వ్రతనియమ సత్యనిరతో యూపేజాతో విశిష్టశ్చ

6) శరయోగము :- చతుర్థ కేంద్రము మొదలు నాలుగు రాశులయందు గ్రహము లవిచ్ఛన్నంబులయి యున్న శరయోగము.
ఇషుకరణ దస్యుబంధన మృగయాదన సేవనేతి సోమ్మాదాః
హింస్రాః కుశిల్ప నిరతా శ్శరయోగే సంప్రసూతాస్యుః

7) శక్తియోగము :- సప్తమ కేంద్రము మొదలు నాలుగు రాశుల యందున్న గ్రహము లవిచ్ఛిన్నంబులయి యున్న శక్తియోగము.

ధనరహిత వికలదుఃఖిత నీ చాలసపేల వాయుషః పురుషాః
సంగ్రామ యుద్ధనిపుణాశ్శక్త్యాం జాతా స్థిరాస్సుభగాః

8) దండయోగము :- దశమ కేంద్రము మొదలు నాలుగు రాశులయందు గ్రహము లవిచ్ఛిన్నంబులయి యున్న దండయోగము.

హతపుత్ర దార నిస్స్వాస్సర్వ విహైర్న్యంకృతి స్వజన బాహ్యాః
దుఃఖిత నీచాః ప్రేష్యా దండప్రభవా నరాస్సతతమ్.

9) అర్థచంద్ర యోగము :- పణపరస్థానము మొదలుగాగాని, ఆపోక్లిమ స్థానము మొదలుగాగాని ఏడురాశులయందు గ్రహము లవిచ్ఛిన్నంబు లయియున్న అర్థచంద్ర యోగము.

సుభగాస్సేనాపతయః కాంత శరీరా నృపప్రియా బలినః
మణి కనక భూషణ యుతా భవంతి యోగేర్థ చంద్రాఖ్యే

10) గదా యోగము :- గ్రహములన్నియు సమీప మందున్న రెండు కేంద్రములను పొందిన గదాయోగము (అనగా 1, 4; 4, 7; 7, 10; 10, 1;)

సతతం మానార్థపరా యజ్వానః శాస్త్రయోగ కుశలాశ్చ
ధన కనక రత్న సంపత్సంయుక్తా మానవా గదాయాంతు

11) వజ్ర యోగము :- లగ్న సప్తమ కేంద్రములయందు శుభగ్రహము లుండి చతుర్థ దశమ కేంద్రములయందు పాప గ్రహములున్న వజ్ర యోగము.

రవికి చతుర్థ సప్తమములందు బుధశుక్రులు రారు గావున ఈ యోగమ సంభవము ఈ యోగము ఇతర మన్వంతరముల యందు చెప్పబడి నది కావున పూర్వ మన్వంతరముల యందిది సంభవము ప్రస్తుత మసంభవము.

12) యవ యోగము :- లగ్న సప్తమ కేంద్రముల పాప గ్రహములుండి చతుర్థ దశమ కేంద్రముల శుభగ్రహములున్న యవ యోగము.

వ్రతనియమ మంగళ పరాః వయసోమధ్యే సుఖార్థ సంయుక్తాః
దాతారః స్థిరవిత్తా యవయోగ భవాస్సదా పురుషాః

13) పద్మక యోగము :- నాలుగు కేంద్రములయందు (1; 4; 7; 10) మిశ్రమ గ్రహములున్న పద్మకయోగము. (కేంద్రదన్యత్ర గ్రహము లుండరాదు)

స్పీతయశ శోగుణాఢ్యః స్థిరాయుషో విపుల కీర్తయః కాంతాః
శుభయశసః వృ ధివీశా. కమల భవామానవా నిత్యమ్

14) వాపీయోగము :- పణపర రాశులగాని, ఆపోక్లిమ రాశులగాని గ్రహము లన్నియున్న వాపీ యోగము.

నిధికరణే నిపుణధియస్థిరార్థ స్సుఖసంయుతా స్సురూపాశ్చ
నయన సుఖసంప్రహృష్టా వాపీయోగే నరాజాతాః

15) శకటయోగము :- సర్వగ్రహములు 1; 7 స్థానములందున్న శకట యోగము.

రోగార్తాః కుకళత్రా మూర్ఖాః శకటాను జీవినో నిస్వాః
స్వజనైర్మిత్రైర్హీనా శ్శకటేజాతా భవంతినరాః

16) విహగయోగము :- సర్వ గ్రహములు 4, 10 స్థానములందున్న విహగ యోగము.

భ్రమణరు చయోనిక్రృష్టా దూతా స్సురతాను జీవినో దృష్టాః
కలహప్రియాశ్చ నిత్యం విహగే యోగే సదాజాతాః

17) హల యోగము :- సర్వగ్రహములు 2; 6; 10 ల గాని, 3; 7; 11 ల 4; 8; 12 ల గాని యున్న హలయోగము.

బహ్వశినో దరిద్రాః కృషీవకా దుఃఖితాశ్చ సోద్వేగాః
బంధు సుహృత్సంత్యక్తాః ప్రేష్యాహలసం జ్ఞితే పురుషాః

18) శృంగాటక యోగము :- గ్రహములు 1; 5; 9ల యందున్న శృంగాటక యోగము.

ప్రియకలహ సమర సాహస సుఖినోన్నృపతే ప్రియాస్సుభగ కాంతాః
ఆఢ్యాయువతి ద్వేష్యా శృంగాటక సంభవా మనుజాః

19) చక్ర యోగము :- గ్రహములన్నియు లగ్నము మొదలు రాశ్యంత గతులాయెనేని అనగా 1; 3; 5; 7; 9; 11 పొందిన చక్రయోగము.

ప్రణతి శేషనరాధిప కిరీట రత్నప్రభాచ్ఛు రితపాదః

భవతి నరేంద్రో మనుజయోశ్చకిర్ జాయతే యోగే

20) సముద్రయోగము :- గ్రహములన్నియు 2; 4; 6; 8; 10: 12 రాశుల పొందిన సముద్రయోగము.

బహుధనరత్నాః క్షితిపా యోగార్ధయుతా జనప్రియాశ్చాపి
ఉదధి సముత్థాః పురుషా స్థిర చిత్తాస్సత్వవంతశ్చ.

## * దళ యోగములు *

1) నలయోగము :- సర్వ గ్రహంబులు ద్విస్వభావ రాశులయందుండెనేని నల యోగము.

ఊనాతిరిక్త దేహా ధనసంచయభాగినోఽతి నిపుణాశ్చ
బంధు హితాశ్చ సురూపా నలయోగే సంప్రసూయంతే

2) ముసల యోగము ;- గ్రహము అన్నియు స్థిరరాశుల యందున్న ముసలయోగము.

మాన ధన జ్ఞానయుతాః కర్మోద్యుక్తా నృపప్రియాః ఖ్యాతాః
స్థిరచిత్తా ముసలోత్థా భవంతి శూరాస్సదా పురుషాః

3) రజ్జు యోగము !- గ్రహములన్నియు చరరాశుల యందున్న రజ్జు యోగము.

అటనప్రియా స్సురూపాః పరదేశేష్వర్థ భాగినో మనుజా
క్రూరాః ఖలస్వభావా. రజ్జు ప్రభవాస్సదా కదితాః

4) మాలా యోగము :- చంద్రవ్యతిరిక్త శుభగ్రహములు మూడు కేంద్రములయందుండి పాపగ్రహములు ఇతర రాశులయందున్న మాలా యోగము

నిత్యం సుఖప్రదానావాహన వస్త్రార్థ భోగసంపన్నాః
కాంతాస్స్న బహు స్త్రీకా మాలాయాం సంప్రసూతాస్స్యుః

5) సర్పయోగము !- మూడు కేంద్రములయందు పాప గ్రహములగు రవి, కుజ శనులుండినేని.

విషమాః క్రూరానిః స్వానిత్యం దుఃఖార్దితా స్సుదీనాశ్చ
పరభుక్తా. పానరతా స్సర్పే జాతా భవంతి నరాః

## ❋ సంఖ్యా యోగములు ❋

1) గోళ యోగము :- సూర్యాది సప్త గ్రహంబులు ద్వాదశ రాశులలో నెచటనైన నొకరాశి యందున్న గోళయోగము.

దారిద్ర్యాల వ్యయుతా విద్యాజ్ఞా, మానవర్జితా మలినాః
నిత్యం దుఃఖిత దీనా గోళయోగే భవంతి నరాః

2) యుగయోగము :- రెండు రాశులందు సప్త గ్రహములున్న యుగ యోగము.

పాషండ భాగినోవా ధనరహితావా బహిష్కృతా లోకే
సుతమాన ధర్మరహితా యుగయోగే మానవా జాతా

3) శూలయోగము :- సమస్త గ్రహములు మూడు రాశులందున్న శూల యోగము.

తీక్ష్ణాలస ధనరహితా హింసాస్సు బహిష్కృతా మహాశూరాః
సంగ్రామ లబ్ధ శబ్దా శ్శూలే రౌద్రాః ప్రజాయంతే

4) కేదార యోగము :- సమస్త గ్రహములు నాల్గురాశులందున్న కేదార యోగము.

సుబహూనా ముపయోజ్యాః కృషీవలాస్సత్య వాదిన స్సుఖితాః
కేదారేస్సం భూతాశ్చ లబ్ధభావా ధనైర్యుక్తా

5) పాశయోగము :- ఐదురాశుల యందు సప్త గ్రహములున్న పాశ యోగము.

పాశే బంధన భాజః కార్యోదుక్తాః ప్రపంచ కారాశ్చ
బహుభాషిణో విశీలా బహుభృత్యా స్సప్రసూతాస్స్యుః

6) దామనీ యోగము :- సప్త గ్రహములు ఆరు రాశులందున్న దామనీ యోగము.

దామిన్యా ముపకారీ పశుగణయుక్తో ధనేశ్వరో మూఢః
బహు సుతరత్న సమృద్ధో ధీరోవిద్వాన్ ప్రజాతస్యాత్

7) వీణా యోగము :- ఏడు గ్రహములు ఏడు రాశుల యందున్న వీణా యోగము.

మిత్రాన్వితా స్సువచస శ్శాస్త్ర పరాగేయ వాద్యనిరతాశ్చ
సుఖభాజో బహుభృత్యా వీణాయాం కీర్తితా మనజాః ॥

# ❋ తారాబలము - చంద్రబలము ❋

జన్మ నక్షత్రము లగాయితు —

— ఏ గ్రహమయినను జన, సంపత్, క్షేమ, సాధన, మిత్ర అను ఈ ఐదు విధములయిన తారల యందున్నచో, ఆ గ్రహము శుభ ఫలితముల నీయగలదు.

— పరమమిత్ర తారయందున్న గ్రహము అద్భుత ఫలితములనీయగలదు

— ఏ గ్రహమయినను, విపత్, ప్రత్యక్ (ప్రత్యరి), నైధన తారల యందుండునో, ఆ గ్రహము శత్రుపాప గ్రహముల ఫలితముల నీయగలదు

— ఏ గ్రహము తన స్వరాశిని చూచుచున్నదో ఆగ్రహము శుభఫలితముల నిచ్చును.

— శుభకర్తరీ యోగమునందున్న గ్రహమును, ఉచ్ఛ, నీచలకు మధ్య నున్న గ్రహము (ఆరోహి, ఉచ్ఛాభిలాషి) శుభ ఫలితముల నీయగలరు

| నవతారలు | అధిపతి | ఫలము | వాహనము | ఫలము | శాంతి | |
|---|---|---|---|---|---|---|
| జన్మ | రవి | తాపము | నెమలి | మనస్తాప | శాకము | 7 ఘు |
| సంపత్ | బుధ | ద్రవ్య లాభము | గుర్రము | ద్రవ్యలాభ | లేదు | |
| విపత్ | రాహు | శాంతి ధైర్యనాశం | మేషము | కలహ | గుడము | 3 ఘు |
| క్షేమ | గురు | ధైర్యం | గజము | రాజ్యప్రాప్తి | లేదు | |
| ప్రత్యక్ | కేతు | లయము (మరణము) | కాకము | కార్యహాని | లవణం | 8 ఘు |
| సాధన | చంద్ర | కీర్తి యశస్సు | జంబుక | సుఖము | లేదు | |
| నైధన | శని | మరణము (ప్రయోజనశూన్య) | సింహ | రణము | సువర్ణం నువ్వులు | 8 ఘు |

| | | | | |
|---|---|---|---|---|
| మిత్ర | శుక్ర | సంతోషం గరుడు | సుఖము | లేదు |
| పరమ మైత్రి | కుజ | మరణము హంస | ప్రయోజన శూన్యము | లేదు |

## • తారాబల నిరూపణ చక్రము •

| జన్మతారలు - అధిపతులు | జన్మ 1 | సంపత్ 2 | విపత్ 3 | క్షేమ 4 | ప్రత్యక్ 5 | సాధన 6 | నైధన 7 | మిత్ర 8 | పరమ 9 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| కేతు | అశ్వ | భర | కృత్తి | రోహి | మృగ | ఆరు | పున | పుష్య | ఆశ్రే |
| | మఖ | పుబ్బ | ఉత్త | హస్త | చిత్త | స్వాతి | విశా | అనూ | జ్యేష్ఠ |
| | మూల | పూ.షా | ఉ.షా | శ్రవ | ధని | శత | పూ.భా | ఉ.భా | రేవ |
| శుక్ర | భర | కృత్తి | రోహి | మృగ | ఆరు | పున | పుష్య | ఆశ్రే | మఖ |
| | పుబ్బ | ఉత్త | హస్త | చిత్త | స్వాతి | విశా | అనూ | జ్యేష్ఠ | మూల |
| | పూ.షా | ఉ.షా | శ్రవ | ధని | శత | పూ.భా | ఉ.భా | రేవ | అశ్వ |
| రవి | కృత్తి | రోహి | మృగ | ఆరు | పున | పుష్య | ఆశ్రే | మఖ | పుబ్బ |
| | ఉత్త | హస్త | చిత్త | స్వాతి | విశా | అనూ | జ్యేష్ఠ | మూల | పూ.షా |
| | ఉ.షా | శ్రవ | ధని | శత | పూ.భా | ఉ.భా | రేవ | అశ్వ | భర |
| చంద్ర | రోహి | మృగ | ఆరు | పున | పుష్య | ఆశ్రే | మఖ | పుబ్బ | ఉత్త |
| | హస్త | చిత్త | స్వాతి | విశా | అనూ | జ్యేష్ఠ | మూల | పూ.షా | ఉ.షా |
| | శ్రవ | ధని | శత | పూ.భా | ఉ.భా | రేవ | అశ్వ | భర | కృత్తి |
| కుజ | మృగ | ఆరు | పున | పుష్య | ఆశ్రే | మఖ | పుబ్బ | ఉత్త | హస్త |
| | చిత్త | స్వాతి | విశా | అనూ | జ్యేష్ఠ | మూల | పూ.షా | ఉ.షా | శ్రవ |
| | ధని | శత | పూ.భా | ఉ.భా | రేవ | అశ్వ | భర | కృత్తి | రోహి |
| రాహు | ఆరు | పున | పుష్య | ఆశ్రే | మఖ | పుబ్బ | ఉత్త | హస్త | చిత్త |
| | స్వాతి | విశా | అనూ | జ్యేష్ఠ | మూల | పూ.ష | ఉ.షా | శ్రవ | ధని |
| | శత | పూ.భా | ఉ.భా | రేవ | అశ్వ | భర | కృత్తి | రోహి | మృగ |
| గురు | పున | పుష్య | ఆశ్రే | మఖ | పుబ్బ | ఉత | హస్త | చిత్త | స్వాతి |
| | విశా | అనూ | జ్యేష్ఠ | మూల | పూ.షా | ఉ.షా | శ్రవ | ధని | శత |
| | పూ.భా | ఉ.భా | రేవ | అశ్వ | భర | కృతి | రోహి | మృగ | ఆరు |

| | జన్మ | సంపత | విపత | క్షేమ | ప్రత్యక్ | సాధన | నైధన | మిత్ర | పరమ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| [illegible] | పుష్య | ఆశ్రే | మఖ | పుబ్బ | ఉత్త | హస్త | చిత్త | స్వాతి | విశా |
| | అనూ | జ్యేష్ట | మూల | పూ.షా | ఉ.షా | శ్రవ | ధని | శత | పూ.భా |
| | ఉ.భా | | అశ్వ | భర | కృత్తి | రోహి | మృగ | ఆరు | పున |
| [illegible] | ఆశ్రే | మఖ | పుబ్బ | ఉత | హస్త | చిత్త | స్వాతి | విశా | అనూ |
| | జ్యేష్ట | మూల | పూ షా | ఉ.షా | శ్రవ | దని | శత | పూ.భా | ఉ భా |
| | రేవ | అశ్వ | భర | కృతి | రోహి | మృగ | ఆరు | పున | పుష్య |

## ❋ తారాబలము – విశేష విధి ❋

ప్రథమ నవకమున

2. సంపత్తార 4. క్షేమతార 6. సాధనతార 8. మిత్రతార
9. పరమ మైత్రతారలు శుభము.

ద్వితీయ నవకమున

2. సంపత్తార 6. సాధన తారలు మాత్రము శుభము
4–8–9 తారలు పూర్తి నింద్యములు

తృతీయ నవకమున

2. సంపత్తార 6. సాధనతార 8. మిత్రతారలు మాత్రము శుభము 4-9 తారలు మిక్కిలి నింద్యములు

అనగా జన్మ నక్షత్రము నుండి 13 - 17 - 18 - 22 - 27 నక్షములు నింద్యములు.

పుష్యమి–ఆశ్రేష–మఘ–చిత్త–మూల–ధనిష్ట–శతభిషము అను ఏడు నక్షత్రములకు జన్మతార శుభముకాదు. మిగిలినవారికి జన్మతార శుభము

సకలాధికారము – 248 పేజి

చంద్రుడు వృషభ–కర్కాటక; మూల నక్షత్రముల యందున్నచో విపత్తార ప్రత్యక్తారలు శుభఫలితము నిచ్చును. గృహవాస్తుదర్పణము 34–34 పే

## ❋ రాసులకు స్థిర చరాది సంజ్ఞలు - పురుషాంగములు ❋

| రాసి | పాదములు | చరాదులు | కాల పురుషాంగములు | ప్లవసంజ్ఞ | దూరములు | కాల |
|---|---|---|---|---|---|---|
| మేషము | | చర | శిరస్సు | దక్షిణ | 20 | రాత్రి |
| వృషభము | చతుష్పద | స్థిర | ముఖము | అగ్నేయ | 24 | రాత్రి |
| మిధునము | ద్విపాద | ద్విస్వభావ | రొమ్ము | ఉత్తర | 28 | సంధ్యా |
| కర్కాటకము | అనేక పాదకీట | చర | హృదయం | వాయువ్య | 32 | రాత్రి |
| సింహము | చతుష్పద | స్థిర | కడుపు | తూర్పు | 36 | దివా |
| కన్య | ద్విపాద | ద్విస్వభా | కటిప్రదేశము | ఉత్తర | 40 | ,, |
| తుల | ద్విపాద | చర | నాభి-లింగ మధ్యప్రదేశము | ఆగ్నేయ | 40 | ,, |
| వృశ్చికము | అనేకపాద కీటక | స్థిర | పురుష జనన అంగము | దక్షిణ | 36 | ,, |
| ధనుస్సు | ద్విపాద చతుష్పద 2 | ద్విస్వభా | రెండుతొడలు | ఈశాన్య | 32 | రాత్రి |
| మకరము | చతుష్ప 1 | చర | 2 మోకాళ్ళు | పశ్చిమ | 28 | రాత్రి |
| కుంభము | ద్విపాద | స్థిర | రెండుపిక్కలు | పశ్చిమ | 24 | దివా |
| మీనము | అనేక పాదకీటక | ద్విస్వభా | ,, పాదములు | ఈశాన్య | 20 | సంధ్యా |



# ❋ రాసుల వివరములు తెలియజేయు పట్టిక ❋

| రాసి | లింగము | అకృతి | రంగు | కులము | స్థలము | పంచభూత | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషము | పురుష | కురుచ | ఎరుపు | క్షత్రియ | అడవి | అగ్నితత్వ | తూర్పు | పృష్ఠోదయ | క్రూర | బేసి |
| వృషభ | స్త్రీ | వంకర కురూపి | తెలుపు | శూద్ర | పచ్చికపొలం మైదానము | భూతత్వ | తూర్పు | పృష్ఠోదయ | సౌమ్య | సరి |
| మిధున | పురుష | పొడవు | అకుపచ్చ | వైశ్య | పడక గది గ్రామం,పల్లె | వాయుతత్వ | అగ్నేయ | ఉభయో | క్రూర | బేసి |
| కర్కాట | స్త్రీ | పొడవు | గులాబిరంగు (పొటల) | బ్రాహ్మణ | నీటిగుంట వలపునేల | జలతత్వ | దక్షిణ | పృష్ఠోదయ | సౌమ్య | సరి |
| సింహ | పురుష | పొడవు-పొట్టి లకు మధ్య | గోదుమ (నీరుకావి) | క్షత్రియ | కొండగుహ | అగ్నితత్వ | దక్షిణ | శీర్షోదయ | క్రూర | బేసి |
| కన్య | స్త్రీ | పొడవునకు పొట్టికిమధ్య | చిత్రవర్ణం కరబూజు | శూద్ర | పొలం,కూరలు నీటితో కూడిన పొలము | భూతత్వ | నైఋతి | ,, | సౌమ్య | సరి |
| తుల | పురుష | పొడవునకు పొట్టికిమధ్య | (నీలం)అనేక రంగులమిశ్రమం | వైశ్య | విపణవీధి | వాయుతత్వ | పడమర | ,, | క్రూర | బేసి |

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వృశ్చిక | స్త్రీ | పొడవునకు పొట్టికి మధ్య | బంగారు | బ్రాహ్మణ | కన్నము | జలతత్వ | పడమర | ,, | సౌమ్య | సరి |
| ధనుస్సు | పురుష | పొడవు | (కపిల) బంగారు | క్షత్రియ | యుద్ధభూమి | అగ్నితత్వ | వాయవ్య | పృష్ఠోదయ | క్రూర | బేసి |
| మకరము | స్త్రీ | పొడవు | (కపిల) పసుపువచ్చ | శూద్ర | నీటితోకూడిన అడవిభూమి | భూతత్వ | ఉత్తర | ,, | సౌమ్య | సరి |
| కుంభము | పురుష | వంకర కురూపి | రంగులమిశ్రమం నలుపు + తెలుపు | వైశ్య | శిల్పశాలలు కుమ్మరిశాలలు | వాయుతత్వ (భూతత్వ) | ,, | శీరోదయ | క్రూర | బేసి |
| మీనము | స్త్రీ | కురుచ | స్వచ్ఛ ముదురు నీరుకావి (గోధుమ) | బ్రాహ్మ | నీరుకల ప్రదేశ భూమి, నీరు | జలత్వ | ఈశాన్య | ఉభయోదయ | సౌమ్య | సరి |



# రాసులకు - స్వక్షేత్ర - ఉచ్ఛక్షేత్ర - నీచ క్షేత్రము మొదలగు వివరము తెలియ జేయు పట్టిక

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రాశి పేరు | మేష | వృష | మిదున | కర్కాట | సింహ | కన్య | తుల | వృశ్చి | ధన | మకర | కుంభ | మీన |
| అదిపతి | కుజ | శుక్ర | బుధ | చంద్ర | రవి | బుధ | శుక్ర | కుజ | గురు | శని | శని | గురు |
| ఉచ్ఛ | రవి | చంద్ర | రాహు | గురు | | బుధ రాహు | శని | | కేతు | కుజ | | శుక్ర కేతు |
| నీచ | శని | | కేతు | కుజ | | శుక్ర కేతు | రవి | చంద్ర | రాహు | గురు | | బుధ రాహు |
| 5 ఆధిపత్య స్వస్థానము | రవి | గురు | కుజ | చంద్ర | గురు | కేతు | శుక్ర బుధ | కుజ శని | గురు | శని | గురు | రాహు |
| 6 శుభగ్రహము | కుజ | చంద్ర | బుధ | చంద్ర | రవి | రాహు | శుక్ర | చంద్ర | గురు | శని | గురు | కేతు |
| 7 గ్రహప్రభావం శుభఫలితము | కుజ | రాహు కేతు | శని | చంద్ర | గురు రవి | బుధ కేతు | శుక్ర | కుజ | గురు | శని | గురు శని | రాహు |
| 8 ప్రభావము రాశిఫలితము (బాధక) | రాహు | | శని | కుజ శుక్ర కేతు | | శని | రవి గురు రాహు | | శని | కేతు బుధ | | బుధ |

# * గ్రహములు *

## నైసర్గిక మిత్ర, శత్రు, సమత్వములు

| గ్రహం | మిత్రులు | శత్రులు | సములు |
|---|---|---|---|
| రవి | గురు, కుజ, చంద్ర | శుక్ర, శని రాహు, కేతు | బుధ |
| చంద్ర | రవి, బుధ | (రాహు, కేతు) | శుక్ర, శని, కుజ గురు |
| కుజ | రవి, చంద్ర, గురు | బుధ (కేతు) | శుక్ర, శని, రాహు |
| బుధ | రవి, శుక్ర, రాహు | చంద్ర | శని, (కేతు) కుజ, గురు |
| శుక్ర | శని, బుధ (కేతు) | రవి, చంద్ర (రాహు) | కుజ, గురు |
| గురు | రవి, కుజ, చంద్ర | శుక్ర, బుధ | (రాహు, కేతు) శని |
| శని | బుధ, శుక్ర (రాహు) | రవి. చంద్ర కుజ | (కేతు) గురు |
| రాహు | బుధ, శని, (కేతు) | రవి, శుక్ర కుజ | గురు, చంద్ర |
| కేతు | శుక్ర (రాహు) | చంద్ర, కుజ | గురు, శని బుధ, రవి |



# ❋ గ్రహములకు గుణ కర్మాదులను తెలియజేయు చక్రము ❋

| గ్రహం | లింగ | జాతి | రంగు | గుణ | దిక్కు | శుభపాప | ఋతు | రాజాద్లు | దేవత | రత్నం | లోహం | రుచి | వయసు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రవి | పు | క్షత్రి | ముదురు ఎరుపు | రజో (సాత్వి) | తూ | పాపి | గ్రీష్మ | రాజు | (శివ) రుద్ర | మాణిక్య | రాగి | కారము | (30) 50 |
| చంద్ర | స్త్రీ | వైశ్య క్షత్రి | తెలుపు | సాత్వి | వాయు | పూర్ణచంద్రు శుభుడు క్షీణచంద్రపాపి | వర్ష | రాణి | పార్వతి | ముత్యం | కంచు | ఉప్పు | 70 |
| కుజ | పు | క్షత్ర | కుంకుమ ఎరుపు | తమ | దక్షి | పాపి | గ్రీష్మ | సేనాధి | కార్తికేయ (గణపతి) | పగడం | రాగి | చేదు | (4) |
| బుధ | నపుం | (సంకర) వైశ్య | పచ్చ | రజో | ఉత్త | శుభులతో శుభుడు పాపిలతో పాపి | శరత్ | యువ | విష్ణు | పచ్చ | సీసం | మిశ్రమ | 20 |
| శుక్ర | స్త్రీ | బ్రాహ్మ | తెలుపు | రజో | ఆగ్నే | శుభ | వసంత | మంత్రి | లక్ష్మి | వజ్రము | వెండి | పులుపు | 16 |
| గురు | పు | బ్రాహ్మ | బంగారు రంగు | సాత్వి | ఈశా | శుభ | హేమంత ప్రారంభం | మంత్రి | బ్రహ్మ శివ | పుష్యరాగ | బంగారు | తీపి | 30 |
| శని | నపుం | శూద్ర | ఆకాశపు రంగు | తమ | పశ్చి | పాపి | హేమంత పూర్తి | సేవక | యమ రుద్ర | నీలము | ఇనుము స్టీలు | వగరు | 80 |
| రాహు | స్త్రీ | ఛండాల నిషాధ | ముదురు తేనెరంగు | తమ | నైఋ | పాపి | | సేవక | కార్తికేయ దుర్గ | గోమేధ | సీసము | | 80 |
| కేతు | నపుంస | ఛండాల నిషాద | గోధుమ రంగు | తమ | నైఋ | పాపి | | సేవక | దుర్గ బ్రహ్మ | వైడూర్య (పిల్లికన్ను) | సీసము | | [illegible] |

| | పంచభూ ములు | ఇంద్రి యము | జంతువు | కాలము | లక్షణం | | కిర ణము | ధాన్య ములు | సమి ధులు | దాతు | ప్రకృతి | చరము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 రవి | అగ్ని | దృష్టి (కనులు) | చతుష్పద | 6 నెలలు | శాకము మూల | ఎముకలు ధాతువులు | 5 | గోధుమలు | జిల్లేడు | స్వర్ణ | పిత్త | వనచరి |
| 2 చంద్ర | జల | రుచి (నాలుక) | పాద రహిత | రెండు ఘ॥ (48 ని॥లు) | రూప్య ధాతు | రక్తము | 21 | బియ్యము | మోదుగ | ధాతు | కఫము | జలచరి |
| 3 కుజ | అగ్ని | దృష్టి (కనులు) | చతుష్పద | 60 ఘ॥లు 1 రోజు | పగడ ధాతు | మూలుగు | 5 | కందులు | చంద్ర | ధాతు | పిత్తము | వనచరి |
| 4 బుధ | భూమి | వాసన (ముక్కు) | ద్విపాద | రెండు నెలలు | జీవ | చర్మము | 6 | పెసలు | ఉత్తరేణి | స్వర్ణ | త్రిదోషి | శ్మశానచరి |
| 5 శుక్ర | వాయు | శబ్దము (చెవి) | ద్విపాద | పక్షము 15 రో॥లు | మూల శాకము | మజ్జ | 8 | బొబ్బర్లు | అత్తి | రూప్య | కఫము | జలచరి |
| 6 గురు | జల | రుచి (నాలుక) | ద్విపాద | 1 నెల 30 రో॥లు | జీవ | క్రొవ్వు | 7 | (శనగ) సెనగ | రావి | రత్న | ద్విదోష | గ్రామచరి |
| 7 శని | ఆకాశ | స్పర్శ | చతుష్పద | 1 సంవ॥ | ధాతు | కండరం | 5 | నువ్వులు | జమ్మి | లోహ | ధాతునమ | వనచరి |
| 8 రాహు | | స్పర్శ | పాదరహిత | సం॥ము | ధాతు | రెండు చేతలు | | మినుములు | గరిక | | | |
| 9 కేతు | | స్పర్శ | పాదరహిత | సం॥ము | ధాతు | రెండు కాళ్ళు | | ఉలవలు | దర్భ | | | |

| | కాల బల | స్థానములు | వస్త్ర బలము | వేదము | | బలము అయిన | మానసిక స్థితి | అవయవము | పొడవు పొట్టి | కాలపుర్ష ఆత్మాదులు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 రవి | మధ్యాహ్న దినబలము | దేవస్థానం | దళసరివస్త్ర | | పితృదేవ | ఉత్తరాయణ | స్థిరుడు | శిరస్సు అవయవ | (మధ్యమ) పొడవుగాని పొట్టి | ఆత్మ |
| 2 చంద్ర | రాత్రిబలి శుక్లపక్ష | గ్రామ సమీపభూమి | చిరిగిన వస్త్రము | | మనుష్యులు | దక్షిణాయన | చపల | ముఖము | పొట్టి | మనస్సు |
| 3 కుజ | రాత్రిబల కృష్ణపక్ష | అగ్ని సమీపభూమి | కాలిన వస్త్రము | సామవేద | పితృదేవత | ఉత్తరాయణ | సమర్థ | హృదయం | పొట్టి | బలము |
| 4 బుధ | సర్వ కాలము | క్రీడాప్రదేశ | తడిపిన వస్త్రము | అధర్వ వేద | తిర్యగ్జంతువులు | అయన ద్వయణ స్వవర్గమునందు | చపల | తొడలు | పొడవు | వాక్కు |
| 5 శుక్ర | రాత్రిబల శుక్లపక్ష | శయన గృహము | దృఢ వస్త్రము | యజుర్వేద | మనుష్య | ఉత్తరాయణ | కామాసక్త | మర్మావయవములు | మధ్యమ పొడవు | మన్మధుడు |
| 6 గురు | పగలు | ధనగృహము | మధ్య వస్త్రము | ఋగ్వేదము | దేవతలు | ఉత్తరాయణ | కార్యాసక్త | పొట్ట | పొడవు | జ్ఞానము సుఖము |
| 7 శని | రాత్రిబల సంధ్యా | భూపరాగం ధూళి | జీర్ణ వస్త్రము | | నరక వాసులు | దక్షిణాయణ | స్థిర | వెంట్రుకలు | పొట్టి | దుఃఖము |
| 8 రాహు | సంధ్యా | పాడుపడిన చికటిభూమి | | | | | | | పొడవు | |
| 9 కేతు | సంధ్యా | చీకటిభూమి | | | | | | | పొడవు | |

## తిధి-ధృవ-కరణములు

## అధిపతి - తిధులందు విడచు కాలము

| | తిధి | ధృవము | కరణములు ప్రధమం 1 | ద్వితీయం 2 | | తిధిప్రారంభమునుండి విడువదగిన కాలము పక్ష ఛిద్రములు గం॥లో | పక్ష ఛి॥లు ఘ॥లో |
|---|---|---|---|---|---|---|---|
| 1 | పాడ్యమి | 12 | కింస్తుఘ్న | బవ | శుక్రుడు | | |
| 2 | విదియ | 24 | బాలవ | కౌలవ | బుధుడు | | |
| 3 | తదియ | 36 | తైతుల | గరజ | కుజుడు | | |
| 4 | చవితి | 48 | వణజ | భద్ర | శని | 3-12 | 8 |
| 5 | పంచమి | 60 | బవ | బాలవ | గురుడు | | |
| 6 | షష్ఠి | 72 | కౌలవ | తైతుల | శుక్రుడు | 3-36 | 9 |
| 7 | సప్తమి | 84 | గరజ | వణజ | బుధుడు | | |
| 8 | అష్టమి | 96 | భద్ర | బవ | కుజుడు | 5-36 | 14 |
| 9 | నవమి | 108 | బాలవ | కౌలవ | శని | 10-00 | 25 |
| 10 | దశమి | 120 | తైతుల | గరజ | గురుడు | | |
| 11 | ఏకాదశి | 132 | వణిజ | భద్ర | శుక్రుడు | | |
| 12 | ద్వాదశి | 144 | బవ | బాలవ | బుధుడు | 4-00 | 10 |
| 13 | త్రయోదశి | 156 | కౌలవ | తైతుల | కుజుడు | | |
| 14 | చతుర్దశి | 168 | గరజ | వణజ | శని | 2-00 | 5 |
| 15 | పూర్ణిమ | 180 | భద్ర | బవ | గురుడు | | |
| 16 | బ॥పాడ్యమి | 192 | బాలవ | కౌలవ | శుక్రుడు | | |
| 17 | విదియ | 204 | తైతుల | గరజ | బుధుడు | | |
| 18 | తదియ | 216 | వణిజ | భద్ర | కుజుడు | | |
| 19 | చవితి | 228 | బవ | బాలవ | శని | 3-12 | 8 |
| 20 | పంచమి | 240 | కౌలవ | తైతుల | గురుడు | | |
| 21 | షష్ఠి | 252 | గరజ | వణజ | శుక్రుడు | 3-36 | 9 |
| 22 | సప్తమి | 264 | భద్ర | బవ | బుధుడు | | |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 23 | అష్టమి | 276 | బాలవ | కౌలవ | కుజుడు | 5-36 | 14 |
| 24 | నవమి | 288 | తైతుల | గరజ | శని | 10-00 | 25 |
| 25 | దశమి | 300 | వణిజ | భద్ర | గురుడు | | |
| 26 | ఏకాదశి | 3.2 | బవ | బాలవ | శుక్రుడు | | |
| 27 | ద్వాదశి | 324 | కౌలవ | తైతుల | బుధుడు | 4-00 | 10 |
| 28 | త్రయోదశి | 336 | గరజ | వణజ | కుజుడు | | |
| 29 | చతర్ధశి | 348 | భద్ర | శకుని | శని | 2-00 | 5 |
| 30 | అమావాస్య | 360 | చతుష్పాత్ | నాగవము | గురుడు | | |

## ❋ పంచక రహితము ❋

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | మృత్యు పంచకము | 1 | 10 | 19 | 28 | 37 | 46 | 55 |
| 2 | అగ్ని పంచకము | 2 | 11 | 20 | 29 | 38 | 47 | 56 |
| 3 | రహితము | 3 | 12 | 21 | 30 | 39 | 48 | 57 |
| 4 | రాజ పంచకము | 4 | 13 | 22 | 31 | 40 | 49 | 58 |
| 5 | రహితము | 5 | 14 | 23 | 32 | 41 | 50 | 59 |
| 6 | చోర పంచకము | 6 | 15 | 24 | 33 | 42 | 51 | 60 |
| 7 | రహితము | 7 | 16 | 25 | 34 | 43 | 52 | 61 |
| 8 | రోగ పంచకము | 8 | 17 | 26 | 35 | 44 | 53 | |
| 9 | రహితము | 9 | 18 | 27 | 36 | 45 | 54 | |

పక్షాది తిధిని ఆదివారాది వారమును తత్కాల నక్షత్ర తత్కాల లగ్న సంఖ్యలను కలపి 3చే భాగించగా

1. మృత్యుపంచకము ; ఏ ముహూర్తమునకు ఉపయోగింపరాదు.

3 అగ్ని పంచకము : ఇది గృహారంభ ప్రవేశము, వివాహమునకు నిషిద్ధం

4 రాజ పంచకము : ఉద్యోగప్రవేశము, ప్రభు దర్శనమునకు నిషిద్ధము.

6. చోర పంచకము : గృహప్రవేశ ఆరంభాదులకు నిషిద్ధము.

8. రోగ పంచకము : ఇదియు దేనికి పనికి రాదు

3-5-7-9 శేషించిన శుభము. పైన వివరించిన పట్టికలో తిధి వార

నక్షత్ర లగ్న సంఖ్యలను కలపిన 1, 2, 4, 6, 8 వరుసలలో గల అంకెలు వచ్చిన రహితము కాదనియు 3, 5, 7, 9 వరుసలలోని అంకెలు వచ్చిన రహితమయినదనియును గ్రహించవలయును.

## ❀ సూక్ష్మ నక్షత్ర అంత్యభాగలను వివరించు పట్టిక ❀

అశ్వని 0-13-10-35; భరణి 0-19-45-52-30; కృత్తిక 1-02 56-27-30; రోహిణి 1-22-42-20; మృగశిర 2-05-52-55; ఆరుద్ర 2-12-28-12-30; పునర్వ 3-02-14-05; పుష్యమి 3-15-24-40; అశ్లేష 3-21-59-57-30; మఘ 4-05-10-22-30; పూ ఫల్గుని 4-18-21-07-30; ఉ. ఫల్గుని 5-08-07-00; హస్త 5-21-17-35; చిత్త 6-04-28-10; స్వాతి 6-11-03-27; విశాఖ 7-00-49-20; అనూ 7-13-59 55; జ్యేష్ట 7-20-35-12-30; మూల 8 03-45-47-30; పూ షాఢ 8-16-56-22-30; ఉషాఢ 9-06-42 15-00: అభిజత్ 9-10-56-30; శ్రవణం 9-24-07-05; ధని 10-07-17-40; శత 10-13-52-57-30; పూ. భాద్ర 10-27-03-32-30; ఉభాద్ర 11-16-49-25; రేవతి 0-00-00-000

సూక్ష్మ నక్షత్రమునందు హారము చంద్ర మధ్య భుక్తి 790-35 లిప్తలు, స్థూల నక్షత్రమునందు హారము 800 లిప్తలు నక్షత్రములు కొన్ని అర్థ భోగములు, కొన్ని పూర్ణ భోగములు మరికొన్ని అధ్యర్థ భోగములని మూడు విధములు.

ఆశ్లేష, ఆర్ద్రా, స్వాతి, భరణి. జ్యేష్టా, శతభిషము అను ఆరును అర్థ భోగములు 395-18 (1/2)

విశాఖ, పునర్వసు, రోహిణి, ఉత్తర ఫల్గుని, ఉత్తరాషాడ, ఉత్తరాభాద్ర ఈ ఆరును అధ్యర్థ భోగములు 1185-52 (1 1/2)

అశ్వని, కృత్తిక: మృగశిర, పుష్యమి, మఘ, పూర్వఫల్గుని, హస్త, చిత్త, అనూరాధ, మూల, పూర్వాషాడ, శ్రవణము, శ్రవణము. ధనిష్ఠ, పూ. భాద్ర, రేవతి అను ఈ పదునైదు నక్షత్రములు పూర్ణభోగములు అభిజి నక్షత్ర భోగము 254-5 లిప్తలు. పూర్ణ భోగమనగా 790-35.

పై విధమయిన నక్షత్ర ప్రమాణము చంద్రునకు మాత్రమేగాక అన్ని గ్రహములకు చేయవలయును. కొన్ని నక్షత్రములు మిక్కిలి దగ్గరగను

కొన్ని ఎక్కువ దూరముగను ఉన్నందువలన ఈ విధమగు గణితము అవశ్యకము పై విధముగ గణించనిచో అభిజన్నక్షత్రమునకు స్థితి లేదు. యోని పొంతనము గణితాయుష్య పొంతనము, గోత్ర పొంతనము, వృషభచక్రము ప్రయాణ, నక్షత్ర భోజననిర్ణయము నందు అభిజిత్తునకు చాల ఉపయోగము కలదు.

# నక్షత్రముల వివరములు

| | ప్రకాశ పరిమాణం | కాంతివత్సరాల దూరము | పాశ్చాత్య నామం | గ్రీకు సంజ్ఞ | మండలం |
|---|---|---|---|---|---|
| అశ్వని | 2-72 | 52 | షెటారన్ | బీటా | మేషము |
| భరణి | 3 68 | — | — | 41 | ,, |
| కృత్తిక | 2-96 | 1400 | అల్సియోన్ | ఈటా | వృషభము |
| రోహిణి | 0-85 | 68 | అల్టిబరాన్ | ఆల్ఫా | ,, |
| మృగశిర | 3-66 | — | — | లాంబ్డా | ఒరియన్ |
| ఆరుద్ర | 0-40 | 587 | బీటర్ జూస్ | ఆల్ఫా | ,, |
| పునర్వసు | 1-20 | 35 | పోలక్స్ | బీటా | మిధునం |
| పుష్యమి | 4-17 | — | — | డెల్టా | కర్కాటం |
| ఆశ్లేష | 3-48 | .... | ... | జీటా | హైడ్రా |
| మఖ | 1-30 | 80 | రెగ్యులస్ | ఆల్ఫా | సింహము |
| పూ ఫల్గుని | 2-58 | | జోస్మా | డెల్టా | ,, |
| ఉ ఫల్గుని | 2-53 | 43 | డెనెబోలా | బీటా | ,, |
| హస్త | 3-11 | — | — | డెల్టా | వాయసం |
| చిత్త | 0-9 | 220 | స్పైకా | ఆల్ఫా | కన్య |
| స్వాతి | 0-06 | 36 | ఆర్క్టురస్ | ఆల్ఫా | భూతేశ |
| విశాఖ | 2-90 | — | జుబెన్ఎల్గెనూబి | ఆల్ఫా | తుల |
| అనూరాధ | 2-54 | 600 | — | డెల్టా | వృశ్చిక |
| జ్యేష్ట | 0-90 | 520 | అంటెరిస్ | ఆల్ఫా | ,, |
| మూల | 1.71 | | షఖవులా | లాంబ్డా | ,, |
| పూర్వాషాడ | 1.81 | 124 | ,, | ఎప్సిలాన్ | ధనుస్సు |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉత్తరాషాఢ | 2.12 | 300 | నుంకి | సిగ్మా | ,, |
| శ్రవణము | ౮.9 | 16 | ఆల్టేర్ | ఆల్ఫా | గరుడ |
| ధనిష్ఠ | 3 86 | – | స్వాలోసిస్ | ఆల్ఫా | డెల్ఫినస్ |
| శతభిషము | 3.84 | .... | ... | లాంబ్డా | కుంభం |
| పూర్వాభాద్ర | 2 ౬0 | 110 | మార్కాబ్ | ఆల్ఫా | పెగాసస్ |
| ఉత్తరాభాద్ర | 2.15 | 98 | ఆల్ఫెరా | ఆల్ఫా | ఆండ్రోమెడా |
| రేవతి | ౬ 57 | .... | .... | జీటా | మీనం |

## ❋ ఇంగ్లీషు తారీకునకు వారమును తెలిసికొనుట ❋

క్రీస్తుశక సంవత్సరముల యందు వందలను విడచి మిగిలిన సంఖ్యను అనగా 1989 యందు 19 విడచి మిగిలిన 89 ని 4 చేత భాగించి వచ్చిన లబ్ధమును సంవత్సర సంఖ్యకు కలిపి దానియందు ఏ నెల యందు ఏ తారీకునకు వారము కావలెనో ఆ తారీకును ఆ తేదీని కలిపి ఈ క్రింద చెప్పిన ధృవములను కలిపి దానిని 7చే భాగింపగా ఆదివారాది వారమగును

జన – 1 ఫిబ్ర – 4 మార్చి – 4; ఏప్రి – 0 మే – 2 జూన్ – 5; జూలై – 0 ఆగ - 3 సెప్టె – 6 అక్టో – 1 నవం-4 డిశం – 6.

1989 సంవత్సరము సెప్టెంబరు 20వ తేదీకి వారము 1989 లో 19 తీసివేసి 89 ని నాలుగుచే భాగించవలయును లబ్ధము 22 వచ్చినది 89 + 22 = 111 అయినది, దీనికి సెప్టెంబరు ధృవము 6 కలుపగా 117 అయినది దీనికి 20వ తేదీ కలుప 117 + 20 = 137 అయినది దీనిని 7చే భాగించగా 4 శేషము వచ్చినది. ఆదివారాదిగ నాలుగు బుధవారమయినది.

క్రీస్తుశక సంవత్సరము లీప్ సంవత్సరమైన మార్చి నుండి పై ధృవకములకు 1 అదనముగా కలుపవలెను. అనగా ఈ క్రింది ధృవములు కలుపవలయును.

జన - 1 ఫిబ్ర - 4 మార్చి - 5; ఏప్రి - 1 మే – 3 జూన్ - 6 జూలై - 1: ఆగ - 4 సెప్టె - 0 అక్టో - 2 నవం - 5 డిశం - 0

## : జనవరి 1వ తేదీ నాటి తిధిని తెలియు విదము :

క్రీస్తు శకాబ్దములను 19 చే భాగించి శేషమును 11 చే గుణించి అసంఖ్య ను 30చే భాగింపగా శేషము శుక్ల ప్రతిపదాదిగా జనవరి 1వ తేదీనాటి తిధి యగును.

ఉదా 1989 ని 19 చే భాగించగా 13 శేషము వచ్చినది దానిని 11చే గుణించగా 143 అయినది దీనిని 30చే భాగింపగా 23 శేషము వచ్చినది. అనగా శుక్ల ప్రతిపదాదిగా బహుళ అష్టమి అయినది.

## ఏ సంవత్సరమునందైన, ఏ తేదీకైనను తిది తెలియువిదము

జనవరి 1 వ తేదీ తిధిని తెలిసికొనిన తరువాత ఏ నెలకు ఏ తేదీకి తిధి కావలయునో ఆ నెలకు ఈ దిగువ తెలుపు ధ్రువకములు మరియు తారీకులు జనవరి 1వ తేదీకగు తిథికి కలిపి 29 1/2 చే భాగించగా శేషము తిధియగును శేషము 1/2 వచ్చినచో అది అమావాస్యగా గాని శుదపాడ్యమిగా గాని వవ రించవలెను.

1989 జనవరి 1వ తేదీకి బహుళ అష్టమి అయినది.

| నెలలు | ధృవ | లీప్ ధృవ | నెలలు | ధృవ | లీప్ ధృవ |
|---|---|---|---|---|---|
| జనవరి | 0 .... | 0 | జూలై | 3 .... | 4 |
| ఫిబ్రవరి | $\frac{1}{2}$ .... | $\frac{1}{2}$ | అగ | $4\frac{1}{2}$ .... | 5 |
| మార్చి | $28\frac{1}{2}$ .... | 0 | సెప్టం | 6 .... | 7 |
| ఏప్రిల్ | $\frac{1}{2}$ .... | $1\frac{1}{2}$ | అక్టో | $6\frac{1}{2}$ .... | $7\frac{1}{2}$ |
| మే | 1 .... | 2 | నవం | 8 .... | 9 |
| జూన్ | $2\frac{1}{2}$ .... | $3\frac{1}{2}$ | డిశం | $8\frac{1}{2}$ .... | $9\frac{1}{2}$ |

జనవరి 1989 - 1వ తేదీకి బహుళ అష్టమి (23) అయినది. దీనికి సెప్టెంబర్ 20 వ తేదీకి తిధి కావలసిన

| | |
|---|---|
| జనవరి 1వ తేదీ తిధి | 23 |
| సెప్టెంబర్ 20 | 20 |
| సెప్టెంబర్ ధృవము | 6 |
| | 49 |

దీనిని $29\frac{1}{2}$చే భాగించగా $19\frac{1}{2}$ శేషము వచ్చినది, 20 వ తేదీ ప్రారంభము రాత్రి 12 గంటలకు కావున ఆ సమయమునకు పంచమి యున్నది.

## రవి యందు లగ్న భుక్తిని తెలుసుకొను విధము

రవి ఈ క్రింది తేదీల యందు ప్రారంభించి మరలా రవి ఆ తేదీల యందు రాశి సంచారము చేయు కాలము వివరింపబడినది

| రాసులు | రాశియందు రవియుండు దినములు |
|---|---|
| | రో - గం - ని॥ - సె |
| మేషము | 30 - 22 - 40 - 24 |
| వృషభము | 31 - 10 - 04 - 24 |
| మిధునము | 31 - 15 - 31 - 36 |
| కర్కాటకము | 31 - 11 - 13 - 36 |
| సింహము | 31 - - - 12 - 00 |
| కన్య | 30 - 10 - 08 - 00 |
| తుల | 29 - 21 - 27 - 36 |
| వృశ్చికము | 29 - 11 - 44 - 00 |
| ధనుస్సు | 29 - 08 - 08 - 24 |
| మకరము | 29 - 10 - 22 - 00 |
| కుంభము | 29 - 20 - 00 - 48 |
| మీనము | 30 - 08 - 39 - 12 |

## వర్తమాన ప్రస్తుత సంవత్సర తిథ్యాదుల వలన రాబోవు సంవత్సర తిథులు తెలియు విధము

నేటి తిథి సంఖ్యలో 4 ను తిథి ఘడియలలో గం. 7–12 ని॥లు (18 ఘడియలు) వార సంఖ్యలో ఆదివారాదిగ 1 వారము నక్షత్ర సంఖ్యలో 3 ను నక్షత్ర ఘడియలకు గం. 5–12 ని॥లు (13 ఘ॥లు) యోగసంఖ్యలో 2ని కలిపి యోగ ఘడియలలో 5–36 ని॥లు (14 ఘ॥లు) తీసివేసిన 12 నెలలు గడచిన తరువాత వచ్చేడి తథ్యాదులగును. ఇందు యోగ సంబంధమయిన గంటలు మాత్రము తీసివేయవలయును మిగిలినవి కలుపవలయును.

# ఏ సంవత్సరమునకైనను రవి నిరయన రాశి ప్రవేశములు తెలిసికొను పద్ధతి

ఈ క్రింద 1954 వ సంవత్సరము నందు రవి ప్రవేశించిన నిరయన రాశి ప్రవేశ సమయములు భారత (I. S. T.) దేశ మధ్యకాలమునకు ఇవ్వ బడుచున్నవి. ఇందు 120 సంవత్సరములకు అగు పట్టిక ఇవ్వడమయినది. కావలసిన తదుపరి సంవత్సరములకు తెలియవచ్చును. మనకు ఏ సంవత్సర ధృవము కావలెనో ఆ సంవత్సర ధృవము కలుపవలెను

ఉదా 1954 సం॥ జన మకర సంక్రమణము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1954 | జన | 13 | బుధ | 4 గం. | 27 – 52 ని॥లు |
| 1990 | జన | | | 3 | 5 – 29.8 సె॥ |
| | జన | 14 | | శని | 8 – 22 |

ఇచట బుధవారమునకు 3 కలిపిన శనివారము అయినది గంటలు 27 నకు 5 కలిపిన 32 వచ్చినది. దానిలో 24 గంటల ప్రమాణము తీసిన 1 రోజు అధికమయినది కావున జన 14 ఉద 8-22 ని॥కు 1990 లో మేష సంక్రమణ మయినదని తెలియవలెను.



# ధర్మశాస్త్ర విషయాలు

## తిధులకు నందాది సంజ్ఞలు ;

నంద తిధులు : 1, 6, 11 ఈ తిధులు శిల్ప కృషి యజ్ఞాది కర్మలకును, వివాహ యాత్రా నవ వస్త్రాభరణ దారణలకు వైద్యము మంత్రము ప్రియ దర్శనము వీనికి మంచివి.

భద్ర తిధులు :– 2, 7, 12 ఈ తిధులు వాస్తుకర్మ, యాత్రా ఉపనయన రాజసేవ, రాజాభిషేక, విద్యాభ్యాస గోకర్మ, గజాశ్వాద్యారోహణ, సంగీతము పౌష్టిక కర్మలు వీనికి మిక్కిలి మంచివి.

జయ తిధులు :– 3, 8, 13 యీ తిధులు వివాహము, అలంకార ధారణము

సమస్త శుభకర్మలును గృహప్రవేశ దేవతా ప్రతిష్ఠలు, యుద్ధము ఆయుధ ధారణము, రాజసేవ; వీనికి మిక్కిలి మంచివి

రిక్త తిథులు :- 4, 9, 14 యీ తిథులు బంధకర్మ, అగ్నికర్మ మిత్ర భేదము అసత్యభాషణ విరోధము ఘాతుక కర్మ విష ప్రయోగాది దారుణకర్మ సాహస కార్యములును పాప కార్యములను ఇట్టివానికి ప్రశస్తమైనవి.

పూర్ణ తిథులు :- 5 10, 15 (పౌర్ణమి - అమావాస్య) ఈ తిథులలో అమావాస్య యందు పితృకర్మలను మిగిలిన తిథులందు సకల శుభకర్మలును వివాహయాత్రదులను శాంతి పౌష్టికములను ప్రశస్తములును పౌర్ణమి యాత్రకు మాత్రం పనికిరాదు

సిద్ధ తిథులు :- శుక్రవారంతో గూడిన నంద తిథియు శనివారంతోగూడిన రిక్త తిథియు, గురువారంతో గూడిన పూర్ణతిథియు సిద్ధతిథి అనబడును. ఇట్టి తిథియందు సర్వకార్యములు సిద్ధించును. (సెరపేరును)

## దగ్ధ యోగములు

ఆదివారం ద్వాదశి, సోమవారం ఏకాదశి, మంగళవారం పంచమి, బుధవారం తదియ, గురువారం అష్టమి, శనివారం నవమి కలిసిన యెడల దగ్ధయోగ మనబడును.

ఈ దగ్ధయోగం శుభకర్మలందు ముఖ్యంగా హస్తకర్మలందు నిసిద్ధము అయినను సూర్యోదయాదిగ 6 ఘడియల కాలం వరకు మాత్రమే యీ దగ్ధ యోగం విడువదగినదనియు, అపైన దోషం లేదనియు గ్రంథాంతర వచనములున్నవి.

## ఉత్తమ, మధ్యమ, అధమ తిథులు

| | ఉత్తమములు | మధ్యమములు | అధమములు |
|---|---|---|---|
| శుక్ల | 11, 12. 13, 14. 15 | 6, 7, 8, 9, 10 | 1, 2, 3, 4 5 |
| కృష్ణ | 1, 2, 3, 4, 5 | 6, 7, 8, 9. 10 | 11, 12, 13, 14, 15 |

## పక్షచ్ఛిద్రములు

శ్లో॥ చతుర్థశీ చతుర్థీచ అష్టమీ నవమీ తథా।
షష్టీచ ద్వాదశీచైవ పక్షచ్ఛిద్రాహ్వయా ఇమాః ॥

క్రమాదేతాసు తిధిషు వర్జపీయాశ్చ నాడికాః ॥
భూతాష్టమను తంత్వాంశ దశ శేషాస్తు శోభనాః ॥
దోషనాడీషు యత్కర్మ శుభం సర్వ వినశ్యతి ।

తా॥ 14-4-8-9-6-12, యీ తిదులు పక్షచ్ఛిద్రము లనబడును. యీ తిధులలో చతుర్దశిలో మొదటి 5 ఘడియలును, చవితిలో మొదటి 8 ఘడియలును, అష్టమిలో 14 ఘడియలును, నవమిలో 25 ఘడియలును, షష్ఠిలో 9 ఘడియలను, ద్వాదశిలో 10 ఘడియలును మిక్కిలి నింద్యములు కాబట్టి యీ కాలమున శుభకార్యములు చేయగూడదు. మిగిలిన ఘడియలు శుభప్రదములే యగును.

## తిధి నిర్ణయము

శ్రాద్ధాది పైతృక కర్మాచరణమునకు అపరాహ్ణ వ్యాప్తిగల తిధిని గ్రహించవలెను. అహః ప్రమాణమును (సూర్యోదయము నుండి సూర్యాస్తమయం వరకు అగు కాలమును) అయిదు భాగములు చేయగా వరుసగా 1. ప్రాతః కాలము 2. సంగవ కాలము 3 మధ్యాహ్న కాలము 4 అపరాహ్ణ కాలము, 5. సాయంకాలము అను ఐదు కాలములు అగును. అందు నాల్గవ కాలమగు అపరాహ్ణ కాలమున వ్యాపించియుండు తిధియందు అబ్ధిక మాసికాది పైతృక శ్రాద్ధ కర్మ నాచరింపవలెను. ఒక తిధి రెండు రోజులందు వ్యాపించియుండిన యెడల ఏ దినమున అపరాహ్ణ కాలమందు అధికవ్యాప్తి గల్గియుండునో ఆ దినమంతా తిధి ప్రయుక్త శ్రాద్ధకర్మను చేయవలెను రెండు దినములందును అపరాహ్ణ కాలమందా తిధి వ్యాపించని యెడల పూర్వదినమందు ముఖ్య పక్షమును పరదినమున గౌణ పక్షమును అగును, రెండు దినములందును అపరాహ్ణ వ్యాప్తి సమంగా నున్నపుడు ఆ తిథి వృద్ధియందున్నపుడు రెండవ దినమునను క్షయ మందున్నపుడు పూర్వదినమునను ఆ తిధి ప్రయుక్త శ్రాద్ధకర్మ నాచరించవలెను.

శ్లో॥ "క్షీయమాణేతు పూర్వైవ వర్ధమానేతుపై పరా ।
సమత్వేషి తధవస్యా దపరాహ్ణద్వయే యది॥"

అని ఇందుకు ప్రమాణము. ఈ తిధి నిర్ణయము పంచాంగములలో సందేహమున్న చోట్ల చూపబడుచుండును.

# : అమావాస్య నిర్ణయము :

అపరాహ్ణకాల వ్యాప్తి గల యమావాస్యమందు దర్శశ్రాద్ధమును జరిగించవలెను. "దర్శశ్రాద్ధమునకు దినము యొక్క అయిదు భాగములలో నాల్గవ భాగమగు నపరాహ్ణ కాలమందు వ్యాపించునట్టి యమావాస్య కావలెను పూర్వ దినమందు మాత్రమే సంపూర్ణ వ్యాప్తిగాని యున్నచో పూర్వదినమే గ్రహించవలెను. పరదినమందు మాత్రమే అట్లున్నచో పరదినమునే గ్రహించవలెను. రెండు దినములందును ఏకదేశ వ్యాప్తియందు భేదమున్నచో నధికమున్న దినమును గ్రహించవలెను. రెండు దినములందును సమముగా వ్యాప్తి యున్నచో తిథిక్షయ మందున్న పూర్వ దినమును, వృద్ధియందును సామ్యమందును పరదినమును గ్రహించవలెను" అని ఇట్లు ధర్మసింధు నందున్నది. ఈ ప్రకారమే అమావాస్య నిర్ణయము చేయబడి పంచాంగములందు వ్రాయబడుచుండును.

అమావాస్యలలో ముఖ్యముగా రెండు విధములు గలవు. అందు చంద్ర దర్శనముగల చతుర్దశితో కలిసిన యమావాస్యకు "సినీవాలి"యనియు చంద్ర దర్శనము లేక పాడ్యమితో కూడిన యమావాస్యకు "కుహు" అనియు సంజ్ఞలు గలవు.

ధర్మశ్రాద్ధము పార్వణ విధానముగా ఆచరించువారు అపరాహ్ణ కాలమందును ఆమశ్రాద్ధ విధానముగా నాచరించువారు పూర్వాహ్ణమందును జరిగించుట ఆచారసిద్ధము. ఇందుకు హారీత వచనము.

శ్లో॥ "ఆమశ్రాద్ధంతు పూర్వాహ్ణే ఏకోద్దిష్టంతు మధ్యమే
పార్వణం చాపరాహ్ణేతు ప్రాతర్వృద్ధి నిమిత్తకమ్"

అపరాహ్ణ వ్యాప్తి గల తిథినాడు ఆబ్దిక మాసికాది శ్రాద్ధములు జరిగించుట శాస్త్రసిద్ధమును ఆచార సిద్ధమును అగుచున్నవి. ఆమశ్రాద్ధము మాత్రము అపరాహ్ణ వ్యాప్తి గల తిథినాడే పూర్వాహ్ణ కాలమందు జరిగింపవలెను. విప్రులు ఆయామ ద్రవ్యములను వచనము చేసికొని భుజించుట ఆ రోజున అపరాహ్ణ కాలమందే జరుగుట నీవిధముగా చెప్పబడినది.



## ❀ ఏకాదశీ నిర్ణయము ❀

ఏకాదశీ తిథి దశమి తిథితో కలసియున్న దినమున దానికి దశమీ వేధ గలుగును అట్లు దశమి తిథితో కలియని ఏకాదశికి "శుద్ధైకాదశి" యనియు దశమీ వేధగల ఏకాదశికి "విద్ధైకాదశి" యనియు సంజ్ఞలు గలవు.

ఉపవాసాది వ్రతములకు విద్ధైకాదశిని విడచి శుద్ధైకాదశినే గ్రహించవలసియుండును. ఈ వేధ మరల రెండు విధములుగా నున్నది. అవి అరుణోదయ వేధ – సూర్యోదయ వేధ యని చెప్పబడినవి. సూర్యోదయమునకు ముందు నాలుగుఘడియల కాలమునకు అరుణోదయమగును. ఆ అరుణోదయ వేళయందు ఒక్క కళయైనను దశమితిథి వ్యాప్తి కలిగిన యెడల ఆ ఏకాదశి దశమీవేధ గలది యగుటచే రామానుజ మతస్థులకు (వైష్ణవులకు) ఉపవాసాది వ్రతములకు పనికిరాదు. కాబట్టి వారు ఏకాదశీ తిథి లేకపోయినను ద్వాదశి నాడే ఉపవాసాదికములను నిర్వర్తించవలెను. మరియు నిందును గూర్చి

శ్లో॥ ఛప్పన్న ఘటికాదూర్ధ్వం ద్వాదశీ యదివర్తతే :
ద్వాదశ్యా ముపవాసంతు త్రయోదశ్యాంతు పారణం ॥

అని చెప్పబడిన ప్రకారము ద్వాదశీ తిథి ౫౬ ఘడియలకు పైగా నున్న యెడల నాద్వాదశి తిథినాడే ఉపవాసాది వ్రతములను మరునాటి త్రయోదశి నాడు పారణమును నిర్వర్తించుట రామానుజ మతస్థులకు విహితము.

స్మార్తులకు సూర్యోదయ వేధగల ఏకాదశీ ఉపవాసాదులకు నిషిద్ధము అయినను శుద్ధైకాదశిలేని పక్షమందు దశమి వేధతో గూడియున్నను, విద్ధైకాదశియే స్మార్తులకు ఉపవాసాదులకు విహితముగ నున్నది మరియు నేకాదశి వృద్ధియందుండి పూర్వదినమందు ౬౦ ఘడియలును మరునాడు ౨ ఘడియలకు పైగా నేకాదశి యున్నయెడల మరునాడు శుద్ధైకాదశి యందే స్మార్త మాధ్వ వైష్ణవ మతములవారు ఉపవాసము చేయవలెను ఇట్లు ఏకాదశీ నిర్ణయము సిద్ధాంతులచే చేయబడి వారి పంచాంగములందు వ్రాయబడుచుండును.

## ❀ సంక్రాంతి పుణ్యకాలముల నిర్ణయము ❀

సూర్యుడు మేషాది పన్నెండు రాసులయందును ప్రవేశించునప్పుడు

ఆయా రాసుల సంక్రమణ పుణ్యకాలములు సంభవించును. ఈ రాశి సంక్రమణములు ముఖ్యముగా నాలుగు బేధములు గలిగియున్నవి. అందు 1) మేష తులా సంక్రమణములను విషువత్పుణ్య కాలములనియు; 2) వృషభ సింహ వృశ్చిక కుంభ సంక్రమణములకు హరిపద పుణ్యకాలములనియు, 3) మిధున కన్యా ధనుర్మీన సంక్రమణములకు షడశీతి పుణ్యకాలములనియు, 4) కర్కాటక మకరసంక్రమణములకు దక్షిణాయన ఉత్తరాయణ పుణ్యకాలములనియు సంజ్ఞలు.

అందు మేష తులా సంక్రమణములకు పూర్వాపరములందు 10 ఘడియల కాలమును (కొందరి మతమున 15 ఘడియల) వృషభ సింహ వృశ్చిక కుంభ సంక్రమణములకు (స్థిరరాసులకు) ప్రవేశాత్పరమందు 16 ఘడియల కాలమును. మిధున కన్యా ధనుర్మీన సంక్రమణములకు (ద్విస్వభావ రాసులకు) ప్రవేశాత్పూర్వమందు 16 ఘడియల కాలమును, కర్కాట సంక్రమణమునకు సామాన్యముగా ప్రవేశాత్పూర్వమందు 20 ఘడియలను (కొందరి మతమున 30 ఘ॥) మకర సంక్రమణమునకు ప్రవేశాత్పరమందు సామాన్యముగా 20 ఘడియలును (కొందరి మతమున 40ఘ॥) పుణ్యకాలములుగా చెప్పబడినవి. ఈ పుణ్యకాలముల నిర్ణయములు పంచాంగములందు చూపబడుచుండును.

## ❋ మాస శివరాత్రి నిర్ణయము ❋

ప్రతి చాంద్రమాసము నందును కృష్ణ పక్షమును ప్రదోష వ్యాప్తిగల చతుర్థశి తిదినాడు మాసశివరాత్రి శైవులకు ఉపవాసాది వ్రతములకు ముఖ్యం. సూర్యాస్తమయమునకు పరమందు 6 ఘడియలు ప్రదోషకాల మనబడును. మహాశివరాత్రికి మాత్రము మాఘమాసమున కృష్ణ చతుర్థశి అర్థరాత్రి వ్యాప్తి గలిగియుండవలెను. ఈ నిర్ణయముకూడా పంచాంగము అందు చూపబడును.

## ❋ షణ్ణవతి శ్రాద్ధది వసములు వివరములు ❋

ప్రతి సంవత్సరమందును శ్రాద్ధకర్మలను నిర్వర్తించవలసిన దినములు 96. అది ఎట్లనిన ప్రతి చాంద్రమాన మందలి అమావాస్యలు లేక దర్శలు 12 మహాలయములు జరిగించవలసిన దినములు 17. సూర్య సంక్రమణ పుణ్యకాల దినములు 12. సూర్యునకు మేషాది రాసులందు అయిన ప్రవేశదినములు

12. స్వాయంభువ స్వారోచిషాది మన్వాది పుణ్యకాలములు 14. కృత త్రేతా ద్వాపర కలియుగాది పుణ్యకాలములు 4. కృత త్రేతా ద్వాపర కలియుగాంత పుణ్యకాలములు 4. పార్థివ కల్పాది పుణ్యకాలములు 7. మత్స్య కూర్మాది జయంతి పుణ్యకాలములు 10. సోపపద పుణ్యకాలములు 4. ఈపైన చూపబడిన ప్రకారము ప్రతి వత్సరమందు శ్రాద్ధ పుణ్యకాల దినములు తొంబదిఆరు సంభవించుచుండును. ఈ దినములుకూడా ప్రసిద్ధ పంచాంగములందు గుర్తించబడుచుండును.

## ❋ ఏకోదర వివాహ నియమములు ❋

ఒక వరునకు ఒకే గర్భమున జన్మించిన కన్యలను వివాహము చేయరాదు, ఒకే గర్భమున పుట్టిన అన్నదమ్ములకు ఒకే గర్భమున పుట్టిన అక్కచెల్లెండ్రనీయరాదు. ఒకే లగ్నమునందు భిన్నోదరులకు అనగా సవతి తల్లి కుమారునకైనను అక్కచెల్లెండ్రను ఈయరాదు. ఒకే లగ్నమున పుత్రీపుత్రులకు వివాహము చేయరాదు. సోదరులిద్దరికి కలిపి రెండు వివాహములు గాని రెండు ఉపనయనములు గాని చేయరాదు. అన్నదమ్ములకు ఒకరికి వివాహం ఒకరికి ఉపనయనము ఒక లగ్నమందును ఒక ఇంటిలో చేయరాదు. కొందరు మాసాంతరమున చేయవచ్చునని, అన్య లగ్నములందు చేయవచ్చుననియు చెప్పిరి ఈ నియమము ఆపత్కాలములందు మాత్రము ఉపయోగించవలెను పుత్రిక వివాహము చేసిన తరువాత పుత్రుని వివాహము చేయవచ్చును. పుత్రికాపుత్రులు కవలలయినచో ఏకకాలమున చేయవచ్చును. కాని ఒక పుత్రునికి వివాహము చేసిన ఇంటిలో మరియొక పుత్రునికి ఉపనయనము చేయరాదు. పుత్రిక వివాహ అనంతరము కుమారునకు ఉపనయనము చేయుట మంచిది. ఏకోదరులకు ఆరు మాసముల లోపున వివాహము చేయరాదు. ఆ విధముగ ఆరు మాసముల లోపున వివాహము చేసిన రెండవ పర్యాయము వివాహము చేసిన స్త్రీ విధవ యగును. పుత్రిక అయిన భర్తృహీనురాలగును. ఇందు సంవత్సర భేదమున్న వివాహము చేయవచ్చును.

## ❋ సంబంధ నిర్ణయ నియమము ❋

కూటస్థ పురుషుని నుండి 4వ పురుషుడు నాల్గవ స్త్రీని గాని అయిదవ

స్త్రీని గాని వివాహము చేసుకొనవచ్చును. నాల్గవ పురుషుడు ఆరవ స్త్రీని వివాహము చేసుకొనరాదు. తృతీయ పురుషుడు తృతీయ స్త్రీని వివాహము చేసుకొనరాదు. అయిదవ పురుషుడు అయిదవ స్త్రీని వివాహము చేసుకొనవచ్చును. ఈ అయిదవ పురుషుడు అయిదవ స్త్రీని తల్లివరుసలో చేసుకొనవచ్చునని, తండ్రి వరుసలో కూడదని కొందరి మతము. ఈ నియమము ఏడు పురుషాంతరముల వరకే అటుపైన అక్కరలేదనియు కొందరి మతము.

అత్త వరుసలో మేనమామ భార్య చెల్లిలిని, కూతురు వరుసలో మేనమామ కుమార్తెయొక్క కుమార్తెను, కోడలి వరుసలో మేనమామ కొడుకు కుమార్తెను, మేనమామ మేనకోడలిని, అన్నకు ఇచ్చెదమనిన కన్యను, గురుపుత్రికను, క్రయము పొందిన కన్యను భార్యయొక్క తోబుట్టుల కుమార్తెను సవతి మేనకోడలిని, పినతండ్రి భార్య చెల్లెలిని ఆమె కుమార్తెను, పినతల్లి పెదతల్లి సవతి కుమార్తెయొక్క కుమార్తెను, అన్న భార్య చెల్లెలను వివాహమాడరాదు. తండ్రి వర్గములో ఏడు తరాలును, తల్లి వర్గములో ఐదు తరాలు, సవతి తల్లి వర్గములో మూడు తరములు వివాహమాడరాదు,

## ❋ వధూవరుల కేక నక్షత్రమున నియమము ❋

వధూవరులకు ఏక నక్షత్రమయి రాశి భేదమున్నను, ఏకరాశి అయి భిన్న నక్షత్రములందు జన్మించినను శుభము.

రోహిణి, ఆరుద్ర, పుష్యమి, మఖ, విశాఖ, శ్రవణము, ఉత్తరాభాద్ర, రేవతి ఈ ఎనిమిది నక్షత్రములలోను వధూవరులు ఏక నక్షత్రములయినను పాద భేదమున్న వివాహము చేయవచ్చును. ఈ నక్షత్రములయిన ఉత్తమములు.

అశ్వని, భరణి, ఆశ్లేష, పుబ్బ. స్వాతి, మూల, శతభిషము ఈ నక్షత్రములు వధూవరులకు ఏక నక్షత్రమయినను మధ్యమపక్షమున గ్రహింపవచును

తక్కిన పన్నెండు నక్షత్రముల యందు వధూవరులకు ఏక నక్షత్రమయినచో వివాహము చేయరాదు. వధూవరులకు హాని కలుగును.

## వివాహమున స్త్రీలకు దోష నక్షత్రములు (పష కన్యక)

మూల, ఆశ్లేషలలో పుట్టిన స్త్రీలు మామకును అత్తకును మారకురాలు,

మూల నాల్గవపాదము, ఆశ్రేష ఒకటవ పాదము వివాహమునకు అవలు పనికి రాదు. జ్యేష్ఠయందు పుట్టిన స్త్రీ వరుని పెద్ద సోదరుని విశాఖ యందు పుట్టిన స్త్రీ మరిదికిని మారకురాలగును.

## ❋ వివాహము చేసుకొనరాని సమయము ❋

తండ్రి చనిపోయిన సంవత్సరము వరకును, తల్లి మరణించిన ఆరు మాసముల వరకు వివాహము చేసికొనరాదు. భార్య చనిపోయిన మూడుమాసముల వరకు, సహోదరులు గాని పుత్రులు గాని మృతి చెందిన ఒకటన్నర మాసముల వరకు, ఇతర జ్ఞాతులు మరణించిన ఒక మాసము విడచి తరువాత వివాహము చేసికొనవచ్చును. అపత్కాలముల యందు శాంతినిచేసి శుభకార్యములు చేయవచ్చునని యజ్ఞవల్క్యమతము. పెండ్లినాడు మొదలుకొని నాల్గు దినముల లోపల తద్దినము కాని అమావాస్య గాని రాకూడదు.

## ❋ కుజ దోషము ❋

వధూవరుల జాతకములలో లగ్నము నుండి 2, 4, 7, 8, 12 స్థానముల యందు కుజుడున్న స్త్రీలకు భర్తృ నష్టము, పురుషులకు భార్యా నష్టమును కలుగచేయును.

మేష వృశ్చికములలో జన్మించిన వారికిని, సింహ, ధనుస్సు, మీన, మకర, కర్కాటక లగ్నముల వారికిని కుజదోషము లేదు. మరియు కుజునకు గురు సంబంధమున్నచో కుజదోషము లేదు.

ద్వితీయ కుజ దోషము మిధున కన్యా రాశులకు, ద్వాదశ కుజదోషము వృషభ తులా రాశులవారికిని చతుర్థ కుజదోషము మేష వృశ్చికముల వారికి, సప్తమ కుజదోషము మకర కర్కటక లగ్నములకు అష్టమ కుజ దోషము ధనుర్మీనములకును లేదు. కుంభ, సింహ లగ్నములవారికి ఏ స్థానమునందున్నను దోషము లేదు.

లగ్నము నుండిగాని, చంద్రుని నుండిగాని, శుక్రుని నుండికాని 2-4-7-8-12 స్థానములలో కుజుడున్న కుజదోషము. ఈ కుజ దోషము వధూవరుల ఇరువురి జాతకములందున్నచో ఆదంపతులు చాలకాలము దీర్ఘాయుష్మంతులుగ జీవింతురు.

## ❋ వివాహము తదుపరి చేయరాని పనులు ❋

ఒక కుటుంబము నందు ఒకరికి వివాహము జరిగిన యెడల ఆ కుటుంబములోనివారు ఆరు మాసముల వరకు చెరువులు త్రవ్వుట, ఉపనయన తీర్థయాత్రలు, నూతన గృహ ప్రవేశము, ఉద్యాపనము మొదలగు పనులను చేయరాదు.

## ❋ ప్రథమ రజస్వలకు - శుభాశుభ ఫలములు ❋

అశ్వ, రో. మృ. పుష్య. ఉత్తరాయం హ. చి. స్వా. విశా. అనూ. మూ. శ్ర. ధ. శత. రేవతి, యీ 17 నక్షత్రములను సోమ బుధ గురు శుక్రవారములను పూర్వాహ్ణ మధ్యాహ్నములను 2, 3, 5, 7, 10, 11, 13, 15 యీ తిధులను శుభ ప్రదములు, భరణి కృత్తిక ఆరుద్ర పుష్య ఆశ్లే మఖ పూర్వాత్రయం జ్యేష్ఠ యీ పది నక్షత్రములందును, ఆది మంగళ శనివారములందును, సంధ్యాకాలము గ్రహణ సమయమున వర్జ్య దుర్ముహూర్త సమయములందు విష్కం, శూల, అతిగం, వ్యాఘా. వజ్ర, వ్యతీ, పరి, వైధృతి యోగములందును విష్టి కరణమున రాత్రి కాలమున ప్రథమ రజస్వల యగుట మిక్కిలి యరిష్ట ప్రదమగుటచే ఆ దోషములకు యధావిధిగ శాంతి జరిగించవలెను.

## ❋ జననమునకు శుభా శుభములు ❋

అశ్వని 1వ పాదము శిశుగండము భరణి 3వ పాదము పుత్రజన్మకు పితృగండం పుత్రికా జన్మకు మాతృగండం కృత్తిక 3వ పా పుత్రునకు పితృగండము పుత్రికకు మాతృ గండం రోహిణి 1, 2 పాదములు తల్లికిని మేనమామలకును 3, 4 పా కేవలం మేనమామలకు దోషము పుష్యమి 2, 3 పా పుత్రునకు పితృ గండం పుత్రికకు మాతృ గండం, ఆశ్రేష 2 పా ధనహాని 3 పా పుత్రునకు మాతృ గండం 4వ పా పితృగండం, మఖ 1వ పా శిశుగండం 3వ పా పుత్రునకు పితృ గండం పుత్రికకు మాతృగండం. ఉత్తర 1వ పా పుత్రునకు పితృగండం పుత్రికకు మాతృగండం. హస్త 3వ పా చిత్త 1, 2 పా పుత్రునకు పితృగండం పుత్రికకు మాతృగండం. విశాఖకు పురుష జన్మకు భార్య సోదరునకును స్త్రీ జన్మకు భర్త సోదరికిని గండం. జ్యేష్ఠ 1వ పా సౌఖ్య హాని 2 పా ధనగండం, 3వ పా పెదతండ్రికిని, 4వ పా అన్నలకు గండం మరియు

జ్యేష్టా నక్షత్రమును 10 భాగములు చేయగా అందు 1వ భా తల్లి తల్లికి 2వభా తల్లి తండ్రికి, 3 భా మేనమామకు 4భా తల్లికి 5 భా శిశువుకు, 6 భా వంశమునకు 7వ భా ఉభయ కులములకు 8వ భా అన్నలకు 9వ భా మామగారికి, 10వ భా సర్వమునకు గండం లేక హాని కల్గును. మూలా 1వ పా పితృగండం 2 పా మాతృగండం 3పా ధనగండం మరియు మూలా నక్షత్రమును 15 భాగలు చేయగా అందు 1 భా పితృ గండం 2 భా పితృవ్యులకు 3 భా అప్పచెల్లెలు 4 భా తండ్రి తండ్రికి 5 భా తల్లికి 6 భా పినతల్లి పెదతల్లులకు 7 భా భర్తకు మేనమామలకు 8వ భా తండ్రి సోదరులకు 9వ భా మామగారికి 10వ భా పశువులకు 11వ భా నౌకరులకు 12వ భా శిశువునకు 13వ భా సోదరులకు 14వ భా అక్కగారికి 15వ భా తల్లి తండ్రికిని గండము లేక అరిష్టము కలుగును. రేవతి 4వ పా శిశుగండము.

జ్యేష్ఠ చివర 4 ఘడియలును మూల ప్రారంభమందు 4 ఘడియలును జననం విషయమై ఓ క్కలి దోషం గలవి మరియు పుష్యమి 2వ పా కర్కాట లగ్నమును పూర్వాషాడ 3వ పా ధనుర్లగ్నమును, చిత్త 3వ పా కన్యాలగ్నమును ఉత్తర 1వ పా సింహలగ్నమును అగునప్పుడు పగలు పుత్ర జననమునకు పితృ గండమును రాత్రి పుత్రికా జననమునకు మాతృగండం కలుగును

తిధి సంధి :- అమా ప్రతిపత్తుల యొక్కయు పంచమీ షష్టుల యొక్కయు దశమ్యేకాదశుల యొక్కయు సంధిని 4 ఘుll ల్లు తిధిసంధి యనబడును. ఈ సంధిని జననమైన యెడల పితృగండము.

నక్షత్ర సంధి :- రేవత్యశ్వినుల మధ్యను ఆశ్రేష మఘులయొక్కయు జ్యేష్టా మూలల యొక్కయు సంధిని 4 ఘడియల కాలము నక్షత్ర సంధి యనబడును

లగ్న సంధి :- మీన మేషములకును కర్కాట సింహములకును వృశ్చిక ధనస్సులకును సంధిని 1 ఘడియ కాలము లగ్నసంధి. దీనిలో జననమైన శిశువునకే గండము.

మరియు బll చతు, అమా, సంధ్యాకాలము, గ్రహణకాలము, వర్జ్య దుర్ముహూర్త కాలములును తల్లి, తండ్రి, సోదరులు వీరి నక్షత్రములును జన్మ కాలమందైనపుడు మిక్కిలి దోషములు గలవి యగును.

పై దోషములలో నక్షత్రము పాదముగూడ దుష్టమైనప్పుడును గండాంతములందును పాపాక్రాంత పాపవిద్ధ నక్షత్రములందు పితృమాతృ సోదర నక్ష

త్రములందును జననమైనప్పుడును, నక్షత్ర జపమును, నక్షత్రమునకు దాన
మును, తైలఘటమందు ముఖావలోకమును నవగ్రహములకును జపములును
దానములును, గ్రహములకును, నక్షత్రములకును హోమమును, రుద్రాభిషేక
మును, యధాశక్తిగ అన్నదానమును చేయవలెను.

నక్షత్రం మాత్రం దుష్టమైనదే పాదం మంచిదైన యెడల ముఖావలోక
మును, నక్షత్రమునకు దానమును, రుద్రాభిషేకమును జరిగించుట చాలును.
దోష బాహుళ్యము ననుసరించి శాంతి క్రమమును నిశ్చయించుకొనవలసి
యుండును

## జననమునకు గండ నక్షత్ర దానములు

అశ్విని చిత్తలందు జన్మించిన వారికి వస్త్రదానమును, భరణి మూలలకు
మహిశ దానమును, పుష్యమీ జ్యేష్ఠలకు గోదానమును, అశ్లేషకు అశ్వదానము
ను, మఖ హస్త పూర్వాషాఢ రేవతి వీనికి సువర్ణదానమును, ఉత్తర పల్గుణికి
తిలపాత్ర దానమును చేయించుటవల్ల అయా నక్షత్రగండ దోషనివారణగును.
పురుష్మక దోషము ;- శుక్రుడు (చుక్క) తన కెదురుగా నుండగను దక్షిణ
భాగమందు (కుడివైపున) ఉండగను శిశువులను అధ్య గర్భిణిలగు స్త్రీలును,
నూతనముగా పెండ్లి అయిన పధవులును ప్రయాణము చేయరాదు, అనగా
శుక్రుడు తూర్పున నుండగా పడమర నుండి తూర్పుగను, దక్షిణము నుండి
యుత్తరంగాను నైరుతి నుండి ఈశాన్యమునకును ప్రయాణం చేయకూడదు.
శుక్రుడు పశ్చిమమున నున్నపుడు తూర్పునుండి పడమరకును ఉత్తరము
నుండి దక్షిణమునకు ఈశాన్యము నుండి నైరుతి దిక్కుకును ప్రయాణం చేయ
కూడదు,

## ❋ మృతి విషయమై దోషములు ❋

1, 2, 6, 7, 11, 12, 13, 14 యీ తిదులను ఆది, మంగళ, శుక్రవార
ములును కృత్తిక రోహి మృగ పున మఖ ఉత్తర చిత్త విశాఖ ఉత్తరాషాఢ ధని
ష్ట పంచకము యీ నక్షత్రములును మృతి విషయమున మంచివి కావు కాబట్టి
వీనియందు పరామర్శ, పురమెత్తుట, సపండీకరణము మొ॥ మృతి విషయ
కమైన కార్యములు జరిగింపకూడదు.

మృగశిర చిత్త అందు మృతి గల్గిన స్థలము 8 నెలలను, కృత్తిక పునర్వసు ఉత్తర విశాఖ ఉత్తరాషాఢ నక్షత్రములందు 4 నెలలను. ధనిష్ఠాపంచకమున 6 నెలలు విడవవలెను రోహిణి మఖా నక్షత్రములందు మృతి గల్గిన స్థలమును 3 నెలలు (కొందరు 5 నెలలని అందురు) విడవవలెను.

కేవలం తిథులవల్ల దోషం లేదు తిథి వారములు రెండును మంచివి కానప్పుడు దోషము స్వల్పము. తిథి నక్షత్రము వల్ల అర్ధ దోషము వార నక్షత్రమువల్ల త్రిపాద దోషము, తిథి వార నక్షత్రములవల్ల సంపూర్ణ దోషము అగుటవల్ల యథావిధిగా శాంతి జరిగించవలెను.

## ❋ ప్రయాణ విషయములు ❋

విది, తది, పం సప్త దశ ఏకా శుక్ల త్రయో కృష్ణ పాడ్య ఈ తిథులను అశ్వి రోహి మృగ పున పుష్య ఉఫ హస్త అనూ మూల శ్రవ ధని శత ఉషా ఉభా రేవతి యీ నక్షత్రములును మేష వృష కర్కట తులా ధనుర్మాకరను మీన లగ్నములు ప్రయాణమునకు శ్రేష్ఠమైనది తూర్పునకు మంగళవారం, దక్షిణకు సోమవారం శనివారములును, పశ్చిమమునకు బుధ గురువారములను, ఉత్తరకు ఆదివారములు మిక్కిలి మంచివి.

వారశూలలు :— తూర్పునకు శని సోమవారము లందును. ఆగ్నేయమునకు గురు శనివారములును, దక్షిణకు గురువారమును, నైరుతి దిక్కుకు సోమ శుక్రవారములును పడమరకు ఆది శుక్రవారములను వాయవ్యమునకు ఆది మంగళవారములందు ఉత్తర దిక్కుకు మంగళ బుధవారములందు ఈశాన్యమునకు బుధ వారమందును వారశూల అగుటచే ప్రయాణము చేయగూడదు. అత్యవసర పరిస్థితులందు ఆది గురు శుక్రవారములందు రాత్రిపూటయు, సోమ మంగళ శనివారములందు పగటి పూటయు దోషం లేదనియు బుధవారము రాత్రింబగళ్లు రెండును దుష్టము లేదనియు చెప్పబడినది.

వారశూల దోషమునకు పరిహారము :— అత్యవసర సమయములందు గురువారమున 22 ఘడియలను, మంగళ బుధవారములందును 12 ఘడియలను ఆది శుక్రవారములందు 15 ఘ॥లను సోమ శనివారములందు 8 ఘడియలను విడిచిపెట్టి అయా పై కాలమందు ప్రయాణము చేయవచ్చునని గ్రంథాంతర

వచనములున్నవి, "నవారదోషః ప్రభవంతి రాత్రౌ" యనుటచే రాత్రియందు ప్రయాణమునకు వారశూల దోషం లేదని కొందరి మతము.

నక్షత్ర శూలలు ; శ్లో॥ "పూర్వే జ్యేష్ఠా ధనిష్టేచ శ్రవణాశ్విని దక్షిణే। పశ్చిమే పుష్య రోహిణ్యౌ హస్త ఫల్గుని చోత్తరే" తూర్పునకు జ్యేష్టా ధనిష్టలు దక్షిణమునకు అశ్వినీ శ్రవణములు. పశ్చిమమునకు పుష్యమీ రోహిణులు ఉత్తరమునకు హస్త పుబ్బలు ఇవి నక్షత్ర శూలలు. వీనియందాయా దిక్కులకు ప్రయాణము చేయరాదు

## ❋ అశౌచ నిర్ణయము ❋

ఏడు మాసముల నుండి శిశువు తల్లి గర్భమునుండి వచ్చి పుట్టినను, బొడ్డు కోసిన పిమ్మట చనిపోయినను తల్లిదండ్రులకు జ్ఞాతులకు పది రాత్రులు జాతాశౌచము కలుగును. మృతాశౌచము స్నానమాత్రముననే పోవును. బొడ్డు కోయక ముందు మరణించినచో జ్ఞాతులకు మూడు రాత్రులును తల్లిదండ్రులకు పదిరాత్రులును జాతాశౌచముండును.

ఏడు పురుషాంతరముల పర్యంతము సపిండులనియును ఎనిమిది పురుషాంతరముల నుండి పదునాలుగు పురుషాంతరముల వరకును సోదర కులమనియును, పదునైదు పురుషాంతరముల నుండి ఇరువదియొక్క పురుషాంతముల వరకును సగోత్రులనియును చెప్పబడును. కావున సపిండులకు పదిరాత్రులును సోదర కులమునకు మూడు రాత్రులును సగోత్రులకు ఒక రాత్రియు మొదటి దినము మొదలు అశౌచముగా పరిగణించవలయును. సగోత్రులకు అశౌచము ఉండదు.

## మూడు రాత్రుల అశౌచము

మాతా మహి మాతా మహులకు, అత్తమామలకును, మేనత్త మేనమామలకు, గాయత్రీ మంత్రోపదేశము చేసిన గురుదంపతులకును, తల్లిదండ్రుల తోబుట్టువులకును, తన తోబుట్టువులకును, మేనల్లునకును. కుమార్తెకును, శిష్యునకు, యజ్ఞము చేసినవారికి ఋత్విక్కుగా నున్న వారికిని మరణము సంభవించినచో త్రిరాత్ర్య శౌచము వరస్పరము పట్టవలెను.

## ❋ పక్షిణి అశౌచము ❋

రెండు పగలులు, ఒక రాత్రియు కలసినచో పక్షిణి అనబడును. పిన తండ్రి పెదతండ్రుల, అన్నదమ్ములయొక్క సంతానమునకును, కుమారుని కుమార్తెలకును, తలిదండ్రుల తోబుట్టువుల సంతానమునకు, తోబుట్టువులభర్త లకును, భార్య సోదరులకును, మేనమామ సంతానమునకు మరణము సంభ వించినచో పరస్పరము (ఒకరికొకరు) పక్షిణి ఆశౌచము కలుగును. వీరు చని పోయినవారి దగ్గర నుండినచో మూడురాత్రుల అశౌచము పట్టవలయును.

మగశిశువు ఆరు మాసముల లోపునను ఆడశిశువు మూడురాత్రులలోపున మరణించినచో తలిదండ్రులకు మూడు రాత్రులు అశౌచము మిగిలిన జ్ఞాతులకు సానమాత్రమునను శుద్ధియగును మగశిశువు ఒక సంవత్సరము లోపునను. ఆడ శిశువు వివాహము లోపునను మరణించినచో తలిదండ్రులకు మూడు రాత్రుల అశౌచమును,జ్ఞాతులకు రాత్రితోడను శుద్ధికలుగును. మగశిశువు ఉపనయనము లోపున మరణించినచో తలిదండ్రులకు జ్ఞాతులకును మూడురాత్రుల అనంత రము అశౌచ శుద్ధి యగును. ఉపనయనమున మగవారు, వివాహస్త్రీలు మర ించినచో పై నుదహరించిన విధముగా పక్షిణి అశౌచము విధించబడినది.

## ❋ పక్షిణి పట్టదగినవారు ❋

పురుషునకు—పినతల్లి, పెదతల్లి, మేనమామ, మేనమామ సంతానము. మాతామహుడు (తల్లితండ్రి) మాతామహి (తల్లి తల్లి) మేనత్త (వీరు తల్లి వైపు వరుసవారు)లకును, వివాహితులగు పినతండ్రి పెదతండ్రుల స్త్రీ సంతా నమునకు, అన్నతమ్ముల స్త్రీ సంతానము, వివాహిత కుమార్తెలు, ల్లుళ్ళను, కుమార్తెల సంతానము, సోదరీలు, సోదరీలభర్తలు (మరదులు) భార్యయొక్క తలిదండ్రులు, మేనమామయొక్క భార్య, మేనత్తగారి సంతతి, భార్యయొక్క సోదరులు.

స్త్రీకి—పినతల్లి, పెదతల్లి, మేనమామ, మేనమామ భార్య, మేనమామ సంతతి, పినతండ్రి, మేనత్త, తల్లి తండ్రి, తల్లి తల్లి, తండ్రి తండ్రి, తండ్రి తల్లి. పినతల్లి పెదతల్లుల సంతతి, పినతండ్రి పెదతం డ్రుల సంతతి (కుమార్తెలు) అల్లుళ్ళు, కుమార్తెల సంతతి వీరిలో ఎవరు చని

పోయినను పక్షిణి పట్టవలయును. ఉపనయనము కానట్టి పురుషునకు వివాహ ము కానట్టి స్త్రీకిని పక్షిణి పట్టనక్కర లేదు. పినతండ్రి పెదతండ్రి భార్యలకు, పినతల్లి పెదతల్లి భర్తలకును సాపత్న్య సంతతికిని పక్షిణి లేదు స్నానమాత్ర ముచే శుద్ధి యగును

ప ఱిదారులకు అశౌచమగు పది దినములమధ్య ఎపుడు తెలిసినను 90 ఘడియలు (36 గంటలు) పక్షిణి పట్టవలయును.

మొదటి పదిరోజుల అశౌచమునందు మరియొక అశౌచము తెలిసినచో మొదటి పదిరోజుల తోడనే శుద్ధి

## ❋ మరణ దోషములు తిధి-వార-నక్షత్రములు ❋

పాడ్యమి, విదియ, సప్తమి, నవమి, దశమి, ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి అను ఎనిమిది తిధులయందును,

ఆది. మంగళ, శుక్ర, శని వారవముల యందును.

కృత్తిక, రోహిణి, మృగశిర, పునర్వసు, మఖ, ఉత్తరఫల్గుని, చిత్త విశాఖ, ఉత్తరాషాఢ, ధనిష్ట. శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర రేవతి ఈ పై నుదహరించిన నక్షత్రములందును మనుష్యులకు మరణము సంభవించి నచో ఆ మృతి చెందిన గృహమునకు దోషము సంభవించును. కేవలము తిధి వారములు కలసిన కొద్ది దోషము కలుగును. తిధి నక్షత్రములు కలసిన అర్థ దోషమగును. వార నక్షత్రముల వలన మూడువంతల దోషమును, తిధి వార నక్షత్రములు కలసినచో సంపూర్ణ దోషమును కలుగును.

## ❋ మరణ గృహమును విడవదగిన నియమములు ❋

రోహిణి, మృగశిర, మఖ, చిత్త, ఈ నక్షత్రముల యందు మరణము కలిగిన ఒక మాసము ఇంటిని వదలివేయవలెను, కృత్తిక, పునర్వసు,పూర్వ ఫల్గుని, విశాఖల ఉత్తరాషాఢల యందయిన ఆరు మాసములును, ధనిష్ఠ, శత భిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి ఈ నక్షత్రముల నాలుగు మాస ములును ఏ గృహమునందు మరణము సంభవించినదో ఆ గృహమును విడవ వలయును.

## ❋ ఆశౌచమునందు సంధ్యావందనము ❋

జాతాశౌచ మరణాశౌచములందు మంత్రము నుచ్ఛరించక ప్రాణాయామము చేసి, మార్జన మంత్రముల మనస్సున తలచి గాయత్రీ మంత్రముతో సూర్యునకు అర్ఘ్యము విడువవలయును

## సమస్త దేవతామూర్తులకు ప్రాణ ప్రతిష్ఠా సమయమున ఉపయోగించు ప్రాణ ప్రతిష్ఠా మహామంత్రము

ఆం, హ్రీం, క్రోం, యం, రం, లం, వం, శం,
షం, సం. హం, ళం, క్షం. హం, హం. సః
ఆం, హ్రీం, క్రోం, అముష్య దేవస్య ప్రాణా ఇదం
ఆం, హ్రీం, క్రోం, అముష్య దేవస్య ప్రాణా ఇహ స్థితః
ఆం, హ్రీం, క్రోం, అముష్య దేవస్య సర్వేంద్రియాణి
ఆం, హ్రీం, క్రోం, అముష్య దేవస్య వాఙ్మనశ్చక్షు
జిహ్వా ఘ్రాణా పాణి పాద పాయూపస్థా నాం ప్రాణ
ఇహై వాగత్య సుఖం చిరం తిష్ఠంతు స్వాహా (మంత్ర మహోదధి)

## ❋ నేత్రోన్మీలన మహామంత్రము ❋

ఓం, హ్రీం, క్లీం, సాం, హ్సౌం, హ్సౌం
ప్రాణో, పాన వ్యానో దాన సమాన నాగ కూర్మ
కుక్కుర దేవ దత్త ధనం-జయాది వర్గాం వా
జ్ఞాన చక్షు నేత్ర జిహ్వా ఘ్రాణ ప్రాణ చిరం తిష్ఠం
తు స్వాహా



# జనకాల నక్షత్రములు - శాంతి విధానము

### అశ్విని

అశ్వనీ నక్షత్రములో మొదటి పాదమున శిశువు జన్మించిన ఆ శిశువునకు

తండ్రికిని దోషము కలుగును ఈ దోషము మూడు మాసములుండును. ఈ దోష శాంతికి హోమశాంతి మహాన్యాస రుద్రాభిషేకము నక్షత్ర నవగ్రహ జపము సువర్ణ దానము చేయవలయును ఈ నక్షత్రమున రెండు మూడు నాలుగు పాదములకు దోషము లేదు అయినను నక్షత్రము దూష్యమయినందున ఆద్య వేక్షణము చేయవలయును ఆద్య వేక్షణము అనగా శిశువు ముఖమును మంత్రయుక్తముగా మూవుల నూనెలో తండ్రి చూచుటయని అర్థము

## భరణి

భరణీ నక్షత్రములో మొదటి పాదము, రెండవ పాదము, నాల్గవపాదములో జన్మించిన వారికి దోషము లేదు. మూడవ పాదములో పుత్ర జననమైన ఆ శిశువునకును, తండ్రికిని, పుత్రికా జననమైన ఆ శిశువునకును, తల్లికిని దోషము ఈ దోషము ఇరవై ఏడు రోజులుండును ఈ దోష శాంతికి (హోమ శాంతి) మహాన్యాస రుద్రాభిషేకము నక్షత్ర నవగ్రహ జపములు దానములు చేయించవలెను. ఈ నక్షత్రములో మొదటి పాదము రెండవ పాదము నాల్గవ పాదములో జన్మించిన వారికి దోషము లేకపోయినను, నక్షత్రము దోషమైనందున సామాన్య శాంతి (ఆద్య వేక్షణము) చేయించవలెను ఆద్య వేక్షణమనగా శిశువుయొక్క ముఖమును మంత్రములతో నూనెలో తండ్రి చూచుట అని అర్థము.

## కృత్తికా

కృత్తికా నక్షత్రములో మొదటి పాదం రెండవ పాదం నాలగవపాదంలో జన్మించిన వారికి దోషం లేదు. మూడవ పాదంలో పురుష జననమైన ఆ శిశువుకును తండ్రికిని స్త్రీ జననమైన ఆ శిశువుకును తల్లికిని దోషం కలుగును. ఈ దోషశాంతికి (హోమశాంతి) మహన్యాస రుద్రాభిషేకము నవగ్రహ జపములు దానములు చేయించవలెను. ఈ నక్షత్రములో ఒకటి రెండు నాలుగు పాదములలో జన్మించిన వారికి సామాన్య శాంతి (ఆధ్య వేక్షణము) చేయవలెను. ఆధ్య వేక్షణమనగా శిశువుయొక్క ముఖము మంత్రములతో నూనెలో తండ్రి జూడవలెను.

## రోహిణి

రోహిణి నక్షత్రము మొదటి పాదములో శిశువు జననమైన తల్లికి, మేన

మామలకు దోషము రెండవ పాదములో జననమైన తల్లికి, తండ్రికి మేనమామ లకు దోషము మూడవ పాదములో జననమైన తల్లికి మేనమామలకు నాలగవ పాదములోనైన మేనమామలకు దోషము కలుగును. గాన ఈ నక్షత్రములో ఏ పాదములో జననమైనను, (హోమశాంతి) మహన్యాస రుద్రాభిషేకము నక్షత్ర నవగ్రహ జపములు దానములు సువర్ణదానము చేయించవలెను,

## మృగశిరా

మృగశిరా నక్షత్రములో ఏ పాదములో జన్మించినను దోషము లేదు. శుభదము.

## ఆరుద్రా

ఆరుద్రా నక్షత్రములో ఏ పాదములో జన్మించిన దోషము లేదు. శుభధము ఆర్ద్రా నక్షత్రములో పుట్టిన పురుషుడు శౌర్యవంతుడు, క్రయ విక్రయ అందు సమర్థుడు. చేసిన మేలు మరచువాడు. క్రూరకార్యములు చేయువాడు, చింతలేనివాడు అగును.

## పునర్వసు

పునర్వసు నక్షత్రములో ఏపాదమందు జననమైనను దోషములేదు. శుభదము

## పుష్యమి

పుష్యమీ నక్షత్రములో మొదటి పాదంలో పుత్రికా పుత్రులు జననమైన యెడల మేనమామకు దోషము. రెండు మూడు పాదములలో పుత్రికాపుత్రులు జననమైన తల్లితండ్రులకు దోషము ఈ దోషశాంతికి (హోమశాంతి) మహాన్యాస రుద్రాభిషేకము నక్షత్ర నవగ్రహ జపములు దానములు గంధపు చెక్క దానము చేయించవలెను. నాల్గవ పాదములో జననమైన వారికి దోషములేదు. అయినను నక్షత్రము దోషమైనందున సామాన్య శాంతి (ఆద్యవేక్షణ)చేయించవలెను. ఆద్యవేక్షణ మనగా శిశువుయొక్క ముఖము మంత్రములతో నూనెలో తండ్రి చూచుటయని అర్థము.

## ఆశ్లేషా

ఆశ్లేషా నక్షత్ర మొదటి పాదములో పుత్ర జననమైనను పుత్రికా జనన

మైనను దోషము లేదు శుభదము. రెండవ పాదములో పుత్ర జననమైనను పుత్రికా జననమైనను ధనమునకును తండ్రికిని దోషము. మూడవ పాదములో పుత్ర జననమయినను పుత్రికా జననమయినను తల్లికి దోషము. నాల్గవ పాదములో పుత్ర జననమైనను పుత్రికా జననమైనను తండ్రికిని ఆ శిశువునకును దోషము. ఈ నక్షత్రములో మొదటి పాదములో జననమైన వారికి సామాన్య శాంతిని (అద్య వేక్షణము) అనగా శిశువుయొక్క ముఖమును మంత్రముఃలతో నూనెలో తండ్రి చూచుటయు రెండు, మూడు, నాల్గు పాదములో జననమైన వారికి (హోమశాంతి) మహన్యాస రుద్రాభిషేకము, నక్షత్ర, నవగ్రహ జపము లు, దానములు, సువర్ణదానము చేయించవలెను.

## మఘా

మఘా నక్షత్రములో మొదటి పాదములో పుత్రికా పుత్రులు జననమైన యెడల ఆ శిశువునకును తండ్రికిని దోషము రెండవ పాదములో జన్మించిన వారికి దోషము లేదు మూడవ పాదములో పుత్రుడు జన్మించిన యెడల తండ్రికిని పుత్రిక జన్మించిన తల్లికి దోషము కలుగును. నాల్గవ పాదములో జన్మించిన వారికి దోషము లేదు. మఘా నక్షత్రములో మొదటి పాదములో మూడవ పాదములో జన్మించిన వారికి (హోమశాంతిని) మహన్యాస రుద్రాభిషేకము నక్షత్ర నవగ్రహ జపములు దానములు సువర్ణదానము చేయించవలెను రెండవ పాదము నాలగవ పాదములో జన్మించినవారికి సామాన్య శాంతి (అద్యవేక్షణ చేయవలయును. అద్యవేక్షణ మనగా శిశువుయొక్క ముఖమును మంత్రము తో నూనెలో తండ్రి చూచుటయని అర్ధము.

## పూర్వ ఫల్గుని

పూర్వ ఫల్గునీ నక్షత్రములో ఏ పాదమందు ఏ శిశువు జన్మించినను సామాన్య దోషము ఈ దోషశాంతికి సామాన్య శాంతి (అద్యవేక్షణ) చేయుట మంచిది. అద్యవేక్షణ మనగా శిశువుయొక్క ముఖమును మంత్రముఃలతో నూనెలో తండ్రి చూచుట అని అర్ధము.

## ఉత్తర ఫల్గుని

ఉత్తర ఫల్గునీ నక్షత్రములో మొదటి పాదంలో పుత్రికా పుత్రులు జనన

మయ్యేనేని తల్లిదండ్రులకు దోషము, నాల్గవ పాదములో పుత్రికా పుత్రులు జననమైన యెడల సోదరులకు దోషము కలుగును. ఈ దోషశాంతికి (హోమ శాంతి) మహన్యాస రుద్రాభిషేకము నక్షత్ర నవగ్రహ జపములు దానములు తిలపాత్ర దానము చేయవలయును. ఈ నక్షత్రములో రెండు మూడు పాద ములలో జన్మించిన వారికి సామాన్యశాంతి (ఆద్య వేక్షణము) అనగా శిశువు ముఖమును మంత్రములతో నూనెలో తండ్రి చూచుటయని అర్థము.

## హస్త

హస్త నక్షత్రముతో మొదటి పాదము రెండవ పాదము నాల్గవ పాదము లో జననమైనవారికి దోషము లేదు. మూడవ పాదములో పుత్రుడు జన్మించిన తండ్రికిని పుత్రిక జన్మించిన తల్లికిని సామాన్య దోషము కలదు. ఈ దోషము నకు సామాన్య శాంతి (ఆద్యవేక్షణము) చేయించవలెను. ఆద్యవేక్షణ మనగా శిశువుయొక్క ముఖమును మంత్రములతో నూనెలో తండ్రి చూచుటయని అర్థము.

## చిత్త

చిత్తా నక్షత్రము మొదటి పాదములో పుత్రికా పుత్రులు జననమైన తండ్రికిని రెండవ పాదములో పుత్రికా పుత్రులు జననమైన తల్లికిని మూడవ పాదములో పుత్రికా పుత్రులు జననమయిన సోదరులకు దోషము. ఈ దోష ములకు హోమశాంతి మహన్యాస రుద్రాభిషేకము, నక్షత్ర నవగ్రహ జపములు దానములు, వస్త్రదానము, సువర్ణముతో మేకరూపము చేయించిన ప్రతిమను దానము చేయవలెను. నాలుగవ పాదములో జన్మించిన వారికి సామాన్య శాంతిని (ఆద్యవేక్షణము) చేయించవలెను. ఆద్యవేక్షణమనగా శిశువుయొక్క ముఖమును మంత్రముతో నూనెలో తండ్రి చూచుటయని అర్థము.

## స్వాతి

స్వాతీ నక్షత్రములో ఏ పాదమునందు జన్మించినను దోషములేదు శుభదము

## విశాఖా

విశాఖా నక్షత్రములో ఏపాదములో జననమయినను సామాన్య దోషము

కలదు గాన సామాన్య శాంతిని ఆద్యవేక్షణము చేయుట మంచిది ఆద్యవేక్ష ణమనగా శిశువు ముఖమును మంత్రములతో నూనెలో తండ్రి చూచుటయని అర్థము.

## అనూరాధా

అనూరాధా నక్షత్రములో ఏ పాదములో జననమయినను దోషములేదు శుభదము.

## జ్యేష్టా

జ్యేష్టా నక్షత్రములో ఏ పాదములో పుత్రికా పుత్రులు జన్మించినను ప్రబల దోషమయినదేగాన యధావిధిగా (హోమశాంతి) మహన్యాస రుద్రాభి షేకము నక్షత్ర నవగ్రహ జపములు దానములు బంగారముతో చేయించిన గోవు ప్రతిమను దానముతో యిచ్చుటవే చేయవలయును.

## మూలా

మూలా నక్షత్రములో మొదటి పాదములో పుత్ర జననమయిన యెడల తండ్రికి దోషము పుత్రిక జన్మించిన యెడల పశువులకు హాని కల్గును. రెండవ పాదములో పుత్ర జననమయిన ఎడల తల్లికి దోషము పుత్రిక జన్మించినఎడల సామాన్య సౌఖ్యం మూడవ పాదములో పుత్రుడు జన్మించినఎడల ధన నష్టము కల్గించును. పుత్రికా జననమయిన ఎడల పితృ వక్షమునకు హాని కలిగించును. నాల్గవ పాదములో పుత్రుడు జననమైన యెడల సామాన్య దోషము, పుత్రిక జన్మించిన ఎడల మాతృపక్షమునకు హాని కల్గించును .గాన యీ నక్షత్రములో పుత్రికా పుత్రులు ఏపాదములో జన్మించినను హోమశాంతి మహన్యాస రుద్రా భిషేకము నక్షత్ర నవగ్రహ జపములుదానములు చేయవలెను. బంగారముతో చేయబడిన (మహిత) ఎనుబోతు ప్రతిమను దానము చేయించవలెను.

## పూర్వాషాఢ

పూర్వాషాడ నక్షత్రములో మొదటి పాదం రెండవ పాదం నాల్గవపాదం లో పుత్రికా పుత్రులు జన్మించిన యెడల స్వల్ప దోషము కల్గును. గాన సామాన్య శాంతిని (ఆద్యవేక్షణమును) చేయించవలెను. ఆధ్య వేక్షణమనగా శిశువుయొక్క ముఖమును మంత్ర-తో నూనెలో తండ్రి చూచుటయని అర్థము. ఈ పూర్వషాడ నక్షత్రములో మూడవ పాదంలో పుత్రుడు కన్మించిన యెడల

తండ్రికిని ప్రత్యేక జన్మించిన యెతల తల్లికి దోషము కలుగును. ఈ దోషము నకు (హోమశాంతి) రుద్రాభిషేకము నక్షత్ర నవగ్రహ జపములు దానములు వేయవలెను.

## ఉత్తరాషాడ

ఉత్తరాషాడ నక్షత్రములో ఏ పాదములో పుత్రికా పుత్రులు జన్మించిన దోషము లేదు. శుభదము.

## శ్రవణా

శ్రవణా నక్షత్రములో పుత్రికా పుత్రులు జన్మించిన ఎడల దోషములేదు. శుభదము.

## ధనిష్టా

ధనిష్టా నక్షత్రములో పుత్రికాపుత్రులు పుట్టిన దోషము లేదు. శుభదము

## శతభిషా

శతభిషా నక్షత్రములో పుత్రికా పుత్రులు జన్మించిన దోషంలేదు. శుభదము

## పూర్వాభాద్ర

పూర్వాభాద్ర నక్షత్రములో ఏ పాదములో పుత్రికా పుత్రులు జననమైన సామాన్య దోషము కలుగును, గాని సామాన్యశాంతి (అద్యవేక్షణము) చేయ వలెను. ఆద్యవేక్షణమనగా శిశువు ముఖమును మంత్రముతో నూనెలో తండ్రి చూచుటయని అర్థము.

## ఉత్తరాభాద్ర

ఉత్తరాభాద్ర నక్షత్రములో ఏ పాదములోనయినను శిశువు జన్మించిన దోషము లేదు. అంతయు శుభము.

## రేవతి

రేవతీ నక్షత్రములో మొదటి పాదము, రెండవ పాదము, మూడవపాద

ములలో పుత్రికా పుత్రులు కలిగిన దోషంలేదు. నాలుగవ పాదమున పుత్రుడు పుట్టిన తండ్రికిని, శిశువునకును, పుత్రిక జన్మించిన తల్లికిని, శిశువుకును, దోషం కలుగును. కావున ఈదోషమునకు హోమశాంతి రుద్రాభిషేకము నక్షత్ర నవగ్రహ దానములు జపములు చేయించవలెను. ఒకటి, రెండు, మూడు పాదములో పుట్టిన వారికి సామాన్య శాంతి అనగా ఆద్యవేక్షణము చేయించవలెను. ఆద్యవేక్షణ మనగా శిశువు ముఖమును మంత్రములతో నూనెల చూచుట అని అర్థము.

ప్రేగులు మెడను చుట్టుకొని పుట్టినను, వర్జ్య దుర్ముహూర్త అమావాస్య గ్రహణము, తల్లి, దండ్రుల, సోదర సోదరీల జన్మ నక్షత్రముల యందు శిశువు జననమయినచో నవగ్రహ దానములు నక్షత్ర జపము హోమశాంతి, రుద్రాభిషేకములు చేయించినచో దోష పరిహారమగును.



# ★ వాస్తు విద్యా రహస్యాలు ★

## ❋ ఉపక్రమణిక ❋

"అగ్నీంద్రదు ద్యుమణి ప్రభఞ్జన ధరా • నీరాన్తర శ్యాయినీ
శక్తిర్బ్రహ్మ హరీశ వాసవ ముఖా * మర్త్యా సురాత్మ స్థితా
సృష్టి స్థావర జంగమ స్థిత మహా * చైతన్య రూపావ యా
యద్బీజ స్మరణేన సైవ భవతీ * ప్రాదుర్భవ త్యంబి కే"

భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము అనే పంచభూతాలు తానుగా నిండియున్నటు వంటిన్ని, బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు, ఇంద్రుడు, సూర్యుడు, చంద్రుడు మొదలగు దేవతలకు ఆత్మస్వరూపిణిగా భాసించుచున్నటు వంటిన్ని సమస్త చరాచర జగత్తునందలి స్థావర జంగమాది ప్రాణి కోటికి బీజమై మహా చైతన్య స్వరూపిణిగా ప్రకాశించుచున్నట్టిన్ని ఈ బ్రహ్మాండ మధ్యమున బిందు రూపాత్మకమైన యే జగన్మాత పరా ప్రకృతి గలదో

నమోవాకములర్పించు కొనుచున్నాము.

పంచ భూతాత్మకమైన ఈ చరాచర జగత్తంతయూ ఆ పరాప్రకృతి యొక్క వ్యాపక స్వరూపమే. ఆ ప్రకృతిమాతకు బింబ ప్రతిబింబ న్యాయంగా ఆవిర్భవించిన ఈ పిపీలికాది బ్రహ్మ పర్యంతముగల చరాచర జగత్తంతయు ఆ జనని నిండియున్నది. అట్టి ఈ జగత్తునందు సూర్యుడే ప్రత్యక్ష పరమేశ్వరుడు. ఆ సూర్యుడు భూమండలానికి సంబంధించినంత మేరకు సమస్త ప్రాణులకు ప్రాణము. సూర్యుడులేని ఈ చరాచర జగత్తు శూన్యము.

"సూర్యయేవ త్రిలోకస్య । మూలం పరమ దైవతం
సూర్యాత్ప్రసూయతే స్సర్వం । తస్మిన్నేవ ప్రలీయతే॥

సూర్యుడే ఈ మూడులోకాలకు మూలపురుషుడు, దైవత్వం. సూర్యుని వలనే ఈ ముల్లోకాలు పుడుతున్నాయి మరల అతనియందే లీనమౌతున్నాయి సూర్యుడు సమస్త దేవతా స్వరూపుడుగా ఆరాధింపబడుచున్నాడు.

## ❋ గృహ నిర్మాణ ప్రయోజనం ❋

పరమేశ్వరుని సృష్టిలో పిపీలికాది బ్రహ్మపర్యంతం గల జీవరాశుల న్నింటికి ఎండ, వాన, చలి, గాలి మొదలైన ప్రకృతి సహజాలైన ఈతి బాధల నుండి రక్షణ పొందడానికి యేదోయొక విధమైన ఆశ్రయం లేక ఇల్లు అవసరం అయిఉంటుంది. అట్టి ఆశ్రయ నిర్మాణం కోసం ప్రతీ ప్రాణి ప్రయత్నించేయుడం సహజం. అతిచిన్న ప్రాణులయిన చీమలు చిత్ర విచిత్రమైన పుట్టలు నిర్మించుకొంటాయి. పక్షులు గూళ్ళు కట్టుకొంటాయి. పిచ్చుక గూళ్ళ నిర్మాణకౌశలం అందరికీ విదితమే. ఇక బుద్ధిజీవులయిన మానవ నిర్మాణాలను గూర్చి వేరే చెప్పాలా. అయితే ఈ మానవ నిర్మాణ గృహాలు ఆయా దేశ కాలానుగుణ్యంగా రూపొందింపబడతాయి.

మానవజాతికి సంబంధించినంత వరకు చతుర్విధ పురుషార్థ సాధనకు గృహస్థాశ్రమం ఆధారభూతం పొంత యిల్లులేని గృహస్థుడుచేయు సమస్త శ్రౌత స్మార్త పుణ్యకర్మలయొక్క ఫలితం ఆ గృహస్థుడు యెవరి యింటి యందు ఆయా కర్మలాచరించుచున్నాడో ఆ గృహ యజమానికి చెందునని శాస్త్రాలు చెబుతున్నాయి. పండితార్థం యేమంటే ప్రతి మానవునకు తనశక్తికి తగినట్లుగా చిన్నది గాని పెద్దది గాని, గుడిసె గాని పూరిల్లు గాని యేదో ఒక

రూపంలో సొంత యిల్లు ఉండుట మిక్కిలి అవసరం.

మన దేశంలో చరిత్రకు అందని కాలం నుండీ ఒక క్రమబద్ధమైన నిర్మాణశైలి ఉందని మొహంజొదారో హరప్పా నాగరికత తెలుపుతూ ఉంది. మొహంజొదారో నాగరికతకు పూర్వం ఆర్య సంతతికి చెందిన మయ, విశ్వకర్మాది, శిల్పఋషులు, తమకు వంశపారంపర్యగా అందిన నిర్మాణ శాస్త్ర రహస్యాలను ముందు తరాలవారికి శాస్త్రాల రూపంలో భద్రపరచి అందించారు అతీంద్రీయ శక్తి సంపన్నులైన వారి రచనలు లోకకళ్యాణమే పరమావధిగా గల శాస్త్రాలు. ఆనాటి శిల్పఋషులలో మయుడు, విశ్వకర్మ. కశ్యపుడు, భరద్వాజుడు. అత్రి మొదలైనవారు సుప్రసిద్ధులు. మయుని రచనలలో "మయమత వాస్తుశాస్త్రం చాలా వైజ్ఞానిక, విలువలు గల మహత్ 'గ్రంథం, ఆ గ్రంథా'న్ని ప్రెంచి భాషలో అచ్చు వేయించుకొన్నారంటే ఆ గ్రంధానికున్న ప్రాముఖ్యం మనకు తెలుస్తుంది. ఆ మయమత వాస్తుశాస్త్రం ఆధారంగా ఈ వాస్తు విద్యారహస్యాలు అందింపబడుతున్నాయి. అంతేగాక అపరాజిత పృచ్ఛ, మానసారం, సమరాంగణం మొదలైన గ్రంథాల నుండి విషయాలు స్వీకరింపబడినాయి.

## ❋ వాస్తు పద విన్యాస పద్ధతి ❋

భూమండలానికి సంబంధించినంత వరకు సూర్యుడే ప్రత్యక్ష దైవము అనిచదివాం గృహనిర్మాణ శాస్త్రానికికూడా సూర్యుడే అధిదేవత గృహనిర్మాణశాస్త్రానికి వాస్తుశాస్త్రం అనిపేరు వాస్తుశాస్త్రానికిఅధిదేవత "వాస్తుపురుషుడు ఆ వాస్తుపురుషుడు సూర్యుడే. కాబట్టి సమస్త వాస్తుశాస్త్రానికి మూలాధారం సూర్యుడు. కాబట్టి వాస్తుశాస్త్రం సూర్యగమనాన్ని అనుసరించి వైజ్ఞానిక విలువలు గల వాస్తుశాస్త్రం రూపొందింపబడింది.

సూర్యుడు వాస్తుశాస్త్రానికి అధిష్టానదేవత కాగా, సూర్యకిరణాలద్వారా లభ్యమయ్యే "సౌరశక్తి" ని మానవజాతులు యెంత పుష్కలంగా వినియోగించుకోగలరో అంత పుష్కలంగాను వినియోగించుకొనే నిమిత్తం అతీంద్రియ శక్తిసంపన్నులైన మయ. విశ్వకర్మాది శిల్పఋషులు నిర్దుష్టమైన వైజ్ఞానిక విలువలుగల ఒక ప్రణాళిక రూపొందించారు. ఆ వైజ్ఞానిక నిర్మాణ ప్రణాళికయే 'వాస్తు విన్యాస పద్ధతి' సమస్త నిర్మాణ కార్యాలకు మూలకంధం. అది గ్రామమే కానీయండి, నగరమే కానీయండి, చిన్నయిల్లే కానీయండి, పెద్ద

భవనమే కానీయండి, లేక సామ్రాజ్య సంరక్షణకు అవసరమైన కోటలే కానీ యండి సమస్త నిర్మాణాలకు ఈ "వాస్తు పదవిన్యాస పద్ధతి అనే ప్రణాళిక ఆధారంగానే నిర్మించాలని వాస్తుశాస్త్రాలు" ముక్తకంఠంతో చెబుతున్నాయి.

ఈ వాస్తు విన్యాస పద్ధతి భూ భ్రమణం మరియు భూ పరిభ్రమణం అనే భూ చలనాలు ఆధారంగా సూర్యకిరణాలు యేయే కాలాలలో యే యే సమయాలలో యేయే విధములైన శక్తులను విడుదల చేస్తూ ఉంటాయో ఆయా శక్తులను ఆయా నిర్మాణాల యందు నివశించేవారికి అందుబాటులోనికి వచ్చే విధంగా రూపకల్పన చేయబడింది. సూర్యోదయం నుండి సూర్యాస్తమయం వరకు కాలం 5 భాగాలుగా విభజింపబడింది 1) ప్రాతఃకాలం 2) సంగవకాలం 3) మధ్యాహ్నకాలం 4) అపరాహ్న కాలం 5) సాయంకాలం ఈ అయిదు కాలాల్లోను సూర్యకిరణాలు భూమండలం మీద ఒకేవిధమైనశక్తిని విడుదల చేయవు. ఒక్కొక్క సమయంలో ఒక్కొక్కవిధమైన శక్తిగల కిరణాలు భూగోళాన్ని తాకుతాయి శక్తులను విడుదల చేస్తాయి. ఉదాహరణకు ప్రాతఃకాలంలో అల్ట్రావయొలెట్ కిరణాలు, ఇన్‌ఫ్రారెడ్ కిరణాలు భూమాతను తమ తమ అమృత హస్తాలతో పవిత్రం చేస్తాయి. ఇంకా వివరంగా వ్రాయాలంటే ఈ చోటు చాలదు, కాబట్టి ముఖ్యంగా వాస్తు సిద్ధాంతులు వాస్తు శాస్త్రాభిమానులు ఈ వాస్తు పదవిన్యాస పద్ధతి అనే వైజ్ఞానిక ప్రణాళికను గూర్చి అపరాజిత, మయసుతము అనే గ్రంథాల్లో చదువగోర్తాము. ముందు వ్రాయబోయే ప్రకరణలన్నీ, వాస్తుగ్రంథాలు ఆధారంగానే వ్రాయబడుతున్నాయని మనవి చేసున్నాము. ఆయా గ్రందాలు చూడగోరేవారిని మా గ్రందాలయం మెప్పుడూ ఆహ్వానిస్తూ ఉంటుంది.

## ❋ స్థల పరీక్ష ❋

వాస్తుశాస్త్రమున స్థలపరీక్ష మొదటిది. గృహనిర్మాణమునకు ముందుగ ఆ నిర్మాణ స్థలముయొక్క పరిసరములను, ఆకృతిని, ఉచ్ఛనీచలను, దిక్కులను, విదిక్కులను, ఆ స్థలమునందలి మట్టియొక్క రంగును, రుచిని బాగుగా పరిశీలింపవలసి యున్నది. స్థలముయొక్క పరిసరములు కంటికి యింపుగా మనస్సుకు ఆనందకరముగా నుండవలయును. గ్రామ పొలిమేరకు చేరువ. స్మశానమునకు సమీపము, మురికిగుంటలు మొదలగు వాటికి చేరువను, దేవాలయములకు సమీపములయందు గల స్థలములనుగూర్చి పూర్వాపరములను

బాగుగా విచారించవలయును వీధిశూలలు, దేవతా నివాస వృక్షములు గల స్థలము గృహనిర్మాణమునకు పనికిరాదు.

స్థలముయొక్క ఆకృతిఅనగా ఆకారము నలుచదరముగగాని లేదా ఆయుతంగ గానీ,యుండవలెను కోణముదీరిగాని, మూడుకోణములు గలదిగాగాని యుండ రాదు గృహనిర్మాణమునకు చదరము అనగా నాలుగుభుజములు అనగా దిక్కు లు సమానమగు కొలతలుగల స్థలము ఆయుతము అనగా రెండు దిక్కులు ఒక కొలత మరోరెండు దిక్కులు మరియొక కొలతగల స్థలము అనగా తూర్పు పడ మరలు 20 గజములు దక్షిణోత్తరము 15 గజములు ఉన్నదనుకొనుడు దానిని ఆయతమందురు. గృహనిర్మాణమునకు యీ రెండు ఆకృతులు గల స్థలములే ప్రశస్తములు. కాబట్టి గృహనిర్మాణమునకు ఎన్నుకొన్న స్థలమునకు యే దిక్కు నందలి సరిహద్దులైన వంకరలు దీరియున్నచో నాలుగు దిక్కులు సమసూత్ర మునకు సవరించుకొని మిగిలిన భూమిని విడిచి పెట్టవలయును.

## ❋ ఉచ్చనీచలు ❋

స్థలముయొక్క ఆకృతిని పరిశీలించిన పిమ్మట ఆ స్థలము నందలి ఉచ్చనీచలు అనగా మెట్టపల్లములు, నీటివాటములు యెట్లున్నవో బాగుగా విమర్శించవలయును.

సాధారణముగా గృహనిర్మాణ స్థలమునందు నీటివాటము తూర్పునకుగాని, ఉత్తరమునకు గాని, ఈశాన్యమునకుగాని యుండుట శుభప్రదము. తూర్పు పల్లముగానున్న స్థలము ధన ధాన్య సమృద్ధిని కలిగించును. దక్షణము పల్ల ముగానున్న స్థలము అపమృత్యువును కలుగజేయును. పడమర పల్లముగా స్థలము ధనవ్యయమును కలుగజేయును ఉత్తరము పల్లముగా నున్న స్థల ము సమస్త ఐశ్వర్యములను కలుగజేయును కాబట్టి తూర్పు ఉత్తరములు పల్లముగాను, దక్షణ పశ్చిమములు ఎత్తుగను ఉన్న స్థలమునే గృహనిర్మాణ మునకు గ్రహింపవలయును. గృహనిర్మాణ స్థలమునందలి మిట్టపల్లముల ననుసరించి ఆయా స్థలములకు కొన్ని పేర్లు నిర్ణయింపబడినవి.

గోవీధి :— గోవీధియను పేరుగల స్థలమునకు తూర్పు పల్లముగను, పడమర యెత్తుగను ఉండును, నీటివాలు తూర్పునకుండును అట్టి స్థలమునందు నివ సించువారికి పాడిపంటలు మిక్కలి వృద్ధియగును. వంశవృద్ధి కలిగి, కీర్తి

ప్రతిష్ఠలు కలవారై దినదినాభివృద్ధిని పొందెదరు.

అగ్నివీధి :- వాయవ్యము యెత్తుగను, ఆగ్నేయము పల్లముగను ఉన్న భూమికి అగ్నివీధి యనిపేరు. ఇట్టి భూమియందు నివసించు వారికి శత్రు భయము, సంతాన నష్టము, అగ్నిభయము, చోరభయము కలుగుచుండును

యమవీధి :- యమవీధి అను పేరుగల స్థలమునకు దక్షిణము పల్లముగను ఉత్తరము యెత్తుగను ఉండును. అందలి నీటివాటము దక్షిణముగా నుండును అట్టి భూమియందు నివసించు ప్రజలకు తరచు అకాల మరణములు సంభవించును లేదా రోగములతో బాధపడుచుందురు.

భూతవీధి :- నైఋతి పల్లముగను, ఈశాన్యము యెత్తుగనున్న భూమికి భూతవీధి యనిపేరు. భూతవీధి యందు నివసించు ప్రజల తరచుగా రోగముల తో బాధపడుచుందురు, మనః స్థిమితము తక్కువగా నుండును. భూతప్రేతాది బాధలు సంభవించుచుండును. భూతవీధి యందలి గృహమున నివసించు బాలురు తరచు యిల్లు విడచి పారిపోవుచుండుట తటస్థించుచుండును.

జలవీధి ;- జలవీధి యను పేరుగల స్థలమునకు పడమర పల్లముగను, తూర్పు యెత్తుగను ఉండును. నీటివాటము పడమరగా నుండును. అట్టి భూమి యందు నివసించువారు యెంతటి ధనవంతులైనను ఋణగ్రస్తులగుదురు. అం దుండు వారిధనము దుర్వ్యసనముల పాలగును. సంతానముకూడ చెడు అల వాట్లకు లోనై యుందురు. జలవీధియందలి గృహమున నివసించువారి ధనము జలప్రవాహము వలె తరిగిపోవును.

నాగవీధి :- ఆగ్నేయము యెత్తుగను, వాయవ్యము పల్లముగను ఉన్న భూమికి నాగవీధి యనిపేరు. అందు నివసించువారు స్త్రీ నష్టమునుపొందెదరు అందుండువారి స్త్రీ సంతానమునకు అరిష్టములు కలుగును.

గజవీధి :- గజవీధియను పేరుగల భూమికి దక్షిణము యెత్తుగను, ఉత్త రము పల్లముగ నుండును. అందలి నీటివాటము ఉత్తర దిక్కుగా నుండును అట్టి భూమియందు నివసించు ప్రజలు అష్టఐశ్వర్య సంపన్నులై కీర్తిప్రతిష్ఠలు దింతురు.

ధనవీధి :- ఈశాన్యము పల్లముగను, నైఋతి యెత్తుగను ఉన్న భూమికి ధనవీధి యని పేరు. అందు నివసించువారికి సమస్త సంపదలు దినదినము వృద్ధిపొందుచుండును. అందుండువారు మిక్కిలి ఆనందముతో జీవితమును గడుపుచుందురు.

గజపృష్ఠము :- దక్షిణము, నైఋతి, పడమర, వాయవ్యము యెత్తుగా నుండి ఉత్తరము, ఈశాన్యము, తూర్పు దిక్కులు పల్లముగా నున్న భూమికి గజపృష్ఠమని పేరు. నీటివాటము తూర్పునకుగాని, ఉత్తరమునకు గాని లేక ఈశాన్యముగా గాని యుండవచ్చును అట్టి భూమియందు యిల్లు కట్టుకొని నివసించు జనులు ధనము లేనివారైనను ధనవంతులకంటె మించిన ఆనందోత్సాహములతో జీవించిగలరు. అందుండు వారికి ఆయుర్వృద్ధి, ధనధాన్యసంపద, కీర్తి లభించును. సంతానము మంచివృద్ధి కలిగియుండును.

కూర్మపృష్టము :- గృహనిర్మాణ స్థలముయొక్క మధ్యభాగము తాబేలు డిప్పవలె యెత్తుగనుండి అన్ని దిక్కుల పల్లముగను ఉన్న భూమికి కూర్మ పృష్ఠమని పేరు. అందు నివసించువారు సుఖజీవనము గడుపగలరు.

## ❋ దిక్సాధన ❋

గృహనిర్మాణ స్థలమందలి ఉచ్చనీచలు పరిశీలించిన పిమ్మట ఆ స్థలమునందు దిక్సాధన వేయవలయును దిక్సాధన అనగా స్థలమునకు నాలుగు దిక్కులు సరిజేయుటయని గ్రహింపవలయును. ఇండ్లు నిర్మించుకొనుటలో దిక్సాధనయే చాలా ముఖ్యమైన విషయము,

"దిక్కులేనియింటికి దిక్కులేదు" అనే లోకోక్తిని త్రోసివేయరాదు దిక్కు అనగా తూర్పు, పడమర, దక్షిణము, ఉత్తరములు సరిగాలేని యింటికి దిక్కు అనగా యజమాని లేక ఆదరించువాడు ఉండడని అర్థము. మన సంస్కృత గ్రంథము లన్నిటియందు యీ విషయమును ధృవపరచు "దిగ్మూఢేకుల నాశస్యాత్ వక్రేదారిద్ర్య మాదిశేత్" అని చెప్పబడినది. కులనాశన మనగా వంశ నాశనము, దిక్కులేనిదన్నిగదా యర్థము. కావున యిండ్లు నిర్మించుకొను నప్పుడు తప్పక దిక్కులను సాధించుకొవవలయును.

ఈ దిక్సాధన ప్రస్తుత కాలమున దిక్సూచి యంత్రము ద్వారా సాధింపబడుచున్నది. లేదా రాత్రియందు ధృవనక్షత్రమును గుర్తించి సూత్రమును బట్టి దిక్సాధనచేయుట యుక్తము. మొదటి గృహనిర్మాణస్థలమునకు తూర్పు రేఖ (అందు)యందు దిక్సూచి యంత్రమునకు సరిగా సూత్రమును లాగిపట్టి ఉత్తర దక్షిణ దిక్కులను గుర్తించవలెను, అట్లు సరిగా ఉత్తర దక్షిణ దిక్కులు గుర్తించిన పిమ్మట ముందుగా స్థలమునకు ఆగ్నేయమున అనగా సూత్రమునకు దక్షిణపుకొనయందు కొయ్యను పాతవలెను. పిమ్మట సూత్రమునకు ఉత్త

రపు కొనయందుగూడ కొయ్యను పాతి సూత్రమును బిగించి ఆగ్నేయమూల యందు మూలమట్టనకు సూత్రమును సవరించి స్థలమునకు దక్షిణపు అంచున నైఋతి మూలవరకు సూత్రమును పొడిగించి అక్కడ కొయ్యను పాతవలెను. పిమ్మట నైఋతి మూలయందు మూలమట్టమునకు సూత్రమును సవరించి స్థలమునకు పడమర అంచు మీదుగా వాయవ్య మూలవరకు సూత్రమును బట్టి అక్కడగూడ కొయ్యను పాతవలెను. పిమ్మట వాయవ్య మూలయందు సూత్రమును మూలమట్టమునకు సవరించి ఆ సూత్రమును ఈశాన్య మూలయందు గల కొయ్యవరకు సాచి బిగించవలెను. అట్లు సవరించిన సూత్రమునకు మధ్య గల స్థలమునకు నాలుగు దిక్కులు సమానముగా నుండి చతురస్రముగా గాని లేక ఆయతముగాగాని యేర్పడును. అట్టి భూమికి శుద్ధప్రాచీయనిపేరు. దీన్నికే బ్రాహ్మీప్రాచీయనగూడ నామాంతరము గలదు. ఇట్టి స్థలమున గృహము నిర్మించుకొని నివసించువారు ఆధ్యాత్మిక చింతనగలవారై సుఖింతురు,

## ❋ ఈశప్రాచీ ❋

పైన వివరించిన నాలుగుసూత్రముల మధ్యస్థమగు "శుద్ధప్రాచీ"యను స్థలమునకు ఈశాన్య మూలయందలి కొయ్యను ఒక అంగుళము తూర్పుగాను ఒక అంగుళము ఉత్తరముగాను జరిపి మరల పాతవలయును. ఆ పాతిన కొయ్యకు సూత్రమును సరిజేసి కట్టవలయును. అట్లు సరిజేసిన స్థలమునందు ఈశాన్యభాగము కొలదిగ హెచ్చుగనుండును. అట్టి స్థలమునకే "ఈశప్రాచీ" యని మానసారమను గ్రంథమున చెప్పబడినది. ఈ భూమియందు నివసించు ప్రజలు సమస్త ఐశ్వర్యములను అనుభవించుచు కీర్తి ప్రతిష్ఠల నార్జింతురు.

"శుద్ధప్రాచీ" యను భూమికి పైరీతిని ఈశాన్యమునగాక ఆగ్నేయము అంగుళమైనను పెరిగియున్నచో దానికి "అగ్నిప్రాచి" యనిపేరు. అందు నివసించువారికి అనేక కష్టనష్టములు కలుగును ఆరోగ్యము చెడును, మిత్రులు శత్రువులగుదురు. బంధువులు దూరమగుదురు మనశ్శాంతి నశించును. కాబట్టి యెంతమాత్రము ఆగ్నేయము పెరిగియుండరాదు.

## ❋ దిగ్మూఢము అనగా నేమి? ❋

దిగ్మూఢము అనగా దిక్కులు లోపించుటయని అర్థము. ఇక్కడ ఒక ముఖ్యవిషయము గమనింపవలసియున్నది. కొందరు ఈశాన్యమూల యెంత

పెరిగియున్న అంత మంచిదని ఆ మూలను నియమ విరుద్ధముగా సాగదీయు చున్నారు. ఇది శాస్త్రవిరుద్ధము. ఎందుచేతననగా నాలుగు దిక్కులు సమానంగామన్న స్థలమునకు యేదోయొక్క దిక్కును మిక్కిలిగా పొడిగించినచో ఆ స్థలమునందలి మిగిలిన దిక్కులు లోపించునుగదా? మన వాస్తుశాస్త్రములందు యెంత వెదికినను ఈశాన్యము యెంత పెరిగియున్న అంత మంచిదనుమాట కనుపించదు, సరిగదా—

"దిశాంకోణాస్తు చత్వారో నశస్తా భయలక్షణే
తస్మాత్ సర్వప్రయత్నేన శుద్ధం ప్రాచీం సమాశ్రయేత్"

అని శాస్త్రమునందు చెప్పబడియున్నది. కాబట్టి గృహనిర్మాణ స్థలము నాలుగు దిక్కులు సమముగ నుండవలెను. ఈశాన్య మూలయందు, మాత్రము అంగుళ మాత్రము హెచ్చుగ నుండవచ్చును. స్థలముయొక్క నాలుగు అంచులు వంకరలు లేక సూత్రమునకు సరిచేసుకొనవలెను, హెచ్చుతగ్గులు గల భూమిని బయటకు వదలిపెట్టి నాలుగు దిక్కులయందు సరిహద్దు గట్టుగాని లేదా ప్రాకారము గాని ముందుగా నిర్మింపవలయును.

## ❋ గృహ నిర్వచనము ❋

వాస్తు శాస్త్రమునందు నాలుగు దిక్కులయందు నాలుగు యిండ్లు చెప్పబడినవి, 1) తూర్పుయిల్లు, 2) దక్షిణపు యిల్లు 3) పడమటయిల్లు 4) ఉత్తరపు యిల్లు. వాస్తుపురుష ననుసరించి విచారించినచో తూర్పు ముఖద్వారము గల యిల్లు, దక్షిణ ముఖద్వారముగల యిల్లు, పడమట ముఖద్వారముగల ఇల్లు ఉత్తర ముఖద్వారముగల యిల్లు అని నాలుగు యిండ్లు చెప్పబడినవి. శాస్త్రములయందు కోణదిశల పేరుతో గృహములు చెప్పబడలేదు. కావున నాలుగు ప్రధాన దిక్కులకు నాలుగు వీకశీలు చెప్పబడినవి,

అయితే ఈ గృహనిర్వచనమునందు మతభేదము గలదు. కొందరు గృహనిర్మాణ స్థలమునందు యేదిక్కున కట్టిన యింటికి ఆ యిల్లని పేరుపెట్టు చున్నారు, ఎట్లనగా—

"చతురశ్రం సమంకృత్వా త్రిపుటే నవకోష్ఠకం"

అను ప్రమాణము ననుసరించి గృహనిర్మాణ స్థలమును 9 సమభాగములుచేసి మధ్యభాగమును విడిచిపెట్టినచో మిగిలిన ఎనిమిది భాగములు స్థలమునందు

ఎనిమిది దిక్కులగుచున్నవి. అందు నాలుగు ప్రధానదిక్కులకు లభించినభాగమున గృహము నిర్మించుట ఇట్లుగాక కోణములందు కట్టిన యింటికి యేమని పేరుపెట్టుదుము. ఈ విషయమున మయవాస్తువందు 1) అన్నాలయము 2) ధాన్యాలయము 3) ధనాలయము 4) సుఖాలయము అను పేర్లు ముఖ్యముగా చెప్పబడినవి. ఈ విషయమున చర్చించుటకిందు చోటుచాలదు. కాబట్టి రెండవ వర్గమునకు చెందిన పాదమును వివరింతుము.

ముఖద్వారమును బట్టి యిల్లును నిర్ణయించుటయే రెండవ వర్గమువారి పద్ధతి. ఈ పద్ధతియే విశేష ప్రచారమునందున్నది. ఆచరణ సాధ్యమైన నిర్ణయము. అంతేగాక శాస్త్రప్రమాణముకూడ ఈ పద్ధతికే మిక్కిలి బలమును చేకూర్చుచున్నది. ఎందువేతననగా మానవాస్తు పురుష నిర్ణయమునందు విశ్వకర్మ ప్రకాశిక యిట్లు వివరించుచున్నది. ఇది ఆధునిక కాలమున ఆచరణసాధ్యమై ఒప్పుచున్నది. మరియు భూ పరిభ్రమణము ననుసరించి రూపొందింపబడిన విధి.

త్రిషు త్రిషుచ మాసేషు నభస్యాదిషు చక్రమాత్
యిద్దిన్ముఖో వాస్తు నర స్తన్ముఖం సదనం శుభమ్ ॥

యిందు వాస్తుపురుష ననుసరించి ముఖద్వారమే నిర్ణయింపబడినది గాని స్థలమునందు ఫలాని దిక్కునందలి చెప్పబడలేదు. మరియు అపరాజితపృచ్ఛ 148 వ పేజీ యందలి విషయముగూడ వాస్తుపురుష ననుసరించి ముఖద్వార నిర్ణయమే చెప్పబడినది

"కన్యా తులా వృశ్చికేచ భాస్కరో యది సంస్థితః
పూర్వేముఖం న కర్తవ్యం గృహం భవతి నిష్ఫలం॥"

ఇట్లే నాలుగుదిక్కులకు చెప్పబడినది. కాబట్టి సింహద్వారమును బట్టియే గృహనామమును నిర్ణయించుట యుక్తము. ఆ ప్రకారముగా యీ క్రింది నాలుగు యిండ్లు యేర్పడుచున్నవి :-

**తూర్పుయిల్లు :-** పడమర సింహద్వారము తూర్పున పాణిద్వారముగల యింటికి తూర్పుయిల్లని పేరు దీనికి తూర్పు దిశకంటె పడమరగల స్థలము ఎక్కువ యుండవచ్చును. తూర్పుయింటికి కార్తీకము, మార్గశిరము. మాఘ మాసములందు గృహారంభము చేయవచ్చును దీనినే మయుడు అన్నాలయమని వివరించినాడు.

దక్షిణపు యిలు :- ఉత్తరమున సింహద్వారము, దక్షిణమున పాణిద్వారముగల యిల్లు దక్షిణపు యిల్లు, దీనికి ఉత్తరమున దక్షిణముకంటె యెక్కువ ఖాళీస్థలము ఉండవలయును. దీనికి మార్గశిర, మాఘ, ఫాల్గుణ, చైత్ర, వైశాఖమాసములందు గృహారంభము చేయవచ్చును. ఇది ధాన్యాలయము.

పడమట యిల్లు :- తూర్పున సింహద్వారము, పడమట పాణిద్వారము గల యిల్లు పడమటిల్లు, దీనికి పడమరకంటె తూర్పున కొంచెము హెచ్చు ఖాళీ స్థలము ఉండవలెను. ఫాల్గుణ, చైత్ర, వైశాఖ, శ్రావణ మాసములందు గృహారంభము చేయవచ్చును ఇది ధనాలయము.

ఉత్తరపు యిల్లు :- దక్షిణమున సింహద్వారము ఉత్తరమున పాణిద్వారముగల యిల్లు. దీని ఉత్తరదిశకంటె దక్షిణదిశ స్థలము ఎక్కువ ఉండవచ్చును. దీనికి శ్రావణ కార్తికమాసముల యందు గృహారంభము చేయవచ్చును. దీనికి సుఖాలయమని పేరు.

గమనిక :- ఆధునికులు కొందరు యే గృహమునకైనను పడమరకంటె తూర్పు స్థలము, దక్షిణముకంటె ఉత్తరపుస్థలము హెచ్చుగ లేనిచో మహాదోషమని చెప్పుచున్నారు. అది పూర్తిగా శాస్త్రవిరుద్ధము. మన భారతీయ వాస్తు గ్రంథములందు దక్షిణదిశ యెంత ఖాళీగాయున్న అంత శ్రేష్ఠము, ఆరోగ్యప్రదము అని చెప్పబడినది చూడుడు—

"ఉత్తరేద్విగుణా భూమిః సమభూమిశ్చ పూర్వకే
పశ్చిమే త్రిగుణాభూమిః క్రోశమేకంతు దక్షిణే"

అని విశ్వకర్మ ప్రకాశిక 217 పేజీయందు యింటి నాలుగు దిక్కులయందు ఉండవలసిన ఖాళీస్థలమును గూర్చి చెప్పబడియున్నది గృహముయొక్క ఎతుకు రెండురెట్లు భూమి ఉత్తరమునను, తూర్పున సమానముగు భూమి పడమట మూడురెట్లుభూమి, దక్షిణమున క్రోసెడుభూమి అని చెప్పబడినది ఇక్కడ క్రోసెమనగా ఎక్కువయని అర్థము. కాబట్టి యింటికి నాలుగు దిక్కులయందు ఆయా వర్గులవారికి తగిన విధంగా స్థలమును విడిచిపెట్టవలెను. అందరకు ఒకే పద్ధతిలో దక్షిణ పశ్చిమములకంటె తూర్పు ఉత్తరములే హెచ్చుగ నుండవలసిన నియమములేదు. ఈ విషయమున మయుడు అన్నాలయ, ధాన్యాలయ ధనాలయ, సుఖాలయ నిర్మాణవిధియందు స్పష్టముగా వివరించియున్నాడు.

## ❋ వర్గులు — దిక్కులు ❋

గృహ నిర్మాణ స్థలమును చతురస్రముగ సవరించిన పిమ్మట దాని యందు ఎనిమిది దిక్కులను ఆ ఎనిమిది దిక్కులయందు ఎనిమిది వర్గులను యీ క్రింది విధముగా నిర్ణయించుకొనవలెను.

ఇచ్చట కనపరచిన విధముగా స్థలమును తొమ్మిది సమ భాగములుగా విభజించినచో ఆయా దిక్కులకుగల వాటా అంతంత యని తెలియగలదు.

స్థలమునందలి యెనిమిది దిక్కులకు భాష యందలి ఏబైయారు అక్షరములను యెనిమిది వర్గులుగా విభజించియున్నారు. వీటినే "అష్టవర్గులు" అందురు.

| శ | అ | క |
|---|---|---|
| ఈ | తూ | ఆ |
| య ఉ | | ద చ |
| వా | ప | నై |
| వ | త | ట |

గృహకర్త పేరునందలి మొదటి అక్షరము ఈ ఎనిమిది వర్గములలో ఏ వర్గమునందున్నదో అతడా వర్గునకు చెందినవాడగును. ఆ వర్గునకు చెందిన దిక్కు అతనికి స్వస్థానము. ఆ దిక్కునకు ఐదవదిక్కు అతనికి శత్రుస్థానము. కాబట్టి శత్రుస్థానమున గృహము నిర్మించరాదని తెలియవలెను.

## ❋ దిక్కులు — వర్గులు ❋

| దిక్కులు | అధిపతులు | వర్గులు | వర్గాక్షరములు |
|---|---|---|---|
| తూర్పు | ఇంద్రుడు | అ, వర్గ | అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ |
| ఆగ్నేయం | అగ్ని | క, వర్గ | క ఖ గ ఘ ఙ |
| దక్షిణం | యముడు | చ, వర్గ | చ ఛ జ ఝ ఞ |
| నైఋతి | నిఋతి | ట, వర్గ | ట ఠ డ ఢ ణ |
| పడమర | వరుణుడు | త, వర్గ | త థ ద ధ న |
| వాయవ్యం | వాయువు | ప, వర్గ | ప ఫ బ భ మ |
| ఉత్తరం | కుబేరుడు | య, వర్గ | య ర ల వ |
| ఈశాన్యం | రుద్రుడు | శ, వర్గ | శ ష స హ క్ష |

పై నుదహరించిన వర్గుల ననుసరించి యేయే పేర్లు గలవారికి యేయే యిండ్లు శత్రువర్గములగునో గమనింపవలయును. అట్లే యేయే వర్గులవారికి యే యే సింహద్వారములు గల యిండ్లు శుభప్రదములో గూడ నిర్ణయించు కొనవలసియున్నది.

## యేయే వర్గులవారికి యేయే సింహద్వారముంచి గృహము నిర్మించవచ్చును.

### ❋ తూర్పు యిల్లు ❋

"తూర్పుయిల్లు అనగా పడమర సింహద్వారము, తూర్పున పాణిద్వారము గల యిల్లు. దీనికి తూర్పు దిశకంటె పడమర దిశయందు హెచ్చుస్థలము ఉండవచ్చును. పడమర సింహద్వారముగల ఈ ఇంటికి ఆగ్నేయమున వంట యిల్లు యేర్పరచవలెను.

అ-క-చ-ట- వర్గులవారికి వృషభ-మిధున-తులా-కుంభ-ధనూరాశులవారికి ఈ పడమట సింహద్వారముగల తూర్పుయిల్లు శుభప్రదము.

పడమర సింహద్వారముగల యింటికి "ధ్వజాయము"గల పదములను యెన్నుకొని గృహమును నిర్మింపవలయును తమ్మయ్య, తాతయ్య, ధర్మరాజు మొదలగు పేర్లుగలవారు అనగా తమ పేర్లకు మొదట త-ద అక్షరములు గలవారు పడమర సింహద్వారముగల యిల్లు రాశిరీత్యా నిర్మించుకొనవచును.

### ❋ దక్షిణపు యిల్లు ❋

ఉత్తర సింహద్వారముగల యిల్లు దక్షిణపు యిల్లు. దీనికి ఉత్తరదిశను దక్షిణ దిశకన్న హెచ్చుస్థల ముండవచ్చును. ట-త-వ వర్గులవారికి ఇది శ్రేష్ఠము. చ వర్గువారికి స్వస్థానము.

మేష-వృషభ-కర్కాటక-సింహ-వృశ్చిక-కుంభ-మీన-ధనూ రాశులవారికి ఈ ఉత్తర సింహద్వారముగల యిల్లు నిర్మింపవచ్చును. య వర్గునకుచెందిన రామారావు, రంగయ్య పేర్లు గలవారికి ఈ ఉత్తర సింహద్వారముగల యిల్లు యెన్నడును నిర్మింపరాదు. అంతేగాక అట్టి ద్వారములుగల అద్దె ఇండ్లయందు నివసించినను శత్రు ఋణ, రోగ బాధలు సదా పీడించుచు మనశ్శాంతి లేకుండ చేయును.

ఉత్తర సింహద్వారముగల యింటికి ఆగ్నేయ, నైఋతీదిశలయందు వంటయిల్లు యేర్పరచుకొనవలెను. ధ్వజాయముగాని సింహాయముగాని గల పదములు మాత్రమే దక్షిణపు యింటికి గ్రహింపవలయును గజాయముగల పదము హాని కలుగజేయగలదు.

## ❋ పడమటయిల్లు ❋

తూర్పున సింహద్వారముగల యిల్లు పడమటిల్లుగా వ్యవహరింపబడుచున్నది. దీనికి పడమరకంటె తూర్పున హెచ్చు స్థలముండుట శ్రేష్ఠము. ఈ పడమటిల్లు త-య-శ వర్గులవారికి అనగా తమ్మయ్య, తాతయ్య. నారయ్య, దానయ్య, వెంకయ్య, వీరన్న, సూరన్న మొ॥ పేర్లు గలవార్లకు శుభప్రదము

మరియు మేష-కర్కాటక-సింహ-వృశ్చిక-ధను-ర్మకరరాసుల వారికి ఈ తూర్పు సింహద్వారముగల పడమటిల్లు శ్రేష్ఠమైనది. రాశిరీత్యా శుభప్రదమగు ఆ వరుసకు చెందిన అచ్చియ్య, అమ్మన్న మొదలగు పేర్లుగలవారు మాత్రం ఈ తూర్పు సింహద్వారముగల యిల్లు యెన్నడను నిర్మింపరాదు అట్టి ద్వారముగల అద్దె యిండ్లయందును నివసించుట శ్రేష్ఠముగాదని గ్రహింపవలయును. వృషభాయముతో పడమటిల్లు నిర్మించుట మిక్కిలి శ్రేష్టము. గజాయము ధ్వజాయముకూడ గ్రహించుట ఆచారసిద్ధము.

ఈ తూర్పు సింహద్వారముగల ఇంటికి ఆగ్నేయమున అనగా ఇంటికి ముఖభాగమున వంటయిల్లు నిర్మింపరాదు. యింటికి వృష్టభాగమున అనగా వెనుక భాగమున నైఋతియందు వంటశాల నిర్మింపవలెను.

## ❋ ఉత్తరపుయిల్లు ❋

దక్షిణమున సింహద్వారముగల యిల్లు ఉత్తరపు యిల్లు దీనికి ఉత్తరముకంటె దక్షిణదిశను హెచ్చు స్థలముండవచ్చును. ఇది య-శ- వర్గులవారికి మిక్కిలి శ్రేష్ఠమైనది. ట-త-వ వర్గులవారికు నిర్మింపవచ్చును.

వృషభ-మిధున-కర్కాటక-మకర కన్యా రాసులవారికి ఇది శ్రేష్ఠము. కాని "చ" వర్గునకు చెందిన జానకీరాం జగన్నాధం మొదలగు పేర్లు గలవారు మాత్రము దీనిని నిర్మింపవచ్చును. ఇట్టి ద్వారముగల యిండ్లలో "చ" అక్షరము పేర్లు మొదటగా గలవారు అద్దెకు నివసించుట శ్రేష్టముగాదు. ఉత్తరపు యింటికి గజాయము, ధ్వజాయము గ్రహించుట మిక్కిలి శ్రేష్టము. సింహా

యము కలహప్రదము గ్రహింపరాదు.

ఈ దక్షిణ సింహద్వారముగల యింటికి గృహమునకు వెనుక భాగమున వాయవ్యమునందు వంటశాల నిర్మించుకొనవచ్చును. ఈశాన్యముక ఏ సింహ ద్వారము గల యింటికైనను వంటచేయరాదు.

## ❋ సింహద్వార నిర్ణయము ❋

గృహనిర్మాణమునందు సింహద్వార నిర్ణయమే మిక్కిలి ప్రధానమైనది ఎందుచేతననగా "గాత్రస్య సర్వస్య శిరఃప్రధానం" అనగా సమస్త మానవ శరీరమునకు శిరస్సే ప్రధానముగదా? అట్లే గృహస్వరూపుడగు వాస్తుపురుషు నకు సింహద్వారము ముఖముగా వాస్తుశాస్త్రములయందు వర్ణింపబడినది అవ యవములన్నియు యెంత అందముగనున్నను ముఖము కళదప్పినచో యే మందును. అట్లే సింహద్వార నిర్ణయమునందు గూడ చాల మెలకువ గలిగి యుండవలెను ఈ క్రింది చెప్పిన ఐదు విధముల సింహద్వారమును గూర్చి విమర్శింపవలసియున్నది.

1) వర్గు ననుసరించి 2) నామరాశి ననుసరించి 3) ఆయము ననుసరించి 4) స్థలము ననుసరించి 5) వాస్తుపురుష ననుసరించి,

ఇచట స్థలము ననుసరించి యనగా ప్రాకారముదాటి వీధినుండి తిన్నగ యింటిలోనికి ప్రవేశించుట శ్రేష్ఠము అట్లు వీధివైపునకు సింహద్వారముపెట్టు టకు వీలుకుదరనిచో ప్రాకారముదాటి లోనికి ప్రవేశించగనే మన యెడమచేతి మీదుగా తిరిగి అనగా ప్రదక్షిణ క్రమముగా తిరిగి యింటిలోనికి ప్రవేశించుట శుభప్రదము. మరియు సింహద్వారమునకు యెదురుగా మాతులుగాని, వృక్షములుగాని రాజమార్గములుగాని యుండరాదు

## ❋ వాస్తు పురుష నిర్ణయము ❋

వాస్తుపురుష నిర్ణయము ప్రధానముగ గృహారంభ ముహూర్తమునకు సంబంధించిన విషయము. వాస్తుపురుషుని బట్టియే యేయే నెలలలో ప్రారంభించిన యింటికి యేయే ముఖద్వారము లుంచవచ్చునో చెప్పబడినది.

ఈ వాస్తుపురుష నిర్ణయము మూడు విధములు !

1) స్థిరవాస్తు పురుషుడు, 2) చరవాస్తు పురుషుడు 3) దినవాస్తు పురుషుడు.

స్థిరవాస్తు పురుషుడు :- ఈ స్థిరవాస్తు పురుషుడు గృహనిర్మాణ క్షేత్రమున సమస్తవాస్తుపద దేవాతాత్మకుడై ఈశాన్యకోణమున శిరస్సు నైఋతిదిశయందు పాదములు కలవాడగుచు ఎడమప్రక్కగా శయనించియుండునని వాస్తు శాస్త్రములు చెప్పుచున్నవి. చతుష్షష్టి పదవాస్తు, ఏకాశీతి పదవాస్తు, శత పదవాస్తు అను పదత్రయ వాస్తు దేవతా పదభోగనిర్ణయము ఈ స్థిరవాస్తుపురుష ననుసరించియే చేయవలయును.

చరవాస్తు పురుషుడు :- ఈ చరవాస్తు పురుషుడు....

1. భాద్రపద, ఆశ్వయుజ, కార్తీకమాసములు = తూర్పుశిరస్సుగను
2. మార్గశిర, పుష్య మాఘమాసములు = దక్షిణ శిరస్సుగను
3. ఫాల్గుణ, చైత్ర, వైశాఖమాస ు = పడమర శిరస్సుగను
4. జ్యేష్ట, ఆషాఢ, శ్రావణ మాసములు = ఉత్తర శిరస్సుగను

యెడమ పార్శ్వముగ శయనించియుండును. ఈ చరవాస్తు పురుష ననుసరించియే గృహారంభ నకు ముహూర్తము నిర్ణయించవలయును.

"యద్దిన్ముఖోవాస్తు నరః తన్ముఖంప ధనం శుభం"

అను వాక్యము గమనింపవలయును.

1) తూర్పు శిరస్కుడు ;- భాద్రపద, ఆశ్వయుజ, కార్తిక మాసములందు వాస్తుపురుషుడు తూర్పుశిరస్సు పడమర కాళ్ళు గలిగి యెడమప్రక్కగా శయనించును కాబట్టి అతని పూర్ణదృష్టి దక్షిణమున పడును. పాదదృష్టి పశ్చిమముగ ప్రసరించును. అట్టి కాలమున అనగా ఆశ్వయుజ కార్తీకమాసములందు దక్షిణ సింహద్వారము పశ్చిమ సింహద్వారముగల యిండ్లకు శంకుస్థాపన చేయువచ్చును,

2) దక్షిణ శిరస్కుడు :- మార్గశిర పుష్య మాఘమాసముల యందు వాస్తు పురుషుడు దక్షిణమున శిరస్సును, ఉత్తరమున కాళ్ళు ఉంచి వామపార్శ్వముగ శయనించును. అతని పూర్ణదృష్టి పడమరగాను పాదదృష్టి ఉత్తరముగాను ప్రసరించును, కాబట్టి ఆ కాలమున అనగా మార్గశిర, మాఘమాసములందు పడమర సింహద్వారము, ఉత్తర సింహద్వార గృహములు నిర్మింపవచ్చును.

3) పశ్చిమ శిరస్కుడు :- ఫాల్గుణ, చైత్ర, వైశాఖ మాసములయందు వాస్తుపురుషుడు పడమర శిరస్సును, తూర్పున పాదములు వుంచి యెడమ ప్రక్కగా శయనించును, అతని పూర్ణదృష్టి ఉత్తరముగను, పాద దృష్టి

తూర్పుగను ప్రసరించుచుండును. కాబట్టి ఫాల్గుణ, చైత్ర, వైశాఖ మాసములు యందు ఉత్తర సింహద్వారము, తూర్పు సింహద్వారముగల యిండ్లకు శంఖు స్థాపన చేయవచ్చును.

4) ఉత్తర శిరస్కుడు :— జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణమాసములయందు వాస్తు పురుషుడు ఉత్తరమున శిరస్సు, దక్షిణమున పాదములుపుంచి యెడమప్రక్కగా శయనించును. అతని పూర్ణదృష్టి తూర్పునకును, పాదదృష్టి దక్షిణమునకను ప్రసరించుచుండును. కావున జ్యేష్ఠ, శ్రావణములలో తూర్పు సింహద్వారము దక్షిణ సింహద్వారముగల యిండ్లకు శంఖుస్థాపన చేయవచ్చును.

## ❋ దినవాస్తు పురుషుడు ❋

శరవేగమున పురోగమించుచున్న యీ కాలమున మానవుని అవసరాలు దినదినమునకు మిక్కిలిగా పెరిగిపోవుచున్నవి. ఈ కాలమున మాసవాస్తు పురుషుని అనుసరించునంతటి ఓర్పు ప్రజలలో కనుపించుటలేదు. ఈ భవిష్యత్తును గుర్తించియే కాబోలు దూరదృష్టిగల కాళిదాసమహాకవి తాను రచించిన కాలామృతమను గ్రంథమున "దినవాస్తు"వును వివరించెను.

దినవాస్తు పురుషుడు :— ఈ దినవాస్తు పురుషునకే క్షణిక వాస్తు పురుషుడని పేరు. మాసవాస్తు పురుషుడు మూడేసి మాసములకు తూర్పు మొదలు నాలుగు దిక్కులకు ఎట్లు పరిభ్రమించునో అట్లే ఈ దినవాస్తు పురుషుడుగూడ సూర్యోదయము మొదలు మరల సూర్యోదయమువరకు ఝామునకు ఒకదిక్కుచొప్పున రెండుమార్లు తిరుగును. అనగా ఉదయము నుండి మొదటి ఝామున ఉత్తర శిరస్సుగను, రెండవఝామున తూర్పు శిరస్సుగను, మూడవ ఝామున దక్షిణ శిరస్సుగను, నాలుగవ ఝామున పడమర శిరస్సుగను, మరల రాత్రి మొదటిఝామున ఉత్తర శిరస్సుగను పరిభ్రమించుచుండును. ఇది బహు సూక్ష్మమగు పరిశీలనము. వస్తువు అణురూపము చెందినకొలది దానిశక్తి ఎట్లు పెరుగుచున్నదో అట్లే కాలమును సూక్ష్మవిభాగ మొనర్చినకొలది మిక్కిలిశక్తివంతము కాగలదు. దీనికి ముహూర్తనిర్ణయమే ఉదాహరణము. కాబట్టి ఈదినవాస్తుపురుషు ననుసరించిగూడ గృహములు నిర్మించుకొనుట శాస్త్రసమ్మతము.

## ❋ షోడశ గృహములు ❋

గృహనిర్మాణ మొక పరమపవిత్రమగు కార్యము. తపశ్శక్తి సంపన్న

లగు మహర్షులు, సంగీతమును, సాహిత్యమును గురుల రూపాత్మకముగ ఛందోబద్ధ మొనర్చిరి అట్లే యీ గృహనిర్మాణ పద్ధతియు గురులఘు రూపాత్మకమగు ఛందోబద్ధమైనదియే. వాస్తుశాస్త్రమున "గురువు" అనగా గోడ, "లఘువు" అనగా అళిందము. అళిందమున్నచోట ద్వారముండవలయును. ద్వారమున్నచోట అళిందముండవలెను ద్వారమునకు అళిందమునకు విడదీయ రాని సంబంధమున్నది. ఈ గురులఘువులు ప్రాతిపదికగా గ్రహించి మొదటి ప్రస్తారమున నాలుగు దిక్కులకు నాలుగు గురువులు ఆధారముగా "నాలుగు గురువుల ప్రస్తారము" సిద్ధపరచబడినది. ఇందు మొదటి గురువు తూర్పు, రెండవ గురువు దక్షిణము, మూడవగురువు పడమర, నాలుగవ గురువు ఉత్తరము ఈ నాలుగు గురువుల ప్రస్తారము ననుసరించి 16 ఏకశాలలు యేర్పడుచున్నవి వీటికే షోడశ గృహములని పేరు.

ఈ షోడశ గృహప్రస్తారక్రమము, వాటిపేర్లు, వాటి శుభాశుభఫల నిరూపణము సమస్త వాస్తుగ్రంథములయందు ఒకేవిధముగా చెప్పబడినది. మానవ గృహనిర్మాణమునకు యిదియే మూలసూత్రము. ఇందు మతభేదములు లేవు.

## ❋ నాలుగు గురువుల ప్రస్తారము ❋

| | తూర్పు | దక్షిణ | పడమర | ఉత్తరం | పేరు | వసారాలు, గుమ్మముల వివరము |
|---|---|---|---|---|---|---|
| 1 | ⌣ | ⌣ | ⌣ | ⌣ | ధృవము | ద్వారములేని యిల్లు |
| 2 | I | ⌣ | ⌣ | ⌣ | ధాన్యము | తూర్పున మాత్రమే ద్వారము గలది |
| 3 | ⌣ | I | ⌣ | ⌣ | జయము | దక్షిణమున మాత్రమే ద్వారము గలది |
| 4 | I | I | ⌣ | ⌣ | నందము | తూర్పు, దక్షిణ ద్వారములు గల యిల్లు |
| 5 | ⌣ | ⌣ | I | ⌣ | ఖరము | పడమరకు మాత్రమే ద్వారము గలది. |
| 6 | I | ⌣ | I | ⌣ | కాంతము | తూర్పు పడమరలు ద్వారములుగల యిల్లు |
| 7 | ⌣ | I | I | ⌣ | మనోరమం | దక్షిణ, పడమర ద్వారములుగల యిల్లు |
| 8 | I | I | I | ⌣ | సుముఖము | తూర్పు, దక్షిణ, పడమర ద్వారములు గలది |
| 9 | ⌣ | ⌣ | ⌣ | I | దుర్ముఖము | ఉత్తరమునమాత్రమే ద్వారముగల యిల్లు |
| 10 | I | ⌣ | ⌣ | I | ఉగ్రము | తూర్పు, ఉత్తరముల ద్వారములుగల యిల్లు |
| 11 | ⌣ | I | ⌣ | I | సుపక్షము | దక్షిణోత్తరములకు ద్వారములుగల యిల్లు |
| 12 | I | I | ⌣ | I | ధనదము | తూర్పు,దక్షిణ, ఉత్తరద్వారములుగల ఇల్లు |

| | | | |
|---|---|---|---|
| 13 | ⌣ ⌣ \| \| | క్షయము | పశ్చిమోత్తరముల ద్వారములుగల యిల్లు |
| 14 | \| ⌣ \| \| | ఆక్రందము | తూర్పు, పడమర, ఉత్తరముల ద్వారములు గలది. |
| 15 | ⌣ \| \| \| | విపులము | దక్షిణ, పశ్చిమ, ఉత్తరద్వారములు గలది |
| 16 | \| \| \| \| | విజయము | నాలుగు దిశలకు ద్వారములుగల యిల్లు |

---

ప్రతీ గృహమునందు రెండు ప్రధాన భాగములుండును. అందు మొదటిది శాలాభాగము. దీనికే గర్భము అను పేరు వాడుకలోనున్నది. రెండవభాగము "అళిందభాగము, అళిందము" అనగా వరండాయని తెలిసికొనియుంటిమి శాలాభాగమునందు యేదిక్కున ద్వారము పెట్టితిమో ఆయాదిక్కులందు వరండాలు తప్పక నిర్మింపవలయును. ఈ ప్రక్కనుచూపిన ప్రస్తార చక్రమునందు యీ వసారాలు లేక అళిందములను బట్టియే పదహారు రకములైన యిండ్లు యేర్పడుచున్నవి. వసారాలు లేకుండ శాల నిర్మించరాదు.

ఈ పదహారు రకములైన యిండ్లలోను ప్రస్తుతము మనకు వాడుకలోనున్నవి. శుభప్రదములైనవి అయిన ధాన్యశాల, జయశాల, కాంతశాల. సుపక్షశాల, ధనదశాల, విజయశాలఅను ఆరురకముల యిండ్లనుగూర్చి మాత్రమే యిట్లు వివరింపబడుచున్నది.

ధాన్యశాల :- పడమటగోడను చేర్చి తూర్పు దిక్కున మాత్రమే ద్వారము తూర్పున వసారాపెట్టి నిర్మించిన యింటికి ధాన్యశాలయని పేరు. ధాన్యశాలకు వృషభాయము శ్రేష్ఠము. గజాయముకూడ ఉంచవచ్చును. ఇది త, య, శ వర్గులవారికి శుభప్రదమైనది.

జయసాల :- ఉత్తరపు గోడనుచేర్చి దక్షిణ సింహద్వారము దక్షిణమున వరండాపెట్టి కట్టినయింటికి జయశాలయని పేరు. దీనికి గజాయము ఉంచుట శ్రేష్ఠము. ఇది య, ట, త, ప వర్గులవారికి శుభప్రదము.

కాంతశాల :- తూర్పుపడమరలకు ద్వారములుంచి తూర్పున ఒక వరండా పడమర ఒక వరండాపెట్టి నిర్మించిన యింటికి కాంతశాల యనిపేరు దీని వెనుబద్ధ దక్షిణోత్తరములతుండును. ఇది మిక్కిలి శ్రేష్ఠమైనది. కాంతశాలకు పడమర సింహద్వారముంచినచో ధ్వజాయము తూర్పున సింహద్వారముంచినచో వృషభాయముగాని, గజాయముగాని పెట్టుట శుభప్రదము.

సుపక్షశాల :- దక్షిణోత్తరములకు గుమ్మములుంచి దక్షిణమున ఒక వరండా ఉత్తరమున ఒక వరండాపెట్టి తూర్పు పడమరలకు కిటికీలుమాత్రమే ఉంచి కట్టిన యిల్లుకు సుపక్షశాల యనిపేరు దీని వెనుబద్ధ తూర్పుపడమరల కుండును, సుపక్షశాలకు దక్షిణ సింహద్వారముంచినచో గజాయమును ఉత్తర సింహద్వారముంచినచో సింహాయమును పెట్టుట శ్రేష్టము

ధనదశాల :- పడమరగోడను చేర్చి కట్టినయింటికి ధనదశాల యనిపేరు ధనదశాలకు దక్షిణమున, తూర్పున, ఉత్తరమున మూడువసారాలు నిర్మింప వలయును. శాలాభాగమున మూడువైపులగల వరండాల లోనికి ద్వారము లుంచవలెను దీని వెనుబద్ధ ఉత్తర దక్షిణముల కుండును. పడమరకు కిటికీలు మాత్రమే ఉంచవలెను. వృషభాయము ఉంచుట శ్రేష్టము. గజాయముగూడ ఉంచవచ్చును. ఇది త, య, శ వర్గులవారికి మిక్కిలి శుభప్రదమైన యిల్లు.

విజయశాల :- విజయశాల యనగా శాలాభాగముమండి నాలుగుదిశలకు ద్వారములు నాలుగు దిక్కులయందు వసారాలగల యిల్లు అనగా చుట్టు వసారాలుగల యిల్లని యర్థము. ఇది చాలా జయప్రదమైన నిర్మాణము. సింహద్వారమునకు తగిన ఆయమును గ్రహించి నిర్మింపవలయును. కర్త వర్గునకు లేక రాశికి అనుకూలమగు విధముగ సింహద్వారమును నాలుగు దిక్కులలోను యే దిక్కునందైనను నిర్మింపవచ్చును.

పై ఆరుశాలలు గాక మిగిలిన పదిశాలలు అంతగా వాడుకలోలేవు కాని ఆ పదింటిలోని మిక్కిలి నింద్యములని యెంతమాత్రము నివాసగృహములుగా ఉపయోగింపకూడదని నిషేధింపబడినవి అయిన దుర్ముఖము, ఉగ్రము అను రెండుయిండ్లు కొలది కాలమునుండి శాస్త్రజ్ఞానములేని కొందరు బహుళ ప్రచారములోనికి తెచ్చినారు. వాటినిగురించి మాత్రము యిట్లు వివరించుచున్నాము

దుర్ముఖము :- దక్షిణపుగోడను చేర్చి ఉత్తరమున సింహద్వారముంచి కట్టిన యింటికి దుర్ముఖమని పేరు. దీనికి ఒక్క ఉత్తరదిశమాత్రమే వరండా యును, ద్వారమును ఉండును, ఈ కాలమున యిట్టి యిండ్లను అనేకమంది నివాస గృహములుగా నిర్మించుచున్నారు. దుర్ముఖము అనేక దుఃఖములను కలుగజేయును. కాబట్టి శాస్త్రములయందు నమ్మకమున్నవారు యీ విధమగు యిండ్లను నివాసమునకై నిర్మింపరాదు. వంటశాలకు ఉపయోగించవచ్చును.

ఉగ్రము :- నైఋతిమూలను పూర్తిగా మూసివైచి దక్షిణ పడమరలకు

